# వీక్షణం

రాజకీయార్థిక, సామాజిక మాసపత్రిక

సంపుటి : 8 సంచిక : 3 హైదరాబాద్ 104 మార్చ్ 2010 పేజీలు : 60 రు. 10

❖ ఫోకస్ : చిన్న రాష్ట్రాలు - అభివృద్ధి

❖ ధరల సమస్య పట్టని ప్రభుత్వం

❖ నాడు వాకపల్లి - నేడు భల్లుగూడ

❖ ముస్లిం రిజర్వేషన్ల న్యాయబద్ధత

❖ ప్రాంతీయ అస్తిత్వాలు - ఆశ నిరాశలు

❖ బి.టి. వంకాయ వద్దే వద్దు!

❖ మేధావిత్వం ఎందుకోసం?

## వీక్షణం రచయితల సమావేశం – ఫిబ్రవరి 7, 2010 ఆదివారం





వేదికపై వి. హనుమంతరావు, వకుళాభరణం రామకృష్ణ, కె.ఆర్. చౌదరి







104

# వీక్షణం

రాజకీయార్థిక, సామాజిక మాసపత్రిక

సమతా పబ్లికేషన్స్, సెంటర్ ఫర్ డాక్యుమెంటేషన్, రిసర్చ్ అండ్ కమ్యూనికేషన్ ప్రచురణ

మార్చ్ 2010
సంపుటి : 8
సంచిక : 3

గౌరవ సంపాదకులు :
**వి. హనుమంతరావు**

సంపాదకులు :
**ఎన్. వేణుగోపాల్**

సహాయ సంపాదకులు :
**డి.వి.రామకృష్ణారావు**

కరస్పాండెంట్ /
సర్క్యులేషన్ మేనేజర్ :
**వై. రామచంద్రం**
**9949391028**

కరస్పాండెంట్/సబ్ఎడిటర్ :
**సి. రాజశేఖర్**

ఆఫీస్ అసిస్టెంట్ :
**ఎస్. వెంకటేష్**

**వీక్షణం చందా వివరాలు**

| | | |
|---|---|---|
| సంవత్సర చందా | రు. | 120 |
| 3 సంవత్సరాల చందా | రు. | 350 |
| 5 సంవత్సరాల చందా | రు. | 550 |
| 10 సంవత్సరాల చందా | రు. | 1000 |

**'వీక్షణం' పేరిట ఎం.ఓ.లు,**
**డి.డి లు పంపాల్సిన చిరునామా**

**వీక్షణం**
రాజకీయార్థిక, సామాజిక మాసపత్రిక

మైత్రి రెసిడెన్సీ, 3-6-394,
స్ట్రీట్ నెం. 3, హిమాయత్‌నగర్,
హైదరాబాద్ - 500 029.
ఫాక్స్, ఫోన్ : 040-66843495
Email : veekshanam2003@gmail.com
reachcdrc@yahoo.com
www.veekshanam.wordpress.com
వీక్షణం అకౌంట్ నెంబర్ –
**013911011002175**
ఆంధ్రాబ్యాంక్, గగన్‌మహల్ బ్రాంచ్,
హైదరాబాద్

డిస్ట్రిబ్యూటర్స్
**ఆనంద్ ఏజన్సీస్,** హైదరాబాద్.
ఫోన్ : 98484 28516
98482 49695

ప్రింటర్స్
**చరితా ఇంప్రెషన్స్,**
ఆజామాబాద్, హైదరాబాద్
ఫోన్ : 040 - 27678411

సంపాదకీయం

## సమస్య పరిష్కారానికేనా శ్రీకృష్ణ కమిటీ?

ఆందోళన పరుస్తున్న సమస్యలనుంచి ప్రజలను పక్కదారి పట్టించడం, ఒక సమస్య గురించి ప్రశ్నలు తలెత్తుతుంటే మరొక సమస్య సృష్టించడం, మౌలిక సమస్యలను పరిష్కరించకుండా కాలయాపనతో మురగబెట్టడం, నిరసన ప్రకటిస్తున్న ప్రజలమీద దారుణ దమననీతిని అమలుచేసి, సమస్య సమసిపోయేలా చేశాననుకోవడం గత అరవై సంవత్సరాలుగా భారత పాలకవర్గాలు అనుసరిస్తున్న విధానాలు. నిజానికి ఇవి బ్రిటిష్ వలసవాదుల నుంచి నేర్చుకుని అభివృద్ధి చేసిన పద్ధతులే. పాలకవిధానాలకు వ్యతిరేకంగా ప్రజలు నిరసనను తెలుపుతున్నప్పుడు, ఆ నిరసనను ప్రజలలోనే మరొక వర్గం మీదికి, బృందం మీదికి రెచ్చగొట్టడం, మసిపూసి మారేడుకాయ చేయడం కూడ ఇందులో భాగమే. ప్రస్తుతం ఆంధ్రప్రదేశ్ లో, తెలంగాణలో రగుల్కొని సాగుతున్న ప్రజా ఉద్యమాల విషయంలో కూడ ప్రభుత్వాలు ఈ విధానాన్నే అవలంబిస్తున్నాయి. నవంబర్ 29 నుంచి తెలంగాణలో సాగుతున్న, డిసెంబర్ 10 నుంచి 23 వరకు కోస్తాంధ్ర, రాయలసీమలలో సాగిన ఆందోళనల నేపథ్యంలో విస్తృత సంప్రదింపులు జరగవలసి ఉన్నదని భావించినందుకు, ఆ పని కొరకు జస్టిస్ బి ఎన్ శ్రీకృష్ణ నాయకత్వంలో ఐదుగురు సభ్యుల కమిటీని నియమించినందుకు ప్రభుత్వాన్ని తప్పు పట్టనక్కరలేదు. కాని ఆ కమిటీ విచారణాంశాలు రూపొందించడంలో, ఆ కమిటీ కాలవ్యవధి నిర్ణయించడంలో ప్రభుత్వం తనకు అలవాటయిన ప్రజావ్యతిరేక విధానాలనే అనుసరిస్తున్నది. గత ఐదు దశాబ్దాలలో అమలయిన పాలక విధానాలు తెలంగాణకు అన్యాయం చేశాయని, ఆ అన్యాయాన్ని సరిదిద్దాలంటే రాష్ట్రవిభజన తప్పదని తెలంగాణవాదులు అంటున్నారు. అక్కడ వ్యతిరేకత పాలకవిధానాల మీదనే గాని కోస్తాంధ్ర, రాయలసీమ ప్రజలమీద కాదు, కానక్కరలేదు. కాని ఈ పాలనావిధానాల పట్ల వ్యతిరేకతను ఉద్దేశపూర్వకంగానే ప్రజలమధ్య వ్యతిరేకతగా మార్చడం జరిగింది. మధ్యవర్తిగా, తటస్థంగా ఉండి, ఇరుపక్షాలకూ నచ్చజెప్పవలసిన కేంద్రప్రభుత్వం అటువంటి సమన్వయానికి పూనుకోకుండా పిట్టపోరు పిట్టపోరు పిల్లితీర్చిన చందంగా శ్రీకృష్ణ కమిటీ విచారణాంశాలు తయారు చేసింది. అవి తెలంగాణకు అనుకూలంగా ఉన్నాయని సమైక్యవాదులు, సమైక్యాంధ్రకు అనుకూలంగా ఉన్నాయని తెలంగాణ వాదులు అనుకునే స్థితి ఏర్పడిందంటే పాలకవర్గాల కుయుక్తి ఫలించిందన్నమాట. నిజానికి ఆ విచారణాంశాలు ఏ ప్రాంతంలోని ప్రజలకూ అనుకూలంగాలేవు. రెండు చోట్లా పాలకులకు, అందులోనూ పాలకులలోని ఒకటి రెండు ముఠాలకు, అనుకూలంగా ఉన్నాయి. ఆ విచారణాంశాల సారంలోకి కూడ వెళ్లకుండానే రూపంలోని అవకతవకలను బట్టే ఆ విషయం స్పష్టమవుతుంది. చాల అంశాలు పరిశీలిస్తున్నామని చెప్పుకోవడానికి పేరుకు ఏడు విచారణాంశాలు ఉన్నాయి గాని అవి నిజానికి మూడే – తెలంగాణ, సమైక్యాంధ్ర ప్రదేశ్ డిమాండ్ల పరిశీలన, రాష్ట్ర ఏర్పాటు నుంచి ఇప్పటివరకు జరిగిన అభివృద్ధి అంచనా, ఇటీవలి ఉద్యమాల నేపథ్యంలో వివిధ వర్గాల ప్రజల అభిప్రాయాల సేకరణ మాత్రమే. ఇప్పటికే ఈ మూడు అంశాల మీద కుప్పలుతెప్పలుగా సమాచారం పోగుపడి ఉంది. కేంద్ర ప్రభుత్వం తలచుకుంటే ఆ సమాచారాన్ని సేకరించి, క్రోడీకరించి నిర్ధారణలకు రావడానికి ఎక్కువ సమయం పట్టదు. దానికోసం ఒక కమిటీ ఏర్పాటు, అది ప్రజల నుంచి సమాచారం సేకరించడం, సేకరించిన సమాచారాన్ని జల్లెడపట్టి నివేదిక తయారుచేయడం, ఈ పనికంతా పది నెలల సమయం తీసుకోవడం వృథా కాలయాపన మాత్రమే. కేంద్రప్రభుత్వానికి ఈ సమస్యను సామరస్య పూర్వకంగా, త్వరితంగా పరిష్కరించాలనే కోరిక లేదనడానికి ఈ కమిటీ ఏర్పాటే సూచన. సుదీర్ఘకాలపు గడువులు పెడితే ప్రజలు తమను ఆందోళన పరుస్తున్న సమస్యలు మరచిపోతారనీ, లేదా ఆ తర్వాత వచ్చే కొత్త సమస్యలలో పడి కొట్టుకుపోతారనీ, అప్పటికీ మరచిపోక ఇంకా ఆందోళన చేస్తే పోలీసు, పారా మిలిటరీ బలగాలను ఉపయోగించి అణచివేయవచ్చుననీ ప్రభుత్వం ఆలోచిస్తున్నది. జాతీయోద్యమం పొడుగునా బ్రిటిష్ పాలకవర్గాలు ప్రజా ఉద్యమాలతో ఇలాగే వ్యవహరించాయి. కాని జాతీయోద్యమం నానాటికీ బలపడింది, విభిన్న వర్గాలలోకి, విభిన్న మార్గాలలోకి విస్తరించింది. చిట్టచివరికి ప్రజల ఆకాంక్షలకు అనుగుణంగా వలసవాదులు తమ రాజకీయ ఆధిపత్యాన్ని వదులుకోక తప్పలేదు. 1947 తర్వాత కూడ అనేక రాజకీయ, సామాజిక ఉద్యమాల విషయంలో కేంద్ర, రాష్ట్ర ప్రభుత్వాలు, పాలకవర్గాలు ఈ ధోరణినే అనుసరించాయి. కాని సంపూర్ణంగా అణచివేశామనుకున్న ఉద్యమాలతో సహా విభిన్న జాతి, ఆదివాసి, దళిత, రైతాంగ, కార్మిక, విద్యార్థి, ప్రత్యేక రాష్ట్ర ఉద్యమాలు రూపాలు మార్చుకుంటున్నాయేగాని సమసి పోలేదు. అలాగే తెలంగాణ రాష్ట్ర ఉద్యమం కూడ కమిటీలతో, కాలయాపనతో, అణచివేతతో పరిష్కారం అవుతుందనుకోవడం పాలకవర్గాల భ్రమ. ఆ ఉద్యమానికి ప్రజాబలం ఉంటే అది కొనసాగుతూనే ఉంటుంది. దాని వెనుక ఉన్న కారణాలు సరయినవి కావని నమ్మదగిన ఆధారాలు చూపి ప్రజలను ఆ ఉద్యమం నుంచి, ఆ ఆలోచనలనుంచి దూరమైనా చేయాలి. లేదా ఆ కారణాలు సరయినవేననుకుంటే ప్రజలు కోరిన పరిష్కారమైనా చేయాలి. మధ్యేమార్గాలు, వంచనలు, దమనకాండలు పనిచేయవు. వీ

## ఖండించవలసిన శివసేన దౌర్జన్యాలు

ఒకవైపు తెలంగాణలో ప్రత్యేక రాష్ట్రం కోసం సాగుతున్న ఆందోళనలో బహిరాగతుల మీద కొన్ని వ్యాఖ్యలు వెలువడుతుండగానే, మరొకవైపు మహారాష్ట్రలో, ముఖ్యంగా ముంబాయి నగరంలో బహిరాగతులమీద శివసేన సాగిస్తున్న వ్యాఖ్యలు వెలువడుతున్నాయి. కొందరు విశ్లేషకులు చేస్తున్నట్టుగా ఈ రెండు రకాల వ్యాఖ్యలను ఒకేగాటన కట్టడం పొరపాటు. తెలంగాణ ఉద్యమంలోని కొన్ని వ్యాఖ్యలు అభ్యంతరకరంగానే ఉన్నాయి. అయినా ఈ రెండు వ్యాఖ్యలకు మధ్య రాజకీయంగా గాని, సామాజికంగా గాని, చారిత్రకంగా గాని హస్తిమశకాంతరం ఉంది. హిట్లర్ కూడ తన విధానం జాతీయ సోషలిజం అని చెప్పుకున్నాడు గనుక దాన్ని మార్క్సిస్టుల సోషలిజంతో పోలిస్తే ఎలా ఉంటుందో శివసేన వ్యాఖ్యలను తెలంగాణ వ్యాఖ్యలతో పోలిస్తే కూడ అలానే ఉంటుంది. బాల్ థాక్రే నాయకత్వంలోని శివసేన గాని, దానినుంచి విడిపోయి రాజ్ థాక్రే ఏర్పాటుచేసిన మహారాష్ట్ర నవనిర్మాణ సేనగాని హిందుత్వను, మరాఠీని తమ పునాదిగా పెట్టుకున్నాయి. అంటే అది మతోన్మాదం, భాషోన్మాదం కలగలిసిన దురహంకారమేతప్ప దానికి హిందూ ప్రజల, మరాఠీ భాషా ప్రజల జీవితాల మెరుగుదల ప్రయత్నాలతో ఏ సంబంధం లేదు. హిందువులు కాని వారందరిమీద, మరాఠీయేతరులందరిమీద హింసాయుత దాడులు చేయడం దాని లక్ష్యం. శివసేన, ఎం ఎన్ ఎస్ లు నడుపుతున్నవి ప్రజారాజకీయాలు కావు. అది బాధితులయిన ప్రజలు కోల్పోయిన అవకాశాల కోసం, హక్కుల కోసం ఆందోళన కాదు. రైల్వే ఉద్యోగాల పరీక్ష రాయడానికి ఉత్తరాది నుంచి వచ్చిన మరాఠీయేతర పేద ప్రజల మీద దాడి, జయా బచ్చన్, రాహుల్ గాంధీ, షారుఖ్ ఖాన్ వంటి ప్రముఖుల మీద సంచలనం కోసం దాడులు, ముంబయిలో మరాఠీలు కాక మరెవరూ ఉండడానికి వీలులేదని శాసించడం వంటి పనుల ద్వారా శివసేన, ఎంఎన్ఎస్ లు 1930లలో జర్మనీలో హిట్లర్ నాజీలు అనుసరించిన పద్ధతులనే అనుసరిస్తున్నాయి. ఈ దురహంకారం ముంబయి ప్రజలకు గాని, మరాఠీ భాషీయులకు గాని ఎటువంటి మేలూ చేయదు. ఇటువంటి హింసోన్మాదాన్ని ఖండించడం ప్రస్తుతం రెండు కారణాల రీత్యా అత్యవసరం. ఒకటి, అది ప్రజలు తమ న్యాయమైన వాటా కోసం అడిగే ఉద్యమాల మీద చిన్నచూపు ఏర్పడడానికి దారి తీస్తుంది. ఈ అన్యాయమైన బెదిరింపులను చూపి, న్యాయమైన ఆకాంక్షలను కూడా ఖండించడం సాగుతుంది. రెండు, ఇది ప్రజల మధ్య విద్వేషానికి దారితీసి తద్వారా పాలకులకే మేలు చేస్తుంది. ఇటువంటి జాతి, మత, భాషా దురహంకారాన్ని ప్రతిఒక్కరూ ఖండించవలసి ఉంది.

## కొనసాగుతున్న రాజపక్ష రక్తపిపాస

ఇప్పటికే రక్తసిక్తమయిన, కన్నీటి వరదలు పారిన శ్రీలంక మరొకసారి విషాద వార్తలకు నిలయమవుతున్నది. మళ్లీ ఒకసారి మహింద రాజపక్ష రక్తపిపాస బహిరంగంగా వ్యక్తమవుతున్నది. మనిషి నెత్తురు రుచి మరిగిన పులి తన కాపలాదారుమీద కూడ దాడిచేస్తుందన్నట్టు, వరం పొందిన భస్మాసురుడు శివుడి నెత్తిన కూడ చెయ్యి పెట్టదలచినట్టు ఇప్పుడు మహింద రాజపక్ష తనను నిలబెట్టినవారిమీదనే కాటు వేస్తున్నాడు. తనకు సైనిక విజయం సాధించిపెట్టిన జనరల్ శరత్ ఫోన్సెకా మీద పడుతున్నాడు. తమిళులను ఊచకోత కోయడంలో తనకు మద్దతు ఇచ్చిన సింహళ ప్రజానీకం మీద తన ప్రతాపం చూపెడుతున్నాడు. ఆరు సంవత్సరాల పదవీకాలంలో నాలుగు సంవత్సరాలే గడిచినా, మధ్యంతర ఎన్నికలకు ఆదేశించి అదనపు బలంతో తన ప్రత్యర్థులను చిత్తు చేయదలచాడు. రాజపక్ష 2005లో అధ్యక్షపదవిని గెలిచింది కేవలం 50.29 శాతం వోట్లతో అతి తక్కువ అధిక్యతతో మాత్రమే. ఎల్‌టిటిఇ ని అతి దుర్మార్గంగా అంతం చేసిన తర్వాత, ఇక దేశంలో శత్రుశేషం లేకుండా చేయాలనే ఆలోచనతో రాజపక్ష నవంబర్ లో మధ్యంతర ఎన్నికలకు ఆదేశించాడు. అప్పటిదాకా రాజపక్షకు నమ్మిన బంటుగా, సైనిక దళాల ప్రధాన అధిపతిగా ఉండి సింహళ జాత్యహంకారంతో తమిళ పోరాట యోధులను ఊచకోత కోసిన, తమిళ ప్రజానీకాన్ని అష్టకష్టాల పాలు చేసిన శరత్ ఫోన్సెకా తనను మించిపోతాడనీ, అతని తోక కత్తిరించాలనీ రాజపక్ష ఆలోచించాడు. పేరుకు పెద్దదయినా పనికిమాలిన పదవిని సృష్టించి ఫోన్సెకాను అందులో కూచోపెట్టాడు. ఆ అవమానాన్ని భరించలేని ఫోన్సెకా రాజీనామా చేసి, అధ్యక్ష ఎన్నికలలో పోటీ చేయాలనీ, రాజపక్షకు ప్రత్యర్థిగా నిలబడి రాజకీయాలలోకి రావాలనీ అనుకున్నాడు. ప్రతిపక్ష పార్టీలన్నీ కలిసి న్యూ డెమొక్రటిక్ ఫ్రంట్ అనే పేరుతో ఫోన్సెకా అభ్యర్థిత్వాన్ని బలపరచాయి. జనవరి 26న జరిగిన ఎన్నికలకు ముందూ, ఎన్నికల రోజునా, ఎన్నికల తర్వాతా ప్రభుత్వ బలగాలు జరిపిన హింసాకాండ గురించీ, సాగించిన దౌర్జన్యాల గురించి విదేశీ ప్రచార సాధనాలు కథలుకథలుగా రాస్తున్నాయి. రాజపక్ష అధికార యంత్రాంగాన్ని దుర్వినియోగం చేశాడనీ, సాయుధ గూండా ముఠాలనూ వాడుకున్నాడనీ స్వతంత్ర పరిశీలకులు కూడ రాస్తున్నారు. మొత్తానికి ఎన్నికలలో రాజపక్ష 57 శాతం వోట్లు గెలుచుకోగా, ఫోన్సెకా 40 శాతం గెలుచుకున్నాడు. అయితే విచిత్రంగా తమిళ జనాభా ఎక్కువగా ఉన్న ఉత్తర, తూర్పు ప్రాంతాలలో మొత్తానికి మొత్తం వోట్లను ఫోన్సెకా గెలుచుకున్నాడు. ఈ ఫలితాలను తాను అంగీకరించనని ఫోన్సెకా ప్రకటించగా, ఇది ప్రజావిజయమని రాజపక్ష అన్నాడు. ఎన్నికలు సక్రమంగా జరగలేదని స్వయంగా ఎన్నికల కమిషనరే అన్నాడు. ఈ ఎన్నికల ఫలితాలు వెలువడిన పది రోజుల లోపలే రాజపక్ష పార్లమెంటును రద్దుచేశాడు. శరత్ ఫోన్సెకాను అవమానకరంగా అరెస్టు చేయించాడు. ఫోన్సెకా జరిపిన సైనిక అత్యాచారాలకు, కుట్రలకు గాను సైనిక విచారణ జరుపుతామని ప్రకటించాడు. ఫోన్సెకాకు అంగరక్షకులుగా ఉన్న సైనికులందరినీ అరెస్టు చేయించాడు. పత్రికలమీద, ప్రచార సాధనాలమీద ఆంక్షలు విధించాడు, ఉన్న ఆంక్షలను పెంచాడు. ఒక సంపాదకుడిని అరెస్టు చేయించాడు. కొన్ని వెబ్‌సైట్లను నిషేధించాడు. ప్రభుత్వ టెలివిజన్ సంస్థ ఉద్యోగులను తొలగించాడు. ప్రజల మీద ఎంత హింస అమలవుతున్నదో వార్తలు ఇంకా రావడంలేదు. మొత్తం మీద సమాజంలోని ఒక భాగం మీద దాడి చేయడానికి, దుర్మార్గంగా ఉండడానికి పాలకులను ఒకసారి అనుమతిస్తే అది ఆ ఒక్కచోటే ఆగదని, రక్తం మరిగిన పులి అందరిమీదికీ తన పంజా విసురుతుందనీ రాజపక్ష ప్రవర్తన రుజువు చేస్తోంది. శ్రీలంక పరిణామాలు ప్రపంచ ప్రజలందరికీ, ముఖ్యంగా భారత ప్రజానీకానికి ఒక హెచ్చరిక కావాలి. ప్రభుత్వం ఇవాళ ఏదో ఒక సామాజిక వర్గాన్ని మట్టుపెట్టడానికి పూనుకుంటున్నప్పుడు మనం మౌనంగా ఉన్నామంటే రేపు ఆ పులి మనమీద దూకడానికి మనమే అనుమతిస్తున్నామన్నమాట. వీ

## లోపలి పేజీల్లో...

### ఫోకస్ : చిన్న రాష్ట్రాలు - అభివృద్ధి

*ప్రస్తుత భారత రాజకీయాలలో రాష్ట్రం చిన్నదా, పెద్దదా అనేది గీటురాయి కాదు. ఆ రాష్ట్రం ప్రజా ఆకాంక్షలకు అనుగుణమైనదా కాదా, ప్రజావసరాలను తీర్చగలిగినదా కాదా, చారిత్రక, సామాజిక, సాంస్కృతిక, భౌగోళిక కారణాల రీత్యా సమర్థించదగినదా కాదా అనేదే గీటురాయి అవుతుంది. రాష్ట్రం చిన్నదయినా స్థిరంగా ఉన్న సందర్భాలూ, పెద్దదయినా అస్థిరంగా ఉన్న సందర్భాలూ ఉన్నాయి. అలాగే పెద్ద రాష్ట్రాలలో కూడ నిరంకుశత్వం, కుట్రలు, స్వార్థ ప్రయోజనాలు రాజ్యం చేసిన ఉదాహరణలు కొల్లలుగా ఉన్నాయి. ఒక పాలనా ప్రాంతపు విస్తీర్ణం తగ్గిన కొద్దీ పాలనా వికేంద్రీకరణ సులభసాధ్యమవుతుంది. ప్రజలు తమను తాము పాలించుకోవాలనే ప్రజాస్వామిక ఆదర్శం వాస్తవరూపం ధరించాలంటే పాలనా వ్యవస్థల వికేంద్రీకరణ జరగాలి. పాలనా ప్రాంతం నిర్వహించడానికి వీలులేనంత సువిశాలంగా ఉండి, పాలన కేంద్రీకరణ జరిగినప్పుడు ప్రజాస్వామిక ఆదర్శం భగ్నమయ్యే అవకాశం ఉంది. అందువల్ల పాలన సులభతరం కావాలన్నా, సరళం కావాలన్నా, ప్రజలవద్దకు చేరాలన్నా, పాలనా పరిధి అంతకంతకూ చిన్నది కావలసి ఉంటుంది.*



'వీక్షణం'లో అచ్చువుతున్న రచనలలో వ్యక్తమైన అభిప్రాయాలన్నిటితో సంపాదకులకు ఏకీభావం ఉండనవసరం లేదు. 'వీక్షణం'ను నిజమైన ప్రజాపక్ష రాజకీయార్థిక, సామాజిక విశ్లేషణా వేదికగా తీర్చిదిద్దడంలో అన్నిరకాల అభిప్రాయాలకు, భిన్నాభిప్రాయాల ఛాయలకు స్థానం కల్పించాలని సంపాదక వర్గం భావిస్తోంది.

### రచయితలకు సూచన

ఏ పత్రికయినా తాను అచ్చువేసే రచనలు తనకే ప్రత్యేకంగా ఉండాలని కోరుకుంటుంది. 'వీక్షణం' కూడా అలానే భావిస్తోంది. ఇటీవల కొందరు రచయితలు తమ రచనలను ఒకేసారి అనేక పత్రికలకు పరిశీలన కోసం పంపుతున్నారు. 'వీక్షణం' పరిశీలనలో ఉన్న రచనలు, రాబోయే సంచికలలో అచ్చుకోసం ఎంపిక చేసి పెట్టుకున్న రచనలు ఇతర దినపత్రికలలోనో, వార పత్రికలలోనో వెలువడడం మా దృష్టికి వస్తోంది. ఇతర పత్రికలకు పంపిన రచనలను 'వీక్షణం'కు పంపించగూడదని రచయితలకు విజ్ఞప్తి చేస్తున్నాము.

– సంపాదకులు

### చందాదారులకు విజ్ఞప్తి!

ఇటీవల కొంతమంది చందాదారులకు వీక్షణం సక్రమంగా అందడం లేదని ఫిర్యాదులు వస్తున్నాయి. వీక్షణం ప్రతినెల 29వ తేదీన మరుసటి నెల సంచిక పోస్ట్ అవుతుంది. ఏ కారణం చేతనైనా మీకు వీక్షణం మొదటివారంలోపు అందనట్లయితే, వెంటనే ఆ విషయం మాకు తెలపగలరు.

మీ చిరునామా వివరంగా రాయండి. పిన్‌కోడ్ రాయడం మరిచిపోకండి. పత్రిక వచ్చిందా రాలేదా పోస్ట్‌మాన్‌తో నిర్ధారించుకోగలరు.

– సర్క్యులేషన్ మేనేజర్
9949391028







- **24 గంటలు – కె.జి. కన్నబిరాన్ –** ఆత్మకథాత్మక సామాజిక చిత్రం – అక్షరీకరణ : ఎన్. వేణుగోపాల్ – దేవులపల్లి పబ్లికేషన్స్ – 492 పేజీలు, 1/8 డెమీ, రు.200, ప్రతులకు : దేవులపల్లి పబ్లికేషన్స్, 12-1-62, విజయ గార్డెన్స్, బండ్లగూడ, నాగోల్, హైదరాబాద్; ఫోన్ : 9502320616; అన్ని ప్రముఖ పుస్తక కేంద్రాలలో
- **ఒగరు –** కవిత్వం – ఆశారాజు – ఝరీ పొయిట్రి సర్కిల్ – 63 పేజీలు, 1/8 డెమీ, రు. 60, ప్రతులకు : ఝరీ పొయిట్రి సర్కిల్, 16–2–740/75/40, వి.కె. ధాగేనగర్, గడ్డిఅన్నారం, హైదరాబాద్ – 500060; ఫోన్ : 040-24064195; నవోదయ బుక్ హౌస్, ఆర్యసమాజ్ ఎదురుగా, బడిచౌడి, కాచిగూడ చౌరస్తా దగ్గర, హైదరాబాద్; ఫోన్ : 040 – 24642387
- **ఊరి చివర –** అఫ్సర్ – సంపాదకుడు : గుడిపాటి – పాలపిట్ట బుక్స్ – 142 పేజీలు, 1/8 డెమీ, రు. 60, ప్రతులకు : పాలపిట్ట బుక్స్, 16–11–20/6/1/1, 403, విజయసాయి రెసిడెన్సి, సలీంనగర్, మలక్‌పేట్, హైదరాబాద్ – 500036; సెల్ : 9848787284, ఇమెయిల్ : palapittabooks@gmail.com
- **సీమ గుండెచప్పుడు –** కరువు సీమ సమాలోచన – ఇమామ్ – కదలిక ప్రచురణ – 313 పేజీలు, 1/4 క్రౌన్, రు. 150, ప్రతులకు : ఇమామ్, కదలిక ప్రచురణలు, యెర్రనేలకొట్టాలు, ఆర్.సి.నగర్, అనంతపురం; ఫోన్ : 08554–277789; సెల్ : 9989904389
- **రంగుటద్దాల కిటికీ –** కథలు – ఎస్. నారాయణస్వామి – 191 పేజీలు, 1/8 డెమీ, రు. 75, ప్రతులకు : నవోదయ పబ్లిషర్స్, కార్ల్ మార్క్స్ రోడ్, విజయవాడ – 2; ఫోన్ : 0866 – 2573500; ఇమెయిల్ : vjw_booklinks@yahoo.co.in; http://kottapali.blogspot.com
- **బొగ్గు పొరల్లో అగ్గిబావుటా –** తెలంగాణ వనరుల దోపిడీ : సింగరేణి కార్మికోద్యమం – ఘంటా చక్రపాణి – వుమేష్ పేపర్ బ్యాక్స్ – 63 పేజీలు, 1/8 డెమీ, రు. 40, ప్రతులకు : వుమేష్ పేపర్ బ్యాక్స్, 3–6–288/1, స్ట్రీట్ నం. 4, హైదర్‌గూడ, హైదరాబాద్ – 500029; సెల్ : 9849908929, 9989499058; అన్ని ప్రముఖ పుస్తక కేంద్రాలలో
- **మాయ –** 'కథ' – చర్చా వ్యాసాలు – గంటేడ గౌరునాయుడు – మిత్రసాహితి – 36 పేజీలు, 1/8 డెమీ, రు.20, ప్రతులకు : స్నేహకళా సమితి, కురుపాం; సి.ఎస్.వి. ప్రసాదవర్మ, లాసన్స్‌బే కాలనీ, విశాఖపట్నం; అన్ని ప్రముఖ పుస్తక కేంద్రాలలో
- **గోలకొండ కవుల సంచిక –** సంపాదకులు : సురవరం ప్రతాపరెడ్డి – తెలంగాణ జాగృతి – 406 పేజీలు, 1/8 క్రౌన్, మేలు ప్రతి: రు. 175, సాదా ప్రతి: రు. 150
- **తెలంగాణాలో చైతన్యం రగిలించిన నిజాం రాష్ట్రాంధ్ర మహాసభలు –** (జోగిపేట, దేవరకొండ, ఖమ్మం, సిరిసిల్ల) మొదటి భాగం – కె. జితేంద్రబాబు – తెలంగాణ జాగృతి – 756 పేజీలు, 1/8 క్రౌన్, మేలు ప్రతి: రు. 500, సాదా ప్రతి: రు. 350

  పై రెండు ప్రతులకు : తెలంగాణ జాగృతి, ఇ.నెం. 16–11–20/1/9, ఫ్లాట్ నెం. 104, 105, పద్మావతి రెసిడెన్సి, సలీంనగర్ కాలనీ, మలక్‌పేట్, హైదరాబాద్ – 500036; ఫోన్ : 9618031609
- **తెలంగాణాలో చైతన్యం రగిలించిన నిజాం రాష్ట్రాంధ్ర మహాసభలు –** (షాద్‌నగర్ – నిజామాబాద్) రెండవ భాగం – కె. జితేంద్రబాబు – తెలంగాణ జాగృతి – 603 పేజీలు, 1/8 క్రౌన్, రు. 250, ప్రతులకు : తెలంగాణ జాగృతి, ఫ్లాట్ నెం. 538, లక్ష్మీకుంజ్, ఇ.నెం. 16–11–310/12ఎ, సలీంనగర్ కాలనీ, మలక్‌పేట్, హైదరాబాద్ – 500036; ఫోన్ : 9618031609










సమకాలీన సామాజిక వ్యాసాలపై వీక్షణం ప్రజలకందించే సమాచారం, వారిని జాగృతం చేసే తీరు గర్వించదగినది. ప్రజాసమస్యల పర్వాన్ని ముఖచిత్రంగా మలిచి పదునైన కలంతో, ఘాటైన అక్షరాలతో పాలకుల మత్తును దించే, ప్రజా పాశుపతాస్త్రం 'వీక్షణం'. మానవ హక్కుల మహోద్యమ కార్యకర్త బాలగోపాల్ వ్యాసాలు ప్రచురించగలరు. అటువంటి వ్యక్తుల రచనలు సమసమాజ నిర్మాణానికి అత్యవసరం.

**– పసునూరు మధుకర్**
సూర్యాపేట, నల్గొండ

వీక్షణం పత్రికపైన వర్క్‌షాప్ పెట్టడం ముదావహం. దూర ప్రయాణాలు, వ్యాస రచనల ఒత్తిడి వల్ల రాలేకపోయాను. బహుశా చాలా మంది వచ్చి ఉంటారు. తగు సూచనలు చేసి ఉంటారని భావిస్తున్నాను.

**– డా. జి. లచ్చయ్య**
కామారెడ్డి, నిజామాబాద్

వీక్షణంలో జనవరి సంచికలో తెలంగాణపై అనేక వ్యాసాలు ప్రచురించారు, సంతోషం. 'సంక్షుభిత కూడలిలో తెలుగు జాతి నిలిచి ఉంది' అనీ, 'పాలకులు విజ్ఞులై ఉంటే సులభంగానే నివారించగలిగిన అత్యంత విషాదకరమైన ఘట్టం' అనీ ఆవేదనతో సంపాదకీయం రాసారు. 'మూడు ప్రాంతాలలోనూ ప్రజా ఉద్యమాలు తప్పుడు రూపాలలోకి, వ్యక్తీకరణలలోకీ ప్రవేశించాయి' అని, 'నాయకులు ప్రజలకు నిజం చెప్పరని తేలిపోయిందని', 'తెలుగుజాతి ఇంతగా దిగజారిన పోరాట రూపాలను ఎన్నుకుంటున్నదా... ఇన్ని అబద్ధాల మీద ఆధారపడిన అన్యాయమైన ఆందోళనలకు సిద్ధపడుతున్నారా అని ఆందోళన' సంపాదకీయంలో వ్యక్తం చేసారు. ఇవి విలువైన మాటలే. కానీ ఆయా సమస్యలపై అన్ని రకాల, భిన్నాభిప్రాయాలకు స్థానం కల్పించడం తమ విధానంగా పేర్కొన్నారు. కానీ చేసినపని అదికాదు. అన్ని వ్యాసాల్లో రెండోకోణం లేకపోగా, పాక్షిక దృష్టితో, పాక్షిక వాస్తవాలతో, వక్రీకరణలతో ఉన్నాయి. వీక్షణంకి ఇది తగదు. అంతేకాక ప్రత్యేక తెలంగాణ సర్వరోగ నివారిణి అన్నట్లుగా – లేదా కనీసం ప్రస్తుత రుగ్మతలకు తగిన అత్యవసరమైన శస్త్ర చికిత్సగా– ప్రచారం సాగుతున్నది. నిజానికి తెలంగాణకే కాదు, దేశానికి పట్టిన నేటి క్యాన్సర్‌కి మౌలిక పరిష్కారాలు అవసరం. వీక్షణం ఆ విషయం చెప్పకపోగా ప్రత్యేక తెలంగాణ పేరిట నాటు / మోటు వైద్యాన్నే ఈ నాలుగు వ్యాసాల ద్వారా సూచించింది. ఈ కింది కొన్ని అభిప్రాయాలను ప్రచురిస్తారని ఆశిస్తున్నాను.

– 'తెలంగాణ రాష్ట్ర ప్రక్రియ ప్రారంభించబడుతుంది' అన్న చిదంబరం ప్రకటనను 'ప్రయత్నాలు ప్రారంభమయ్యాయి'గా పేర్కొన్నారు వేణుగోపాల్. అనుభవమూ, బాధ్యతా గల సంపాదకుడిగా ఆయన ఇలా వక్రీకరించవచ్చునా?

– కోస్తా నాయకత్వం వర్గస్వభావం గురించి అన్ని వ్యాసాల్లోనూ ప్రస్తావించారు, సరిగ్గానే. కాని ఎక్కడా తెలంగాణ రాజకీయ నాయకత్వం వర్గ స్వభావం గురించి ఎందుకు పేర్కొనలేదు? తెలంగాణలో చాలాకాలంగా నోరెత్తకుండా ఉండిన పాత దొరలూ, కొత్త భూస్వాములూ, కొత్త సంపన్న వర్గాలూ చెలరేగిపోయారీ ఉద్యమంతో. కోస్తా ప్రాంత సంపన్నుల గురించి పేరు పేరునా రాసారు, బాగుంది. తెలంగాణ నాయకత్వంలో కూడా వందలు కాదు, వేల కోట్లకు పడగలెత్తినవారి గురించి ఎందుకు పేర్కొనలేదు? ఇప్పటికైనా వారినీ పేర్కొని, వారి స్వప్రయోజనాలు ఈ ఉద్యమంలో ఎలా దాగి ఉన్నాయో బయటపెట్టండి.

– ఉన్నత విద్య, ఉద్యోగ అవకాశాల గురించి కోస్తా–సీమ ప్రజల్లో ఉన్నవి అనవసర ఆందోళనలని వేణుగోపాల్ వివరించారు. సరిగ్గా అవే విషయాలు ప్రత్యేక వాదులకూ వర్తిస్తాయని ఏకాస్త ఆలోచించినా కనపడుతుంది. కానీ ఈ వాస్తవాన్ని దాచిపెట్టారు. తద్వారా తెలంగాణ పేరిట రెచ్చగొట్టే రాజకీయాలను వెనకేసుకొచ్చారు.

– సమైక్య రాష్ట్రం ఉన్నంత మాత్రాన అభివృద్ధి కాదనీ, అభివృద్ధి ఎవరిది అని చూడాలనీ రాసారు. ప్రత్యేక తెలంగాణ ఏర్పడినా ఇవే ప్రశ్నలు మన ముందుంటాయని ఆయన ఎందుకు దాటవేస్తున్నారు? ప్రస్తుత వ్యవస్థలో దోపిడీదారుల రాజ్యం వేరుతెలంగాణలో కూడా కొనసాగుతుందనీ, దానికి వ్యతిరేకంగా అన్ని ప్రాంతాల ప్రజలూ ఐక్యంగా పోరాడాలని ఎందుకు చెప్పలేదు? ప్రాంతాల మధ్య సమస్యలు కూడా విడిపోయిన తర్వాతా కొనసాగుతాయనీ, అవి అంతర్ రాష్ట్ర సమస్యలుగా మరింత జటిలమవుతాయనీ వారికి తెలియదా, లేదా చెప్పదలచలేదా?

– రాష్ట్రాల ఏర్పాటు కేంద్ర ప్రభుత్వ అధికారం అన్నది నిజమే. అదే సరైందని వారి అభిప్రాయమా? మనదేశ రాజ్యాంగం – పార్లమెంటూ కేంద్ర నిరంకుశత్వానికి అనువుగా ఉన్నాయి. చిదంబరం ప్రకటనను ఉటంకించిన రచయిత అదే ప్రకటనలో అసెంబ్లీ తీర్మానం అవసరాన్ని కూడా పేర్కొన్న సంగతిని చెప్పరేం? రాజ్యాంగం 3వ అధికరణను పేర్కొన్న వేణుగోపాల్, 'స్పష్టమైన రాజ్యాంగ వక్రీకరణతో ప్రజలను మోసం' చేస్తున్నారని ఆరోపించారు. బిల్లుని సంబంధిత అసెంబ్లీకి రిఫర్ చేసి గానీ పార్లమెంట్‌లో రాష్ట్రపతి ప్రవేశపెట్టజాలరనేది అదే అధికరణలో ఉంది. వాస్తవం ఇది కాగా 'శాసనసభ తీర్మానం అనే అబద్ధపు ప్రాతిపదిక మీద' అని ఎదురు ఆరోపించడాన్ని ఏమనాలి? కేంద్రానిది అంతిమాధికారం అయినా, అసెంబ్లీ అభిప్రాయం తెలుసుకోవడం అనివార్యం. రాజ్యాంగంలో ఏమున్నదో అలా ఉంచి, ఈ రాజకీయ ప్రజాస్వామిక ప్రక్రియ తప్పా? అభిప్రాయం కూడా అడగకుండా కేంద్రం వ్యవహరించడమే సరైనదని రచయిత భావిస్తున్నారా? వక్రీకరణలకు ఎవరు పాల్పడ్డారో పాఠకులు ఇప్పుడు అర్థం చేసుకోగలరు.

– అక్రమాలు ఎవరు చేసినా వ్యతిరేకించాల్సిందే. సరిదిద్దాల్సిందే. దానర్థం వేణుగోపాల్ ఏకపక్షంగా బల్లగుద్దవచ్చని కాదు. 'ప్రతి ఒక్క వాగ్దానాన్ని' ఉల్లంఘించారని, 'ఏ ఒక్క రంగంలోనూ... తెలంగాణ వాటాలో సగమో పావో కూడా... ఇవ్వలేదనీ' ఆరోపిస్తే చెల్లదు. అందుకే గత యాభై ఏళ్లపై వైట్ పేపర్ ప్రకటించాలని కోరుతున్నాను. వేణుగోపాల్ వ్యాసంలో ఇంకా అనేక అవకతవకలున్నాయి. ప్రస్తుతానికి ఇవి చాలు. ఆయనకు ఆసక్తి, పత్రిక ప్రకటిత విధానం ప్రకారం ప్రచురించే సంసిద్ధతా ఉంటే మరొక సందర్భంలో చర్చకు సిద్ధమే.

**– ఎం. ఆదిత్య**
హైదరాబాద్

వీక్షణం ఫిబ్రవరి 2010 సంచికలోని అన్ని వ్యాసాలు గొప్పవైనా, బెర్టెల్ ఓల్‌మాన్ 'మార్క్సిజం – రెండు నగరాల కథ' అంత తేలికగా కొరుకుడుపడనిది. ఇలాంటి వ్యాసాల వల్ల మీ పత్రికకు ఎక్కువ గుర్తింపు వస్తదేమో! మీ పత్రిక చదవడమే ఒక 'ఎడ్యుకేషన్'. ఇక ప్రచురించే పుస్తకాలన్నీ చదవాలంటే ఈ జీవితకాలం చాలదేమో. ఎన్నెన్ని చదవగలను.

**– ఎస్. హజరత్ అలీ**
రిటైర్డ్ బి.ఇడి. కాలేజీ ప్రిన్సిపాల్
వేమూరు, గుంటూరు

*(తరువాయి 45వ పేజీలో...)*


Statement about ownership and other particulars of periodical **VEEKSHANAM** as required to be published in the first issue of every year after the last day of February

**Form IV (See Rule 8)**

| | | |
|---|---|---|
| 1. | Place of publication | : Hyderabad |
| 2. | Periodicity of its publication | : Monthly |
| 3. | Printer's name | : N. Venugopal Rao |
| | Whether citizen of India | : Indian |
| | Address | : Mythri Residency, 3-6-394, Street No. 3, Himayatnagar, Hyderabad - 500 029. |
| 4. | Publisher's name | : N. Venugopal Rao |
| | Whether citizen of India | : Indian |
| | Address | : Mythri Residency, 3-6-394, Street No. 3, Himayatnagar, Hyderabad - 500 029. |
| 5. | Editor's name | : N. Venugopal Rao |
| | Whether citizen of India | : Indian |
| | Address | : Mythri Residency, 3-6-394, Street No. 3, Himayatnagar, Hyderabad - 500 029. |
| 6. | Name and addresses of individuals who own the newspaper | : N. Venugopal Rao |

I, N. Venugopal Rao, hereby declare that the particulars given above are true to the best of my knowledge and belief.

*Sd/-*
*(N. Venugopal Rao)*
Signature of the Publisher

Date : 1st March, 2010

### విద్యార్థి రణభేరి

నిజాం కాలేజ్ గ్రౌండ్స్‌లో అఖిల భారత విద్యార్థి పరిషత్ (ఎబివిపి) ఆధ్వర్యంలో జనవరి 23న 'తెలంగాణ విద్యార్థి రణభేరి' జరిగింది. ఈ సభకు ముఖ్య అతిథిగా హాజరయిన బిజెపి అగ్రనేత సుష్మా స్వరాజ్ కాంగ్రెస్ నాన్చుడు ధోరణిని తప్పుబట్టారు. అసోంలో విద్యార్థులే ఉద్యమించి అధికారాన్ని హస్తగతం చేసుకున్నారని గుర్తు చేశారు. రాష్ట్రంగా ఏర్పడిన తెలంగాణను బతికుండి చూద్దామనీ, తెలంగాణ తప్పక వస్తుందనీ, ఆత్మహత్యలు చేసుకోవద్దనీ ఆమె విద్యార్థులకు సూచించారు.

### రాజకీయ ఖైదీలను విడుదల చేయండి

రాష్ట్రవ్యాప్తంగా వివిధ జైళ్లలో మగ్గుతున్న రాజకీయ ఖైదీలను విడుదల చేయాలని రాజకీయ ఖైదీల విడుదల కమిటీ (సిఆర్‌పిపి) జనవరి 23న మీడియా సమావేశంలో ప్రభుత్వాన్ని డిమాండ్ చేసింది. ప్రత్యేక తెలంగాణ ఉద్యమకారులపై పెట్టిన కేసులను ఎత్తివేయాలని కోరింది. సిఆర్‌పిపి రాష్ట్ర అధ్యక్షులు కె.జి. కన్నబిరాన్, ప్రధాన కార్యదర్శి బల్లా రవీంద్రనాథ్, గౌరవ సలహాదారు వరవరరావు, ఉపాధ్యక్షులు ఎ. నరసింహారెడ్డి తదితరులు ఈ మీడియా సమావేశంలో పాల్గొన్నారు. ఈ సందర్భంగా కన్నబిరాన్ మాట్లాడుతూ గత యాభై ఏళ్లుగా రాజకీయ ఖైదీలను, సాధారణ ఖైదీలను వేరుగా గుర్తించాలని ఉద్యమం జరుగుతున్నా, పాలకులకు పట్టడం లేదని ఆందోళన చెందారు.

### నాటుసారాకు 13 మంది బలి

అమలాపురం రూరల్ అంబాజీపేట మండలంలోని నాలుగు గ్రామాలకు చెందిన కొంతమంది గంగలకర్రు అగ్రహారంలో నాటుసారా కేంద్రంలో జనవరి 23న కల్తీసారా తాగి అస్వస్థత గురయ్యారు. వారిలో జనవరి 27 నాటికి 13 మంది చనిపోగా, తీవ్ర అస్వస్థతకు గురైన 220 మందిని కాకినాడ ప్రభుత్వాస్పత్రికి చికిత్సకోసం తరలించారు.

### నటుడు గుమ్మడి కన్నుమూత

ఆరు దశాబ్దాల నట జీవితంలో సుమారు ఐదు వందలకు పైగా సినిమాల్లో వైవిధ్య పాత్రలు పోషించిన నటుడు గుమ్మడి వెంకటేశ్వర రావు (83) జనవరి 26 రాత్రి హైదరాబాద్‌లోని కేర్ ఆసుపత్రిలో చికిత్స పొందుతూ మరణించారు. గుమ్మడి 9 జూలై 1927న గుంటూరు జిల్లా తెనాలి సమీపంలోని కొల్లూరు మండలం రావికంపాడులో జన్మించారు. ఆయన పౌరాణిక, చారిత్రక, జానపద, సాంఘిక, కాల్పనిక చిత్రాల పాత్రల్లో చాలా సహజంగా ఒదిగిపోయేవారు. విద్యార్థి దశలో కమ్యూనిస్టు పార్టీ వైపు ఆకర్షితులయ్యారు. తన జీవన స్మృతులను 'తీపి గుర్తులు... చేదు జ్ఞాపకాలు' పేరుతో అక్షరీకరించారు. త్రిపురనేని గోపీచంద్ ఆయనకు ఇష్టమయిన రచయిత.

### దాసరి సుబ్రహ్మణ్యం మృతి

పిల్లలకు ఇష్టమయిన 'చందమామ' మాసపత్రికలో భేతాళ కథల సృష్టికర్త దాసరి సుబ్రహ్మణ్యం (90) జనవరి 27న అస్వస్థతతో విజయవాడలో మరణించారు. 1947లో చక్రపాణి ప్రారంభించిన పిల్లల మాసపత్రిక చందమామ సంపాదకవర్గంలో ఆయన సభ్యుడుగా ఉన్నారు. 1952 నుంచి 2006 వరకు యాభై నాలుగు ఏళ్ల పాటు చందమామలో పనిచేశారు. 1980లో కొడవటిగంటి కుటుంబరావు మరణించాక చందమామలో క్రియాశీలక పాత్ర పోషించారు. గుంటూరు జిల్లా తెనాలి సమీపంలోని పెదగాజులూరులో ఆయన జన్మించారు. ఇంద్రాణి, పగటికలలు పేరుతో ఆయన రచనలు వచ్చాయి. ఆయన స్కూలు చదువు చదువుకోలేదు గాని, స్వయంకృషితో ఇంగ్లిష్ పుస్తకాలు చదివే స్థాయికి ఎదిగారు. ఆయన చందమామలో ఎన్నో అద్భుతమైన ధారావాహిక కథలను సృష్టించారు.

### శ్రీకృష్ణ కమిటీ ఏర్పాటు

ప్రత్యేక తెలంగాణ ఆందోళనల నేపథ్యంలో ఫిబ్రవరి 3న కేంద్ర హోంశాఖ అధికార ప్రతినిధి 'శ్రీ కృష్ణ కమిటీ'ని ఏర్పాటు చేసినట్లు ప్రకటించారు. సుప్రీంకోర్టు మాజీ న్యాయమూర్తి జస్టిస్ శ్రీకృష్ణ అధ్యక్షుడిగా, కేంద్ర హోంశాఖ మాజీ కార్యదర్శి వి.కె. దుగ్గల్ సభ్య కార్యదర్శిగా, జాతీయ న్యాయ విశ్వవిద్యాలయం వైస్ ఛాన్సలర్ రణబీర్ సింగ్, అంతర్జాతీయ ఆహార విధాన పరిశోధన సంస్థ సీనియర్ ఫెలో అబు సలేహ్ షరీఫ్, ఢిల్లీ ఐఐటి హ్యూమానిటీస్ అండ్ సోషల్ సైన్సెస్ విభాగం ప్రొఫెసర్ రవీందర్ కౌర్‌లు ఈ కమిటీలో సభ్యులుగా ఉన్నారు. ఫిబ్రవరి 12న విధి విధానాలను కేంద్ర హోంశాఖ ప్రకటించింది. ఆంధ్రప్రదేశ్ ఏర్పడిన నాటి నుంచి వివిధ ప్రాంతాల అభివృద్ధి, వెనుకబాటులను అధ్యయనం చేయడానికి, వివిధ రంగాల ప్రజలతో సంప్రదింపులు జరపడానికి ఈ కమిటీ ఏర్పడింది.

### పోయేవి కార్మికుల ప్రాణాలే...

హైదరాబాద్‌లోని నిత్యం రద్దీగా ఉండే నారాయణగూడలో నిర్మాణంలో ఉన్న ఓ బహుళ అంతస్తుల భవంతి ఫిబ్రవరి 5న నిట్టనిలువునా కుప్పకూలింది. రెండేళ్ల చిన్నారితో సహా 13 మంది సజీవ సమాధి అయ్యారు. బిల్డర్ అత్యాశ, నిర్మాణ లోపాలు, నిబంధనలకు విరుద్ధంగా లాభాపేక్ష, నిర్లక్ష్యం, ప్రమాణాలు పాటించక పోవడం వల్లనే ఈ ప్రమాదం జరిగినట్లు అధికారులు అంచనాకు వచ్చారు. రాష్ట్రంలో 54 లక్షల మంది భవన నిర్మాణ కార్మికులు ఉండగా, వీరిలో 7 లక్షల మందిని మాత్రమే ఇప్పటివరకు రిజిష్టర్ చేశారు.

### విద్యార్థి పొలికేక - జమాతే గర్జన

జనవరి 18న ఉత్తర, దక్షిణ తెలంగాణలకు మహాపాదయాత్రకు బయలుదేరిన ఉస్మానియా విద్యార్థులు ఫిబ్రవరి 7న పాదయాత్ర ముగింపు సందర్భంగా వరంగల్‌లోని కాకతీయ విశ్వవిద్యాలయం వేదికగా 'విద్యార్థి పొలికేక' సభను నిర్వహించారు. అదే రోజు హైదరాబాద్‌లోని నిజాంకాలేజ్ గ్రౌండ్స్‌లో జమాతె ఇస్లామీ హింద్ ఆంధ్రప్రదేశ్ ఆధ్వర్యంలో ముస్లింల తెలంగాణ గర్జన సభ జరిగింది. తెలంగాణలోని పది జిల్లాల ముస్లిం ప్రజలు పెద్ద ఎత్తున ఈ సభకు తరలివచ్చారు.

### తెలంగాణ కోసం రాజీనామాలు

తెలంగాణ జెఎసి తీర్మానం మేరకు శ్రీకృష్ణ కమిటీ విధి విధానాలకు వ్యతిరేకంగా ఫిబ్రవరి 13న పదిహేను మంది (టిఆర్ఎస్-10, కాంగ్రెస్-2, పిఆర్‌పి-1, బిజెపి-1, టిడిపి-1) ఎం.ఎల్.ఎ.లు రాజీనామాలు చేశారు. రాజీనామా చేసిన ఎం.ఎల్.ఎ.లను అభినందిస్తూ, మిగిలిన ఎం.ఎల్.ఎ.లు రాజీనామా చేయాలని కోరుతూ ఆర్ట్స్ కాలేజీ నుంచి తార్నాక వైపు ఊరేగింపుగా బయలుదేరిన విద్యార్థులపై పోలీసులు లాఠీఛార్జ్ చేశారు. పోలీసులు చేసిన దాడిలో, తదనంతర పరిణామాలలో యాభై మంది విద్యార్థులు, 20 మంది మీడియా ప్రతినిధులు, పదుల సంఖ్యలో పోలీసులు గాయపడ్డారు. మీడియాపై దాడికి విలేకరులు నిరసన వ్యక్తం చేయగా, ముఖ్యమంత్రి క్షమాపణలు తెలియజేశారు.

### దళిత క్రైస్తవులు, ముస్లింలకు ఎస్.సి. హోదా

దళిత క్రైస్తవులు, దళిత ముస్లింలకు ఎస్.సి. హోదా కల్పించేందుకు ఫిబ్రవరి 15న రాష్ట్ర మంత్రివర్గం ఆమోదం తెలిపింది. ఈ అంశంపై ఆగస్ట్ 25, 2009న చేసిన అసెంబ్లీ తీర్మానంలోని అంశాలకు అంగీకారం తెలిపింది. ముఖ్యమంత్రి రోశయ్య అధ్యక్షతన జరిగిన మంత్రివర్గ సమావేశంలో ఈ నిర్ణయం తీసుకున్నారు.

### అసెంబ్లీ ముట్టడి... యాదయ్య ఆత్మాహుతి

తెలంగాణ సాధన కోసం విద్యార్థి జెఎసి ఇచ్చిన 'అసెంబ్లీ ముట్టడి' కార్యక్రమంలో భాగంగా ఫిబ్రవరి 20న హైదరాబాద్‌లో ఉద్రిక్తతలు నెలకొన్నాయి. ఉస్మానియా ఆర్ట్స్ కాలేజ్‌తో సహా నగరంలోని పలు కాలేజ్ విద్యార్థులు అసెంబ్లీ ముట్టడికి సమాయత్తమయ్యారు. 144 సెక్షన్ విధించడం వల్ల అసెంబ్లీ పరిసర ప్రాంతాలు నిర్మానుష్యమై పోయాయి. ఈ క్రమంలో రంగారెడ్డి జిల్లా, మహేశ్వరం మండలం, నాగారం గ్రామానికి చెందిన సిరిపురం యాదగిరి విద్యార్థుల ముట్టడికి కార్యక్రమంలో పాల్గొని మధ్యాహ్నం ఉస్మానియా క్యాంపస్ గేటు వద్ద ఒంటికి నిప్పంటించుకుని పోలీసుల పైకి దూసుకెళ్లాడు. 80 శాతం గాయాలతో చికిత్స పొందుతూ అర్ధరాత్రి మరణించాడు.

### హాస్యనటుడు పద్మనాభం ఇకలేరు

ప్రముఖ హాస్యనటుడు పద్మనాభం (79) ఫిబ్రవరి 20న చెన్నయ్‌లోని తన స్వగృహంలో గుండెపోటుతో మరణించారు. ఆయన 20 ఆగస్ట్, 1931న కడప జిల్లా పులివెందుల తాలూకా సింహాద్రిపురంలో జన్మించారు. ఆయన 400లకు పైగా చిత్రాలలో నటించి, ఐదు చిత్రాలు నిర్మించి, రెండు చిత్రాలకు దర్శకత్వం వహించారు. వీ

*అధిక ధరల విషయంలో ద్రవ్యోల్బణం, ఆర్థిక వృద్ధి, జిడిపి, మార్కెట్ - ఇలా రకరకాల పదాల మాటున దాగిన పాలకుల వైఫల్యాన్ని ఎత్తిచూపుతున్నారు* **వి. హనుమంతరావు**

# ధరల మంటల్లో చలి కాచుకుంటున్న ప్రధాని

చలికాలం వస్తే పేవ్‌మెంట్ల మీద పడుకొనే అభాగ్యులు మండే వస్తువులేవి దొరికినా మంటపెట్టి చలిపులిని దూరంగా ఉంచుకొంటారు. అలాగే ప్రధాని మన్మోహన్ సింగ్, ఆహార శాఖ మంత్రి శరద్ పవార్‌లు ధరల మంటల్లో చలి కాచుకుంటున్నారు. సామాన్య ప్రజల కన్నీళ్లు వారికి పన్నీరు. సంవత్సర కాలం నుంచి ధరలు పెరుగుతున్నా, ప్రజలు గొల్లుమని గోలపెడుతున్నా, పాలకుల చలి ఇంకా తీరలేదు. పేదవాడి గుండెల దగ్గర చెవి ఆనించి ఉంటే 'ధడ్ ధడ్' అని కాదు 'ధర ధర' అని వినిపించేది. ఒక్కొక్క 'ధరా'సురుడు ఒక్కో కారణం చెబుతున్నాడు. ప్రధాని మాట్లాడుతూ ఇక గడ్డుకాలం ముగిసింది, ధరలు తగ్గుతున్నాయి అంటారు. ఆయన ఇలా అన్నారో లేదో, సుమారు 20 శాతం మేరకు పెరిగిన ధరల ద్రవ్యోల్బణం 17 శాతానికి తగ్గి మళ్లీ 17.94 శాతానికి పెరిగింది. కొన్ని నెలల క్రితం ద్రవ్యోల్బణం సున్నా శాతం కిందకు దిగజారి, మళ్లా తాజా లెక్కల ప్రకారం జనవరిలో టోకు ధరల సూచి 8.56 శాతంగా నమోదైంది. గత 13 నెలల కాలంలో ఇంతగా ఎపుడూ పెరగలేదు. ఈ శాతం ఆర్థిక సంవత్సరానికి 8.5 ఉంటుందని అంచనా వేస్తే ఇప్పటికే ఆ గీత దాటింది. రబీ పంట మార్కెట్‌లోకి వస్తే ధరలు తగ్గవచ్చంటున్నారు. సూర్యుడు ఎపుడూ తూర్పునే ఉదయిస్తాడు, పంట మార్కెట్‌లోకి వచ్చినపుడు ధరలు తగ్గుతాయి. ఈ విషయం చెప్పడానికి ఆర్థిక శాస్త్రవేత్తలు, ఐఎఎస్‌లు అవసరం లేదు.

ఒకోసారి ఈ ఆర్థిక శాస్త్ర పండితులు ఏదో కొత్త విషయం కనుక్కొన్నట్లు మాట్లాడుతుంటారు. ఉదాహరణకు ఆర్థిక వ్యవహారాల పండితుడైన ప్రధాని మాట్లాడుతూ ఆర్థిక వృద్ధి 9-10 శాతానికి పెరిగితే పారిశ్రామికీకరణ జరిగి నిరుద్యోగితను నిర్మూలించవచ్చునని అంటున్నారు. ఇది చెప్పడానికి ఆర్థిక శాస్త్రవేత్త కానవసరం లేదు. కాని ఆయన ఇలా అని పప్పులో కాలేస్తున్నారని అంటాను. ఇపుడు ఆర్థిక వృద్ధి ఏడు చిల్లర శాతం ఉందంటే 9-10 శాతానికి చేరుకోవడానికి ఎన్ని సంవత్సరాలు ఆగాలి? ఇప్పటికే ఆధునికీకరణ, రోబోటీకరణ లాంటి యాంత్రికీకరణలతో పరిశ్రమలు రాను రాను కార్మికులను తొలగిస్తున్నాయి. వారి కొనుగోలు శక్తి తగ్గుతోంది. అలాంటపుడు పారిశ్రామికీకరణ పెరిగి ఉత్పత్తి పెరిగితే, కొనుగోలు శక్తి తగ్గిన ప్రజలు ఎలా కొనుగోలు చేయగలుగుతారు?

దేశం ఒకరకమైన సంక్షోభం నుంచి మరో రకం సంక్షోభంలోకి జారుకుంటోంది. ఇవాళ ధరలు మంటలు రేపుతున్నాయని జనం గగ్గోలు పెడుతుంటే ఎపుడో ఏదో జరుగుతుందని చెప్పబూనటం అసలు సమస్య నుంచి ప్రజల దృష్టిని మళ్లించే ప్రయత్నమని చెప్పాలి. అయినా స్థూల జాతీయాదాయం పెరిగితే, సామాన్యుడికేమి ఒరుగుతుంది? గత ఏడాది ఈ పెరుగుదల 6.7 శాతం నుంచి ఇప్పుడు 7.6 శాతానికి పెరిగిందనే అనుకుందాం. (ఈ అంచనా 7.2 నుంచి 7.8 దాకా ఉన్నాయి). కాని ఇదే కాలంలో ధరలు రోజు రోజుకు పెరుగుతూనే వస్తున్నాయి. కాగా జిడిపి పెరిగినా, తరిగినా సామాన్యుడికి సంబంధించినంత వరకు అతడికి కావాల్సింది జిడిపి పెరుగుదల కాదు. ధరల తగ్గుదల.

ఒకటి రెండూ వారాల క్రితం రిజర్వ్ బ్యాంక్ బ్యాంకింగ్ వ్యవస్థ నుంచి 36 వేల కోట్ల నిధులను ఉపసంహరించి, ఇది ధరల తగ్గుదలకు తోడ్పడుతుందని చెప్పింది. అదే సమయంలో ధరలు పెరగడం చూస్తే ద్రవ్యం మార్కెట్‌లో ఎక్కువగానో, తక్కువగానో చలామణీలో ఉండడం వల్ల కాదని, మార్కెట్‌లో జనం కొనుక్కొనే వస్తువులు, ఆహార పదార్థాల లభ్యతకు సంబంధించిన విషయమని రిజర్వ్ బ్యాంక్ అనటం గమనించండి. అలాగే పారిశ్రామికోత్పత్తి పెరుగుతూన్న సమయంలోనే ధరలు కూడా పెరుగుతున్నాయి. ఇదేమిటో కాస్త వివరిస్తారా గవర్నర్ సుబ్బారావు గారూ?

ధరలు ఇలా కట్టు తప్పిపోవడానికి కారణాలేమిటని చూడబోతే సవాలక్ష కారణాలున్నాయని అనిపిస్తుంది. ప్రపంచమంతటా ధరలు పెరుగుతున్నాయి, కాగా దేశంలో ధరలు కూడా పెరుగుతున్నాయనేది ప్రభుత్వానికి వాటంగా కనిపించే కారణం. అలాంటపుడు ఈ ప్రభుత్వం ఎందుకు? అలాంటి పరిస్థితులేర్పడినపుడు వాటినదుపు చేయాల్సిన యంత్రాంగం ప్రభుత్వం వద్ద లేదన్నమాట? ఎందుకుంటుంది? ప్రపంచబ్యాంక్ ఆదేశం మేరకు ఫుడ్ కార్పొరేషన్ ఆఫ్ ఇండియాను ఆచరణలో బలహీనం చేసింది. అసలు మనం స్వయం పోషకత్వం సాధించడమే ప్రపంచబ్యాంక్ యజమాని అయిన అమెరికాకు ఇష్టం లేదు. మన దేశం దానిని సాధిస్తే, తాను అదనంగా పండించే ఆహార ధాన్యాలకు 115 కోట్ల జనాభా గల భారత దేశం అనే అతిపెద్ద మార్కెట్ చేజారిపోతుంది. అందుకోసం ప్రపంచీకరణ అనే బోనులోకి ఎరవేసి బంధించింది.

దేశ ప్రజలకు తిండి పెట్టలేని ప్రభుత్వం ఉంటే ఎంత, లేకపోతే ఎంత? 'అంతర్జాతీయ విపణికి అనుగుణంగా మాత్రమే ఆహార ధరలు పెరగడానికి, తగ్గడానికి వీలైనపుడు సార్వభౌమాధికారం గల

ప్రభుత్వాలెందుకు? అంతర్జాతీయంగా గత ఏడాదంతా ఆర్థిక మాంద్యం ఏర్పడినప్పుడు దాని ప్రభావం మన దేశం పై పడలేదని మన ప్రభుత్వం ఘనంగా ప్రకటించింది. అది నిజమైతే ఆహార ధరలు అదుపులోకి రాకపోవడం ప్రభుత్వ వైఫల్యం కాదా? నిజానికిది దీర్ఘకాలిక వైఫల్యం. 1990వ దశకంలో ప్రపంచీకరణ, స్వేచ్ఛా విపణి, మార్కెట్ ఎకానమీ, ప్రపంచ వాణిజ్య సంస్థ ఆరంభమైనప్పటి నుంచీ వర్ధమాన దేశాల ఆర్థిక సార్వభౌమత్వం హరించుకొని పోతోంది'.

ధరలు ఇలా పెరగడానికి కారణం ఏమిటో అని చూడబోతే ఏనుగు – నలుగురు అంధుల కథ గుర్తుకువస్తుంది. అంతర్జాతీయంగా ధరలు పెరగడం కారణమని ఒక మంత్రి, పంటలు పండలేదని మరో మంత్రి, రాష్ట్ర ప్రభుత్వాల వైఫల్యాలే కారణమని శరద్‌పవార్, అబ్బే, ఆహార ధాన్యాలు మస్తుగా ఉన్నాయని మరో నాయకుడు – ఇలా ప్రభుత్వానికే ఒక అభిప్రాయం లేదు. రోగ నిర్ధారణ చేయకపోతే, రోగం ఎలా కుదురుతుంది? కేంద్రం రాష్ట్ర ముఖ్యమంత్రులనందరినీ సమావేశ పరచి, చర్చించి, ఒక కమిటీని నియమించింది. ఎందుకా? చవక దుకాణాల వ్యవస్థ పనితీరును సమీక్షించేందుకు. ఈ దుకాణాలు సరిగా పనిచేయడం లేదని వీథిన పోయే ఎవరినైనా అడిగితే చెబుతారు. ఈ వ్యవస్థ సరిగా పనిచేయడం లేదని, బోగస్ కార్డులు లక్షల కొద్దీ ఉన్నాయని, రేషన్ బియ్యం పక్కదార్లు పడుతోందని ప్రభుత్వం నియమించిన కమిటీలే అనేకసార్లు ప్రభుత్వానికి నివేదించాయి.

బ్యాంకింగ్ నిపుణులు బెహరా ఎర్రంరాజు ప్రకారం రాష్ట్ర వ్యాప్తంగా బోగస్ కార్డుల గుర్తింపుకు నిర్వహించిన సర్వేలో కోటి మంది వరకు అనర్హులున్నట్లు తేలింది. ఐరిస్ టెక్నాలజీ ద్వారా మొత్తం 5.40 కోట్ల మంది కంటిపాపలను పరిశీలించగా అందులో కోటి మందికి రెండేసి ఫొటోలున్నట్లు వెల్లడైందని పత్రికల్లో పడిన వార్తలను ఉటంకించారు. దారిద్ర్య రేఖకు దిగువన ఉండి తెల్ల రేషన్ కార్డుకు, గృహ నిర్మాణ పథకానికి కుటుంబాలు రాష్ట్రంలో కోటి వరకు ఉండవచ్చని అంచనా కాగా వాస్తవంలో తెల్ల రేషన్ కార్డుల సంఖ్య కోటిన్నరపై మాటే, అంటే యాభై లక్షలకు పైగా తెల్ల రేషన్ కార్డులు బోగస్‌వే అని అన్నారు. అలాంటపుడు మరి ఇపుడు ఇంకో కమిటీ ఎందుకు?

ఈ వ్యవస్థ లోపాల గురించి బిజినెస్ స్టాండర్డ్ పత్రిక రాస్తూ పేదలను రక్షించి సరఫరా చేసిన ఆహార ధాన్యాలు లీక్ అవుతున్నాయి. పెద్ద ఎత్తున సబ్సిడీ ఇచ్చి సరఫరా చేసిన ధాన్యాలు రేషన్ షాపులకు చేరకుండా, ఉద్దేశించని స్థానాలకు తరలిపోతున్నాయి. లబ్ధిదారుల ఎంపికలో లోపాలున్నాయి. రేషన్‌కార్డులు దుర్వినియోగం అవుతున్నాయి. ఈ లోపాలన్నిటినీ ఆ పత్రిక పరిశోధించి రాసింది కాదు. ప్రణాళికా సంఘం ఒఆర్‌జి మార్గ్, మెకెన్సీ లాంటి సంస్థలు సర్వేలు చేసి చెప్పిన విషయాలనే పై పత్రిక పునరుద్ఘాటించింది.

నేషనల్ కౌన్సిల్ ఫర్ ఎప్లయిడ్ ఎకనమిక్ రిసెర్చ్ (ఎన్‌సిఎఇఆర్) తన నివేదికలో పేద ప్రజల పూర్తి ఆహార ధాన్యాల అవసరాలను రేషన్ షాపులు సరఫరా చేయడం లేదని, మిగతా అవసరాలు తీర్చుకోవడానికి మార్కెట్‌లో కొనుక్కోవడం వల్ల మొత్తంలో 60 శాతం ఆదాయం ఆహార ధాన్యాల కొనుగోళ్లకే ఖర్చు చేయాల్సి వచ్చిందని చెప్పిందంటే సర్వే చేయాల్సింది కేవలం రేషన్ షాపుల వ్యవస్థ మాత్రమే కాకుండా మొత్తం ఆ మార్కెట్ వ్యవస్థనే సమగ్రంగా అధ్యయనం చేయాల్సి ఉంటుంది. ప్రభుత్వాలకు కమిటీలంటే చాలా ఇష్టం. సమస్య వచ్చినప్పుడల్లా కమిటీలు వేయడం, సమస్య పరిష్కారం వాయిదా వేయడం, ఈలోగా సమస్య మరింత క్లిష్టతరం కావడం మామూలే.

ప్రభుత్వం ఇన్ని చర్యలు తీసుకొంటామని, తీసుకోబోతున్నామని ప్రకటిస్తుంది తప్ప నల్లబజార్ వ్యాపారస్తుల మీద చర్య తీసుకొన్నట్లు ఎపుడూ చెప్పలేదు. వారికున్న బీరకాయ పీచు చుట్టరికం అలాంటిది. పోనీ, నల్లబజార్ లాంటిదేమీ లేదని అంటుందా అంటే అలా అనదు. మనమంతా సంక్రాంతి, ఉగాది, దసరా, దీపావళి అని పండుగలు చేసుకొంటాం గాని, ఈ నల్లబజార్ వ్యాపారస్తులకు ధరలు పెరిగినపుడల్లా పండుగే. వారికి 2009 సంవత్సరం అంతా పండుగే. మంత్రులు, అధికారులు వారి దగ్గర చుట్టాలు కావడంతో వారి దొంగ బజారు నిల్వలు క్షేమం. బజారులో ఏ వస్తువైనా లేకుండా పోయిందా? బయట ఎంతగా దొరక్కపోయినా 'సరైన' ధర చెల్లిస్తే ఏ వస్తువైనా లభ్యమవుతుంది. చొరవ తీసుకొని ఏ వామపక్ష పార్టీలో ఈ గుట్టు రట్టు చేసి గోదాముల మీద దాడి చేస్తే, పోలీసులు వాళ్ల మీద లాఠీలకు పని చెబుతారు. ప్రభుత్వం రకరకాల లెక్కలు ప్రచురిస్తుంది కాని ఎపుడైనా అలాంటి నల్లబజారు వ్యాపారస్తుల మీద ఎన్ని దాడులు చేశారు, ఎన్ని నిల్వలను స్వాధీనం చేసుకొన్నారు, ఎంత మందిని శిక్షించారనే లెక్కలెపుడైనా ప్రచురించిందా? పోలీసు శాఖ ప్రతీ సంవత్సరం శాంతి భద్రతల గురించి రకరకాల గణాంకాలు గుప్పిస్తుంది కాని, ఎంత మంది చీకటి బజారు వ్యాపారస్తులను శిక్షించారో లెక్కలుండవా. శిక్షిస్తేగా లెక్కలుండేవి.

రాష్ట్రంలో 2009లో వెయ్యి మండలాల్లో వర్షాభావ పరిస్థితులు, ఆ తర్వాత కనీ ఎరుగని స్థాయిలో వరదలతో పంట తీవ్రమైన లోటుకు గురవుతుందని మెడ మీద తలకాయ ఉన్నవాడెవడైనా చెబుతాడు. కాని ప్రభుత్వం, అధికారులు ఏం చేశారు? వర్షాభావ పరిస్థితులు ఏర్పడక ముందే 2009–10 మొదటి అర్ధ సంవత్సరంలో వ్యవసాయ రంగం ద్వారా లభించిన స్థూల ఆదాయంలో అంతకు ముందు అర్ధ సంవత్సరంలో 4.8 శాతం నుండి 1.2 శాతానికి పడిపోయింది. అలాగే రెండవ ముందస్తు అంచనాల ప్రకారం 2008–09లో ఆహార ధాన్యాల పంట భూమి విస్తీర్ణం 72.15 లక్షల హెక్టార్లు ఉండగా 2009–10లో అదే కాలంలో 63.66 లక్షల హెక్టార్లకు తగ్గింది. అదేకాలంలో వరి పంట విస్తీర్ణం 41.95 లక్షల హెక్టార్ల నుండి 36.68 లక్షల హెక్టార్లకు తగ్గింది. నూనె గింజలు, వేరుశనగ, పప్పు ధాన్యాలు, పొద్దు తిరుగుడు పంటల కింద విస్తీర్ణం కూడా తగ్గింది. పైన ఉదహరించిన కాలంలోనే ఆహార ధాన్యాల ఉత్పత్తి 179.77 లక్ష టన్నుల నుంచి 144.29 లక్ష టన్నులకు దిగజారింది.

*ఎప్పుడయినా తప్పుడు పనికే ప్రభుత్వ సహాయం అవసరమవుతుంది. సత్యం దానంతట అదే నిలబడి ఉంటుంది.*

**- థామస్ జెఫర్‌సన్**

ధరలు పెరుగుతాయనీ తెలుసు. ముందస్తు చర్యలేమైనా తీసుకొన్నారా? దేశంలో కూడా ఖరీఫ్ పంట చాలా రాష్ట్రాల్లో దెబ్బతింది. పెద్ద తలకాయలుంటున్న కేంద్రం ఏం చేసింది. రాష్ట్రాలను హెచ్చరించిందా? గోదాములు నిండుగా ఉన్నాయని నిగడ దన్ని నిద్రపోయింది. కాగా ధరలు పెరక్క తరుగుతాయా? ప్రభుత్వ వైఫల్యం స్పష్టం. చాలా విషయాల్లో పత్రికల్లో వచ్చిన ముఖ్యమైన వార్తలను క్లిప్పింగ్‌లు జాగ్రతపరచడం నాకలవాటు. ఆ క్లిప్పింగ్‌లను పరిశీలించగా ఎపుడైతే ఖరీఫ్ పంట నేల చూపు చూడడం ప్రారంభమైందో, పత్రికల్లో ప్రభుత్వాన్ని హెచ్చరిస్తూ వార్తా వ్యాఖ్యలు వచ్చాయి. ఈ హెచ్చరికలను గమనంలోకి తీసుకోకపోవడం పోయి, ప్రణబ్ ముఖర్జీ మాటి మాటికీ వర్షాభావం, వర్షాభావం అంటూ పాట పాడితే, పరిస్థితి బాగుపడుతుందా అని అసహనం వ్యక్తం చేశాడు.

వాతావరణ శాఖ వర్షాలు 101 శాతం కురుస్తాయని, అందుచేత ఫర్వాలేదని శరద్ పవార్ భరోసా పలకగా, ఆచరణలో 23 శాతం వర్షాభావం తగ్గింది. ఆశ నిరాశ అయింది. పోనీ ఇపుడైనా జాగ్రత్త తీసుకొంటున్నారా అంటే రబీ పంట మనను రక్షిస్తుందని భరోసా పలుకుతున్నారు. అది కూడా అనుమానమేనని పెరిగే ధరలు కొన్ని నెలలు ఇలాగే కొనసాగుతాయని కొంత మంది అంటున్నారు.

ఏ రంగంలో కష్టాలొచ్చి పడినా విదేశాల వైపు చూడడం ప్రభుత్వానికి అలవాటై పోయింది. అలాగే ధరలను అదుపులోకి తీసుకొని రావడానికి విదేశాల నుంచి తిండి గింజలు, పప్పు ధాన్యాలు దిగుమతి చేసుకొందామంటే రిజర్వ్ బ్యాంక్ ప్రకారమే మనకన్నా ఎక్కువ స్థాయిలో విదేశాల్లో ధరలు పెరిగాయి. అంటే దిగుమతులు ధరల సమస్యకు పరిష్కారం కానేరదు. కేంద్రం తాను ద్రవ్యోల్బణాన్ని అదుపులో పెట్టలేక పోతోంది. ఇలాంటి కష్టాల్లో విదేశీ మారక నిల్వలున్నా, ఫలితం శూన్యం. అన్ని దారులు మూసుకొని పోవడంతో కేంద్రం దృష్టి రాష్ట్రాల మీద పడింది. లోకువగా ఉన్న వాడిని మొత్త బుద్దేస్తుంది మరి. మీరు పంటలు సరిగా పండించలేదు. మీరు పన్నులు ఎక్కువగా వసూలు చేస్తున్నారు. అందుకు ధరలు పెరిగాయని బాధ్యత రాష్ట్రాల నెత్తిన రుద్దుతున్నారు కేంద్ర నాయకులు.

వర్షాలు పడక, వరదలొచ్చి, ఉత్పత్తి తగ్గి, ధరల పెరుగుదలకు కారణమయిందని ప్రభుత్వం అంటోంది. కాని వాస్తవమేమంటే దేశంలో 1990వ దశకంతో ప్రారంభించి వ్యవసాయం కునారిల్లి పోతోంది. వ్యవసాయంలో పెట్టుబడులు పెట్టకపోవటం వల్లనే ఉత్పత్తి నేల చూపు చూస్తోందని గణాంకాలు తెలియచేస్తున్నాయి. ఆవుకు మేత వేయకుండా పాలెలా ఇస్తుంది. వ్యవసాయ జిడిపి 1980-95 మధ్య 3.3 శాతం నుంచి 1995-96 / 2004-05 నాటికి కేవలం రెండు శాతానికి తగ్గింది. ప్రపంచ బ్యాంక్‌ను రెండు చేతుల్తో ఆహ్వానించి ఈ తద్దినం నెత్తిన పెట్టుకొన్నాం. జిడిపిలో వ్యవసాయం శాతం తగ్గడానికి కారణం ఉత్పత్తి తగ్గడమే. ఉత్పత్తి తగ్గితే ధరలు పెరుగుతాయి. పేదల ఆదాయానికి, ధరలకు మధ్య దూరం పెరిగిపోతూ వచ్చింది. ధర ఎక్కువ కారణంగా తక్కువ తిండి తింటున్నారు. ఇది కాలరీల తగ్గుదలకు, దాని పర్యవసానంగా అనారోగ్యానికి దారితీసింది.

1994-96తో పోలిస్తే 2004-06 నాటికి తిండి గింజల లభ్యత 7.8 శాతం తగ్గింది; ఎంత తగ్గిందంటే స్వతంత్రం వచ్చిన కొత్త రోజుల్లో 1954-56 కన్నా తగ్గిపోయింది. విత్తిన పంట భూమి విస్తీర్ణం, నీటిపారుదల సౌకర్యం ఉన్న భూమి విస్తీర్ణం కూడా తగ్గింది. ధర వరలు చూస్తే ప్రపంచ వ్యాపార సంస్థ (డబ్ల్యు.టి.ఒ.) అవతరించిన తర్వాత కాలంలో వ్యవసాయేతర ఉత్పత్తులతో పోలిస్తే వ్యవసాయ ఉత్పత్తుల ధరలు 1996-97 / 2003-04 మధ్య 1.7 శాతం తగ్గాయి. అలాగే భూసారం తగ్గి, ఇన్‌పుట్స్ ధరలు పెరిగి, వ్యవసాయం క్షీణిస్తూ వచ్చింది. ఇలాంటి గణాంకాలు కుప్పలు తెప్పలుగా ఉన్నాయి. వాటి సారాంశం ఏమంటే వ్యవసాయరంగంలో సంక్షోభం నిన్నామొన్నటిది కాదని, సంస్కరణలు ప్రారంభించినప్పటి నుంచి దేశాన్ని వెన్నాడుతోంది. ఈనాటి పరిస్థితికి వస్తే, గత ఏడాది జూన్ నెల నుంచే ప్రకృతి వైపరీత్యాలు కారణంగా ఈ పరిస్థితి మరింత క్షీణించి ధరల పెరుగుదలకు కారణమైంది.

'సూర్య' పత్రిక ఈ పరిస్థితి గురించి సంపాదకీయంగా వ్యాఖ్యానిస్తూ 'ఆహార కొరతకు, ధరలు ఆకాశాన్నంటడానికి అరవై శాతం వ్యవసాయ భూమి వర్షాధారం కావడం, తొలకరి వానలు విఫలం కావడం కారణాలని చెబుతున్నా వ్యాపార దళారీ వర్గాల, చక్కెర పరిశ్రమల యజమానుల ప్రయోజనాలు కాపాడే రీతిలో విధాన రూప కల్పన, అమలు జరుగుతూండడమే ఇప్పటి అపూర్వ ఆహార ద్రవ్యోల్బణానికి కారణం. ఈ ధోరణులు చూస్తూంటే దేశాధ్యక్షురాలు ప్రతిభా పాటిల్ అన్నట్లు - మనకు కావాల్సింది రెండో సస్య విప్లవం కాదు, రెండో స్వతంత్ర పోరాటం కావాలి. వీ

**వచ్చే సంచికలలో...**

- ఫోకస్ - ఏప్రిల్ 2010 : కేంద్ర, రాష్ట్ర బడ్జెట్లు
- ఫోకస్ - మే 2010 : కార్మిక జీవితాలు - స్థితిగతులు
- సామాన్యులకి సంక్షోభం - సంపన్నులకి సంక్షేమం - ఇ.ఎస్. బ్రహ్మచారి
- నిరాశపర్చిన కోపెన్‌హాగెన్ సదస్సు - ఎ. నర్సింహారెడ్డి
- ప్రాంతీయ అసమానతలు - ప్రత్యేక రాయలసీమ - అంగడి రంగారెడ్డి
- నారాయణపట్నా - సుధా రామచంద్రన్

*వాకపల్లికి న్యాయం జరగకుండానే భల్లుగూడను ఎదుర్కొంటున్న ఆదివాసులు మనువాద రాజ్యంలో న్యాయం ఆశించడం దురాశేనని మరోసారి రుజువయిందని అంటున్నారు* **లకే రాజారావు**

# నాడు వాకపల్లి - నేడు భల్లుగూడ

నాటి వాకపల్లి, నేటి భల్లుగూడ గ్రామాలలో చంటిపిల్లల తల్లులైన కోందు మహిళలపై జరిగిన గ్రేహౌండ్స్ పోలీసుల గ్యాంగ్ రేప్ సంఘటనలలో రెండు పక్షాల నుండి రెండు రకాల వాదనలు జరుగుతున్నాయి. అవి, 1) మనువాద కాంగ్రెస్ ప్రభుత్వం, వారి పోలీసులు గ్యాంగ్‌రేప్ జరగలేదనీ, అది నిజం కానే కాదనీ; 2) బాధిత మహిళలు తుపాకులు భుజాన వేసుకున్న, తెల్ల మచ్చల బట్టలు వేసుకున్న పోలీసులు మాపై గ్యాంగ్ రేప్ చేశారనీ, అదే నిజమనీ.

ఉభయ పక్షాల వాదనల్లో, పరస్పర ఆరోపణల్లో నిజమెంత? మానవతావాదులు, ప్రజాస్వామికవాదులు, బాధ్యతగల పౌరులు, మనసు పెట్టి ఆలోచిస్తే నిజాన్ని బతికించడానికి నిజం పక్షం కొందరైనా నిలబడితే ఆ నిజాలు నిలబడవచ్చు. దోషులు శిక్షింపబడవచ్చు.

ప్రభుత్వ గ్రేహౌండ్స్ పోలీసు గ్యాంగ్‌రేప్‌ల ద్వారా ఈ దేశంలో పేదరికం పోతుందా? అమాయక ఆదివాసీ ప్రజలపై అక్రమ కేసులు బనాయిస్తే మావోయిజం ఆగుతుందా? ప్రభుత్వం పోలీసు వ్యవస్థను పెడదారి పట్టిస్తోందా? లేక పోలీసు వ్యవస్థ ప్రభుత్వాన్ని చెడుదారికి నడిపిస్తోందా? ఎందుకు? ఎలా? ఎవరు ఎవరిని పక్కదారి పట్టిస్తున్నారు? ఇందుకు బాధ్యులెవరు? ఇందుకు సమాధానం వెతకవలసిన బాధ్యత, మేధావులుగా చలామణీ అవుతున్న బహుజన సమాజానికి చెందిన వారిపై, బాధ్యతగల పౌరులపై, విద్యావంతులపై ఉందనీ, ఈ ప్రశ్నలకు జవాబు కనుక్కునే బాధ్యత కూడ బహుజన సమాజానిదేననీ నా భావన.

బహుజన సమాజ ఉద్ధారకుడు, నిరుపేదల పక్షపాతి, రాజ్యాంగ నిర్మాత, మానవతా వాది డా. బి.ఆర్. అంబేద్కర్ సాధించిన ఫలాలు అనుభవించి విద్యావంతులైన వారు, ఆయా రంగాల్లో, వివిధ హోదాల్లో స్థిరపడి మేధావులుగా చలామణీ అవుతున్న 'బహుజన సమాజానికి' చెందిన వ్యక్తులు ఎక్కడున్నారు? ఏం చేస్తున్నారు? ఈ ప్రశ్నలకు జవాబు చెప్పే బాధ్యత మీది కాదా? మీ సమాజానికి చెందిన అక్కలు, తల్లులు, చెల్లెలు, తమ్ముళ్లు పల్లెల్లో, అడవుల్లో దౌర్జన్యాలకు, అవమానాలకు, సామూహిక మానభంగాలకు బలవుతుంటే మీరు ఎక్కడ నిద్రపోతున్నారు? ఇకనైనా లేవండి. నిజం పక్షం నిలబడి ఆ నిజాన్ని బతికించండి. పల్లెల్లో, కొండల్లో, మారుమూల ప్రాంతాల్లో ఆత్మగౌరవం చంపుకొని బతుకులీడుస్తూ, బలవంతుల దుర్మార్గానికి బలవుతున్న నీవారికి సహాయ పడండని బహుజన బంధువు డా. బి.ఆర్. అంబేద్కర్ మాటలను ఆచరించండని మీకు గుర్తు చేస్తూ -

22 జనవరి 2010న తెల్లవారుజాము 4-5 గంటల సమయంలో విశాఖ జిల్లా, ముంచంగిపుట్టు మండలం భల్లుగూడ గ్రామంలో ముంచంగిపుట్టు ఎస్.ఐ. పర్యవేక్షణలో గల తెల్లమచ్చల బట్టలు వేసుకున్న నక్సల్ నిరోధక పోలీసులు తలుపులు పగులగొట్టి, బలవంతంగా ఇళ్లలో జొరబడి మూడు నెలలు, రెండు సంవత్సరాల వయస్సు కలిగిన చంటి పిల్లలను బయటకు పడవేసి ఐదుగురు గిరిజన కోందు మహిళలను వారి భర్తలను అదుపులో పెట్టుకొని, ఐదుగురు, ఇద్దరు చొప్పున వారిని గ్యాంగ్ రేప్ చేసారు.

ఆ ఆదివాసీ మహిళలు తమకు జరిగిన అన్యాయాన్ని ఎలక్ట్రానిక్, ప్రింట్ మీడియా ద్వారా సభ్య సమాజం ముందు బయటపెట్టారు. దీని ఆధారంగా బాధ్యులైన వారిపై ఫిర్యాదు చేస్తే దోషులు ఎంతటివారైనా శిక్షిస్తామని జిల్లా ఎస్.పి అన్నారు. విచారణాధికారిగా అనకాపల్లి డి.ఎస్.పి.ని నియమించారు.

ప్రస్తుతం జైల్లో ఉన్న బాధిత మహిళల భర్తలు, ఆ గ్రామానికి చెందిన కొంతమంది యువకులకు మావోయిస్టులతో సంబంధాలు ఉన్నాయనీ, వారు కరుడుగట్టిన మిలీషియా సభ్యులనీ పోలీసులు చేస్తున్న ఆరోపణలపై, అదే విధంగా గ్యాంగ్‌రేప్ చేసినట్లు పోలీసులపై వచ్చిన ఫిర్యాదు మీద బహిరంగ విచారణ జరిపి నిజానిజాలు పరిశీలించాలనీ, బాధితులకు న్యాయం చేయాలనీ జిల్లా కలెక్టర్, పాడేరు ఆర్.డి.ఒ.కు ఫిర్యాదు అందజేశాం. అయినా ఆ విధంగా విచారణ నేటికీ జరగలేదు. గ్యాంగ్‌రేప్ సంఘటనపై విచారణకు అధికారికంగా నియమించబడిన డి.ఎస్.పి. పోలీసులు తమకు అనుకూలంగా తిప్పుకున్న బక్క కిల్లో బుట్టు అనే వారిని మాత్రమే విచారించి గ్యాంగ్ రేప్ జరగలేదనీ, ఆరోపణలు నిజం కాదనీ, అవన్నీ అభూత కల్పనలనీ, కొంతమంది స్వార్థపరులు అనవసర ఆరోపణలు చేయించినట్లు తమ విచారణ ద్వారా వెల్లడి చేశారు.

తన డిపార్ట్‌మెంట్‌కు చెందిన వ్యక్తి ద్వారా జరిగిన శాఖాపరమైన విచారణ నిష్పక్షపాతంగా, నిజాయితీగా, చిత్తశుద్ధితో నిజనిజాల నిర్ధారణకు జరిగిన విచారణగా ప్రజాస్వామిక వాదులు గానీ, బాధ్యత గల పౌరులు గానీ భావించవచ్చా? కాకిపిల్ల కాకికి ముద్దన్నట్లు - పోలీసులపై వచ్చిన ఆరోపణలపై పోలీసు అధికారి విచారణ ద్వారా బాధిత మహిళలతో పాటు అక్రమ కేసులు బనాయించబడి అక్రమంగా జైళ్లలో ఉన్న వారి భర్తలకు కూడా న్యాయం జరిగే అవకాశం ఉన్నదా? తన విచారణలో ఆరోపణలన్నీ అభూతకల్పనలైనప్పుడు, వారి

ఆరోపణలన్నీ నిజమైనప్పుడు విచారణ అధికారితో సహా ఆరోపణలతో సంబంధమున్న పోలీసులు వ్యవహరించిన తీరును ఒక్కసారి పరిశీలిస్తే ఏది నిజమో తెలుస్తుంది.

పోలీసులు చెప్పేది నిజమైతే, మహిళలు చెప్పేది అబద్ధమైతే :

1. కిల్లోబుట్టు భర్త నాగరాజును తమకు అనుకూలంగా సాక్ష్యం చెప్పాలనే ఒప్పందంతో అతనిపై కేసులు పెట్టకుండా విడిచిపెట్టిన విషయం నిజం కాదా?

2. ఒకవేళ ఒప్పందానికి వ్యతిరేకంగా సాక్ష్యం చెపితే ముప్పై సంవత్సరాలు జైలుశిక్ష అనుభవిస్తావనీ నాగరాజును బెదిరించడం నిజం కాదా? మీ ప్లాను ప్రకారం మీకు అనుకూలంగా సాక్ష్యం చెప్పించడం కూడా అబద్ధమా?

3. డి.ఎస్.పి. విచారణ చేస్తున్న సమయంలో ముంచంగిపుట్టు ఎస్.ఐ. బుట్టును, ఆమె భర్త నాగరాజును బెదిరించడం అబద్ధమా?

4. వైద్య పరీక్షల నిమిత్తం కె.జి.ఎచ్.కు వెళ్తున్న సమయంలో బాధిత మహిళల కుటుంబ పెద్దలను వారితో తోడు వెళ్లకుండా ఎస్.ఐ. అడ్డుకోవడం అబద్ధమా?

5. తమకు అనుకూలంగా సాక్ష్యం చెపితే డబ్బు ఇస్తామని ప్రలోభాలకు గురిచేయడం అబద్ధమా?

6. రేప్ జరగలేదనే సాక్ష్యం చెప్పిన బుట్టును మెడికల్ చెకప్‌కు మిగతా మహిళలతో కె.జి.ఎచ్.కు పంపడం అబద్ధమా?

7. ఆరోపణలతో సంబంధమున్న ఎస్.ఐ.ని బాధిత మహిళలకు ఎస్కార్ట్‌గా నియమించడం అబద్ధమా?

8. వైద్య పరీక్షలు చేయించుకోవద్దని బెదిరించడం అబద్ధమా? పోలీసుల వాదన ప్రకారం నిజం కానప్పుడు పోలీసులు ఇలా ఎందుకు వ్యవహరించారు?

9. రేప్ జరగలేదని తెల్లకాగితంపై సంతకాలు చేయాలని డి.ఎస్.పి. ఒత్తిడి చేయడం అబద్ధమా? నిజాన్ని దాయాలనే పథకంలో భాగంగా తమకు అనుకూలంగా మలచుకున్న బుట్టును మాత్రమే విచారించి, మిగతా వారిని విచారణకు హాజరుకాని విధంగా విచారణ అధికారి బెదిరింపు చర్యలకు పాల్పడడం న్యాయమా? కనుక డిపార్ట్‌మెంట్ విచారణ నిజాన్ని కూడా గ్యాంగ్ రేప్ చేయడానికి తప్ప దోషులను శిక్షించడానికి కాదనేది పచ్చి నిజం.

అన్నెం పున్నెం తెలియని గిరిజన నిరుపేద కోందు మహిళలపైన జరిగిన దారుణంపై నిజాలు సమాధి చేయడానికి పోలీసులు చేస్తున్న పన్నాగాలను అడ్డుకొని నిజాల్ని బతికించి, దోషుల్ని శిక్షించి, న్యాయాన్ని బతికించుకోవలసిన బాధ్యత బహుజన సమాజానికి చెందిన మేధావులు, విద్యావంతులు, అదే విధంగా బాధ్యత గల అన్ని వర్గాల పౌరులపై ఉంది. ఆ దిశలో బహుజన సమాజాన్ని మేల్కొలిపి, చైతన్యపర్చ వలసిన అవసరం ఉంది. అలాకాని పక్షంలో ఆత్మాభిమానం, ఆత్మగౌరవం మెండుగా ఉన్న మహిళలు చెప్పే నిజాలు సమాధి కాక తప్పదు. న్యాయస్థానాలు, జాతీయ, రాష్ట్ర మానవహక్కుల సంఘాలు కూడా బహుజన సమాజం పట్ల పక్షపాతంతో వ్యవహరిస్తున్న తీరు మిక్కిలి బాధాకరం. వాకపల్లి సంఘటనలో ఎలా స్పందించాయో వాటిని ఈ సందర్భంగా గుర్తు చేసుకోవాలి.

గ్రేహౌండ్స్ పోలీసులపై బాధిత మహిళలు చేసిన ఆరోపణలు నిజం కాదని మనువాద కాంగ్రెస్ ప్రభుత్వ పోలీసు అధికారుల వాదన ప్రకారం ఒక్క నిమిషం ఆలోచిద్దాం. రేప్ జరిగినట్లు అధికారులకు ఫిర్యాదు చేసిన మహిళలు విద్యావంతులా? వారికి నాగరిక ప్రజలు మాట్లాడే భాషలు తెలుసా? అబద్ధాలు చెప్పే సంస్కృతికి అలవాటు పడిన ప్రాంతాలలో నివసిస్తున్నారా? డబ్బు కోసం కక్కుర్తితో ఇలాంటి ఆరోపణలు చేసే తెలివిగల ప్రొఫెషనల్సా? దేశంలో, రాష్ట్రంలో గతంలో ఎక్కడైనా, ఎప్పుడైనా, ఏనాడైనా ఇలాంటి ఆరోపణలతో పోలీసుల నుండి డబ్బు తీసుకున్న సంఘటనలు ఉన్నాయా? ఇలా చేయడం వలన వారి పేరు ప్రతిష్టలు, ధనధాన్యాలు, సిరి సంపదలు వీరికి సమకూరుతాయా? నోరుండి తమకు జరిగిన దుర్మార్గాన్ని కూడా స్వయంగా చెప్పుకోలేని స్థితిలో ఉన్న మూగజీవులు ఏ లాభం కోసం పోలీసులపై ఆరోపణలు చేశారు?

భర్తలతో కాయకష్టం చేసుకొని, భర్తలతో సంసారం చేస్తూ బతుకుతున్న ఏ స్త్రీ కూడా అనవసరంగా తనకు రేప్ జరిగినట్లు పది మందికి చెప్పుకునే ధైర్యం, సాహసం చేయలేదు. అటువంటి సాహసం, బరితెగింపు, నీచమైన సంస్కృతి మొత్తం స్త్రీ జాతిలోనే లేదు. ప్రాణం కంటే మానం గొప్పదనే నమ్ముతుంది స్త్రీజాతి. అందులో కోందు తెగ మహిళల్లో అటువంటి నీచమైన సంస్కృతి గానీ, తమ జీవన విధానంలో గానీ, ఆచార వ్యవహారాల్లోగానీ వాటికి స్థానం లేదు. ఏ కల్మషం, కల్లా కపటం, మోసం, దగా తెలియని మానవత్వాలు, సమానత్వం, ఆత్మాభిమానం, ఆత్మగౌరవం మెండుగా కలిగిన జాతి మహిళలది.

మనువాద కాంగ్రెస్ ప్రభుత్వం, పోలీసుల దృష్టిలో ఈ మహిళలు చేసిన ఆరోపణలన్నీ అబద్ధాలా? నాడు వాకపల్లి నేడు భల్లుగూడ ఉభయ గ్రామాల కోందు మహిళలు చంటిపిల్ల తల్లులే? భర్తలతో సంసారం చేస్తున్న గిరిజన స్త్రీలు చేసిన ఆరోపణలు ప్రభుత్వం దృష్టిలో నిజాలు కావు?

పోలీసులు చెప్పేదే నిజం. వాటిని మాత్రమే మనం నమ్మాలా? అమాయక గిరిజనుల మీద, చివరికి బి.ఎస్.పి.. కార్యకర్తలకు కూడా మావోయిస్టులతో లేని సంబంధాలు అంటగట్టి, మిలీషియా సభ్యులుగా ముద్రలు వేసి, అక్రమ కేసులు బనాయించి, శారీరకంగా, మానసికంగా, ఆర్థికంగా చిత్రహింసలు పెట్టడం అబద్ధమా? గొడ్డును బాదినట్లు బాది మావోయిస్టులు చేసే నేరాలను గిరిజనులపై మోపి జైల్లో కుక్కడం అబద్ధమా? అదే విధంగా గిరిజనులపై పోలీసులు చేసే ఆరోపణలన్నీ నిజాలేనా? వాటికి ఆధారాలేంటి? మీ గ్యాంగ్ రేప్‌లకు ఎలాగు ఆధారాల్లేవు. మీ ఆరోపణలకు ఏ ఆధారాలున్నాయి?

ఆ స్వార్థపరులెవరో బహుజన సమాజ విద్రోహులుగా దోషులుగా, దేశ ద్రోహులుగా నిలబడక తప్పదు. మేము చెప్పిందే వేదం కనుక, మేము ఏది చేసినా కూడా న్యాయమంటే ఎలా? భారత రాజ్యాంగం ప్రతి మనిషికి పౌరహక్కులు కల్పించింది. పోలీసులు చెప్పేదే వేదం, వారు చేసేదే న్యాయమని రాజ్యాంగం ఆ విధంగా చెప్పలేదు. కనుక పౌరులుగా అడుగుతున్నాం. కనీసం నాటి వాకపల్లి, నేటి భల్లుగూడ గ్యాంగ్ రేప్ సంఘటనలపై నైనా సిట్టింగ్ జడ్జ్‌తో లేదా స్వతంత్ర సంస్థలతో దర్యాప్తుకు ప్రభుత్వం సిద్ధమా? పోలీసు అధికారులతో జరిగే విచారణలు ఎట్టి పరిస్థితులలో బాధితుల పక్షం కాబోవు. కాలేదు. ఆ

విచారణలు ఎల్లప్పుడూ దోషుల పక్షమేననీ చరిత్ర చెబుతోంది. కనుక స్వపక్ష విచారణ నిజాలను సమాధి చేస్తుందే తప్ప రుజువు చేయదు. నాడు వాకపల్లి, నేడు భల్లుగూడలో అదే జరిగింది. ఎస్.సి., ఎస్.టి., అట్రాసిటీ కేసులు రెండు సంఘటనల్లో కూడా నమోదు చేయబడ్డాయి. ఆ కేసులు ఎవరిపై నమోదు చేసారో పోలీసులకే తెలియాలి.

నాటి వాకపల్లి సంఘటనపై రాష్ట్ర గిరిజన సంక్షేమ ముఖ్య కార్యదర్శి నాగిరెడ్డికి వాకపల్లి వాస్తవాలు తెలిసాయి. ఎస్.సి., ఎస్.టి. జాతీయ కమిషన్‌కు వాస్తవాలు తెలిసాయి. ఇంకా తెలియాలంటే సమగ్ర విచారణకు సి.బి.ఐ.తో దర్యాప్తు జరగాలనీ ఉభయులు ప్రభుత్వాన్ని కోరారు. నాటి ప్రభుత్వం ఆ పని ఎందుకు చేయలేదు? ఎటువంటి ప్రాథమిక విచారణ చేయకుండానే గంట వ్యవధిలో రాష్ట్ర డి.జి.పి. గ్యాంగ్‌రేప్ జరగలేదని సర్టిఫై చేశారు. ఇంకా దర్యాప్తులతో పనేంటి? అందులో నిరుపేదలు, చదువు, డబ్బు, తెలివి, నోరు లేని నిరుపేద కోందు మహిళలకు తోడెవరుంటారు. చివరికి న్యాయస్థానాలతో పాటు మానవ హక్కుల సంఘాలు కూడా అగ్రవర్ణాల పక్షంతో తప్ప మీ తోడు రాలేమని రుజువు చేసుకున్నాయి. వాకపల్లి మహిళల గొంతు నొక్కిన విధంగా భల్లుగూడ మహిళల గొంతు కూడా నులమకుండా ఉభయ పక్షాల ఆరోపణల్లో నిజమెంత, వాస్తవమెంత. పోలీసులపై తప్పుడు ఆరోపణలు చేయించిన ఆ స్వార్థపరుల్ని పదిమంది ముందు నిలబెట్ట వలసిన అవసరముంది.

గ్యాంగ్ రేప్ జరిగినట్లు ఆధారాలేంటి? అందుకు సాక్ష్యాలు ఉన్నాయా? ఎవరైనా చూసారా? అంటూ పోలీసులు ప్రశ్నిస్తున్నారు. సాక్ష్యాలుంటే దోషుల్ని శిక్షిస్తామంటున్నారు. ప్రభుత్వ అండతో ముందుగా వేసుకున్న పథకం ప్రకారం జరుగుతున్న మానభంగాలకు, గ్యాంగ్ రేప్‌లకు సాక్ష్యం ఎలా సాధ్యపడుతుంది? ప్రజల సమక్షంలో ఇటువంటి నేరాలు చేస్తారా? సాక్ష్యం లేనిదే అరెస్ట్‌లు సాధ్యం కానప్పుడు తెలుగుదేశం ఎం.ఎల్.ఎ.పై తన విద్యా సంస్థలో చదువుతున్న విద్యార్థినుల చేత ఫిర్యాదు చేయించి అతనిని అరెస్ట్ చేసిన ప్రభుత్వం వాకపల్లి, భల్లుగూడ అమాయక, నిరుపేద మహిళలు, కూంబింగ్ పోలీసులు రేప్ చేశారని స్వయంగా ఫిర్యాదు చేసినా వారిని ఎందుకు అరెస్ట్ చేయలేదు. ఎస్.సి. కులానికి చెందిన ఎం.ఎల్.ఎ. కాబట్టి అరెస్ట్ చేశారా? రేప్ చేయబడిన మహిళలు అమాయక ఆదివాసులు కాబట్టి అదే పనిగా రేప్‌లు చేయిస్తారా? కులాల్ని బట్టి న్యాయం ఉంటుందని ఏ రాజ్యాంగంలో రాయబడింది?

ఈ మహిళలు చదువు, తెలివి, నోరు, బుకాయింపు, దబాయింపు, రాజకీయ, ఆర్థిక అండదండలు లేని నిరుపేద ఆదివాసులు కాబట్టి, ఎస్.సి., ఎస్.టి.ల రక్షణకు రాజ్యాంగం కల్పించిన బలమైన ఎన్ని చట్టాలున్నా, ఈ చట్టాలూ, పౌరహక్కులూ పనికిరాని చిత్తుకాగితాలుగా మిగిలిపోతున్నాయి. ఇటువంటి శక్తిమంతమైన చట్టాలను అమలుపరచి దోషులను చట్టపరంగా కఠినంగా శిక్షించే బాధ్యత ప్రభుత్వానిది. కానీ మనువాద కాంగ్రెస్ ప్రభుత్వం నేరాలు చేసినా, తన మనుషులను కాపాడుకోవడంలో భాగంగా, బహుజన సమాజానికి చెందిన బాధితులను రక్షణ, తగు న్యాయం కల్పించే సందర్భాల్లో వీరికి అనుకూలంగా చట్టాలు అమలుపర్చడంలో పక్షపాతంతో వ్యవహరిస్తోంది. బాధితులకు అండగా నిలబడవలసిన ప్రభుత్వమే వివక్ష చూపుతుంటే, అటువంటి ప్రభుత్వాలను ప్రజలు ఎందుకు విశ్వసించాలి. ఎస్.సి., ఎస్.టి. అట్రాసిటీ చట్టాన్ని ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వం అమలు చేయకుండా నిర్లక్ష్యం చేస్తోందని జాతీయ ఎస్.సి., ఎస్.టి. కమిషన్ ఈ ప్రభుత్వాన్ని తప్పుబట్టిన విషయం మనం గుర్తు చేసుకోవాలి.

మన మీద పాలక ప్రభుత్వాల నిర్లక్ష్యం వలన ప్రపంచంలోనే భారతదేశంలో గల ఆదివాసులు దుర్భర జీవితాలు గడుపుతున్నారనీ, ఈ తెగ ప్రజల ఆయుషు ప్రమాణం, జీవన ప్రమాణాలు తగ్గిపోతున్నాయనీ, ప్రాజెక్టులు, బహుళజాతి సంస్థలకు గనుల తవ్వకాలు అప్పజెప్పడం, గిరిజన సంపద రక్షణకు 1/70 వంటి చట్టాలు ఉన్నప్పటికీ అడవులు, భూములు, ఆదివాసేతరుల ఆక్రమణల్లోనే ఉన్నాయని ఐక్యరాజ్య సమితి కేంద్ర, రాష్ట్ర ప్రభుత్వాలను హెచ్చరించిన అంశాన్ని, అదే విధంగా జాతీయ ప్రణాళికా సంఘం, జాతీయ గ్రామీణాభివృద్ధి సంస్థలు కూడా మన కేంద్ర, రాష్ట్ర ప్రభుత్వాలను హెచ్చరించిన విషయాన్ని బహుజన సమాజానికి చెందిన విద్యావంతులు తప్పక గమనించాలి. ఆదివాసుల సంక్షేమాన్ని ఈ ప్రభుత్వాలు ఎందుకు విస్మరిస్తున్నాయి? విధులను, కర్తవ్యాన్ని రాజ్యాంగ బద్ధంగా వ్యవహరించ వలసిన ప్రభుత్వాలు అందుకు విరుద్ధంగా ఎలా పనిచేస్తున్నాయో ఆలోచించాలి. ప్రభుత్వ మనువాద దృక్పథాన్ని, తన దమననీతిని, గిరిజనుల పట్ల తన కపట ప్రేమను ఎండగట్టవలసి ఉంది.

విద్యావంతులు, బహుజన మేధావులు మనువాద ప్రభుత్వాలను ప్రశ్నించాలి. ఈ పనితోనే సరిపెట్టుకోకుండా బహుజన సమాజం అనుభవిస్తున్న సామాజిక, ఆర్థిక, బానిసత్వ విముక్తి కోసం తమ జీవితాంతం అహరహరం అనేక త్యాగాలతో ఉద్యమించిన మహా పురుషులు, స్ఫూర్తిదాతలు, సామాజిక విప్లవకారులు, మన బహుజన పితామహులైన జ్యోతిబా ఫూలే, సాహు మహరాజ్, కొమురం భీం, బిర్సా ముండా, కాన్షీరాం, డా. బి.ఆర్. అంబేద్కర్ ఆశయాలే మనకు స్ఫూర్తి.

'నీ పేదరికానికి, దుఃఖానికి, అవమానాలకు, కష్టాలన్నిటికీ కారణం నీ చేతిలో రాజ్యాధికారం లేకపోవడమే' అని డా. అంబేద్కర్ కలలు గన్న బహుజన రాజ్యస్థాపనకు మేధావులు, విద్యావంతులు తమ మేధస్సును, సమయాన్ని, వనరులను వెచ్చించి రాజ్యాంగ అధికారం లక్ష్యంగా నేడు జరుగుతున్న ఉద్యమాలలో భాగస్వాములు కావాలి. ఆ దిశలో బహుజన సమాజాన్ని నడిపించాలి. బహుజనులు ఈ దేశానికి పాలకులు కానంత కాలం మనువాద ప్రభుత్వాలు అన్ని రకాల వివక్ష, అణచివేత, పేదరికం, నిరుద్యోగం, కష్టాలు, నష్టాలు, ఆకలి, అవినీతి, దగా దౌర్జన్యాలు, దోపిడీలు, కుట్రలు, కుతంత్రాలు మనపై కొనసాగిస్తూనే ఉంటాయి. వీ

ఒక పక్క మతాన్నే ప్రాతిపదికగా చేసుకొని రిజర్వేషన్‌లు అమలుచేస్తూనే, మరోపక్క అత్యంత వెనుకబడిన ముస్లిం ప్రజానీకానికి మతప్రాతిపదికన రిజర్వేషన్‌లు చెల్లవనడం న్యాయవ్యవస్థ ద్వంద్వ ప్రమాణాలను సూచిస్తోందని అంటున్నారు **ఎ.ఎం. ఖాన్ యజ్దానీ (డానీ)**

# సామాజిక న్యాయస్థానాలు కావాలి

ఆంధ్రప్రదేశ్ ముస్లిం రిజర్వేషన్ చట్టం – 2007ను కొట్టివేస్తూ రాష్ట్ర ఉన్నత న్యాయస్థానం ఏడుగురు సభ్యుల విస్తృత ధర్మాసనం ఫిబ్రవరి 8న తీర్పు చెప్పింది. ముస్లిం రిజర్వేషన్ చట్టాన్ని ఆంధ్రప్రదేశ్ హైకోర్టు కొట్టివేయడం ఇది ముచ్చటగా మూడోసారి. ఇందులో విచిత్రమూ, ఆశ్చర్యమూ ఏమీలేవు గానీ, కాలంచెల్లిన ధర్మపన్నాలతో న్యాయమూర్తులు ఇచ్చిన తీర్పు న్యాయస్థానాల సాంప్రదాయ విశ్వసనీయతని మసక బార్చేటట్టుగా ఉండడమే కొత్త పరిణామం.

'మత ప్రాతిపదికన రిజర్వేషన్‌లు చెల్లవు. ముస్లిం రిజర్వేషన్‌లు మత మార్పిడుల్ని ప్రోత్సహిస్తాయి. చట్టాన్ని దుర్వినియోగం చేసే అవకాశముంది. ముస్లిం సమాజంలో కులాలను సరిగ్గా నిర్వచించ లేకపోయారు. ఇతర మతాల దరఖాస్తుల్ని పక్కనపెట్టి, ముస్లింల దరఖాస్తుల్నే పరిష్కరించారు. బి.సి. కమిషన్ నిర్వహించిన సర్వే అసమగ్రంగా ఉంది. రాజకీయ ప్రయోజనాల కోసం ముస్లింలకు రిజర్వేషన్‌లు ఇచ్చారు' – ఇవీ ఆంధ్రప్రదేశ్ ముస్లిం రిజర్వేషన్ చట్టం–2007ను కొట్టివేయడానికి రాష్ట్ర ఉన్నత న్యాయస్థానం విస్తృత ధర్మాసనం పేర్కొన్న ప్రధాన కారణాలు.

కేసు కొట్టివేయడానికి హైకోర్టు చూపిన కారణాల్లో ఒక్కటీ కొత్తది కాదు. ముస్లిం ఆలోచనాపరులు, పౌరహక్కుల సంఘాల వాళ్లే కాక, హిందూ ఉదారవాదులు సహితం ఇలాంటి సాకుల్ని పదే పదే ఖండిస్తూనే ఉన్నారు. ఉద్దీపన చర్యలకు ఆధునిక సమాజంలో ఆమోదాంశమూ పెరిగింది. ఈ మార్పుల్ని చూడడానికి 'ధర్మదేవత'కు నిజంగానే కళ్లు లేవు. మనతరం దురదృష్టం ఏమంటే సమాజం ఉదారంగా మారాల్సిన సమయంలో, మారుతున్న సమయంలో, న్యాయస్థానాలు ఛాందసంగా మారుతున్నాయి.

గతంలో అనేకమంది అనేకసార్లు, అనేకవిధాల వివరించిన అంశాలే అయినప్పటికీ, మళ్లీ మళ్లీ ముందుకు వస్తున్న పాత సాకులకు కొత్త వివరణలు ఇవ్వక తప్పడం లేదు.

మత ప్రాతిపదికన రిజర్వేషన్‌లు చెల్లవన్న మాట వినంగానే మధ్యతరగతి వర్గాలకు నిజమే అనిపిస్తుంది. చాలా మంది సమయానుకూలంగా మరిచిపోతున్న వాస్తవం ఏమంటే, భారతదేశంలో రాజ్యాంగం ద్వారా రిజర్వేషన్‌ల ప్రక్రియ మత ప్రాతిపదికనే ఆరంభమైంది. 1950లో రాష్ట్రపతి ఉత్తర్వుల ద్వారా 'హిందూ' దళితులకు ఎస్.సి. హోదా కల్పించారు. రిజర్వేషన్‌ల తొలి అడుగే హిందూ మత ప్రాతిపదికన ఆరంభమైందని కొత్తగా చెప్పాల్సిన పనిలేదు. ఆ తరువాత సిక్కు దళితులకు, బౌద్ధ దళితులకు ఎస్.సి. హోదా కల్పించారు. అంచేత, మలి అడుగు, ఆ తరువాతి అడుగులు కూడా మత ప్రాతిపదికనే సాగాయి. క్రైస్తవ దళితులకు, ముస్లిం దళితులకు జరిగిన అన్యాయాన్ని సవరించడానికి ఇప్పటికీ అడ్డంకులు తొలగలేదు.

ఆ తరువాత రాజకీయ పోరాటాల ఫలితంగా 1951లో భారత రాజ్యాంగానికి తొలి సవరణగా, వెనుకబడిన తరగతులకు వచ్చిన రిజర్వేషన్‌లు కూడా క్రమంగా మత ప్రాతిపదికన మారిపోయాయి. ఈ ప్రయోజనాలు ఆచరణలో హిందూ వెనుకబడిన కులాల స్వంత ఆస్తిగా మారిపోయాయి. 'కులం' అనేది మత ప్రత్యయం అనీ, 'తరగతి' అనేది రాజ్యాంగ ప్రత్యయం అని ఇప్పుడు అందరూ మరిచిపోయినట్టు ప్రవర్తిస్తున్నారు. కొందరైతే ఒక అడుగు ముందుకేసి 'వెనుకబడిన తరగతులంటే' హిందూ వెనుకబడిన కులాలే అని గడుసుగా వాదిస్తున్నారు. వాస్తవాలు ఇలా ఉండగా మత ప్రాతిపదికన రిజర్వేషన్‌లు చెల్లవని ఉన్నత న్యాయస్థానాలు పేర్కొనడాన్ని ముస్లింలు ఎలా అర్థం చేసుకోవాలి?

అంతకన్నా ప్రాణప్రదమైన సైద్ధాంతిక సందేహం ఒకటుంది. ఒక సామాజిక వర్గానికి మత ప్రాతిపదికపై రిజర్వేషన్‌లు కల్పించ రాదనడం మతాతీత లౌకిక ప్రమాణమే అయితే, ఒక సామాజిక వర్గానికి మత ప్రాతిపదికపై రిజర్వేషన్‌లు నిరాకరించడం కూడా మతాతీత లౌకిక ప్రమాణాలకు వ్యతిరేకమే అవుతుంది. నిజానికి ఇప్పుడు రిజర్వేషన్‌లను కోరుతున్నది భారత ముస్లింలు ఆచరిస్తున్న ఇస్లాంకు కాదు. సామాజిక, ఆర్థిక, విద్యా, ఉపాధి రంగాల్లో భారత ముస్లింలు అనుభవిస్తున్న పేదరికానికి. ఈపాటి ధర్మసూక్ష్మాన్ని హైకోర్టు ధర్మాసనం పరికించలేదు.

ముస్లింలకు రిజర్వేషన్‌లు కల్పిస్తే మతమార్పిడులు పెరిగి పోతాయనే అపోహల్ని సంఘ్ పరివారం చాలా కాలంగా పనిగట్టుకుని ప్రచారం చేస్తోంది. ఇప్పుడు ఈ వాదనకు న్యాయస్థానాలు వత్తాసు పలకడమే సరికొత్త విషాదం. ధార్మికంగా ఇస్లాం ఒక బహిరంగ మతం. విశ్వాసుల కోసం ఇస్లాం ద్వారాలు తెరిచి ఉంచుతుంది. విశ్వాసం ఉన్నవాళ్లు ముస్లిం సమాజంలోనికి రావచ్చు. విశ్వాసం లేనివాళ్లు ముస్లిం సమాజాన్ని వదిలి పోవచ్చు. మనుషులు రావడానికీ, పోవడానికీ ముస్లిం సమాజంలో అవకాశం ఎప్పుడూ ఉంటుంది. అయితే, ఇక్కడ వివాదం ధార్మిక పరమైనది కాదు, లౌకికపరమైనది. రిజర్వేషన్‌లు అనుభవించడం

కోసం ఇస్లాంను స్వీకరించేవారు ఎవరూ... అనే ఒక చిన్నప్రశ్న చాలు సంఘ్ పరివారం ప్రచారం చేస్తున్న అపోహలు పూర్తిగా నిరాధారమని చెప్పడానికి.

హిందూ దళితులకు రాజ్యాంగం ఎస్.సి. హోదా ఇచ్చింది. వాళ్లు ఇస్లాంను స్వీకరిస్తే రిజర్వేషన్ హోదా తగ్గుతుంది గానీ పెరగదు. ఎస్.సి. సౌకర్యాలు పొందుతున్న వాళ్లు బి.సి.–ఇ సౌకర్యాలకు పరిమితం అవ్వాల్సి ఉంటుంది. హిందూ వెనుకబడిన కులాలు ఇస్లాంను స్వీకరించినా వాళ్లకూ అదనంగా వచ్చే ప్రయోజనం ఏమీలేదు; హోదా తగ్గడం తప్ప. బిసి–ఎ బి సి డి ల్లో ఉన్న వాళ్లు బిసి–ఇ జాబితాలో చేరాల్సి ఉంటుంది.

మత మార్పిడికి ఎస్.సి.లు, ఎస్.టి.ల తరువాత ఇక మిగిలింది హిందూ పెత్తందారీ కులాలు. భారత ముస్లిం సమాజపు అంతస్తుల దొంతరలో పైభాగాన ఉన్న సయ్యద్, సయీద్, ముషాయిక్, మొఘల్, పఠాన్, ఇరానీ, అరబ్, బోహ్రా, షియా, ఇమామీ, ఇస్మాయిలీ, ఖోజా, కచ్చి–మేమో, జమాయత్, నవాయత్ తదితరులకే ఆంధ్రప్రదేశ్ ముస్లిం రిజర్వేషన్ చట్టం – 2007 వర్తించదు. ఇక కొత్తగా చేరిన హిందూ పెత్తందారీ కులాలకు ఆంధ్రప్రదేశ్ ముస్లిం రిజర్వేషన్ చట్టం – 2007 ఎలా వర్తిస్తుంది? అంచేత, హిందూ పెత్తందారీ కులాలు వేరే కారణాలతో మత మార్పిడికి పాల్పడవచ్చేమోగానీ రిజర్వేషన్ కోసం మతమార్పిడికి పాల్పడే అవకాశం లేదు. రేపు ఓ కమ్మ కులస్తుడో, రెడ్డి కులస్తుడో మెడిసిన్ సీట్ కోసమో, ఇంజనీరింగ్ సీటు కోసమో ఇస్లాంను స్వీకరించి, తాను గారడీ సాయిబుననో, తురక బుడముక్కిననో, ముస్లిం గోసంగిననో ప్రకటించుకుంటే పరిస్థితి ఏమిటీ? అని కొందరు ప్రశ్నించవచ్చు. అలాంటి వాళ్లు నూటికి ఒక్కరు కాదు, కోటికి ఒక్కరైనా ఉంటారా అన్నది అంతకన్నా సహేతుకమైన ప్రశ్న.

ఎవరైనా ఇష్టపడి హిందూమతాన్ని కూడా స్వీకరించవచ్చు. హిందూ సాంప్రదాయాల్నీ, కర్మకాండనూ కూడా పాటించవచ్చు. కానీ, అలా మతం మారినవాళ్లు ఉద్యోగం కోసమో, వృత్తివిద్యా కోర్సులో సీటు కోసమో తాను కోయ, గోండు అని గానీ, మాల, మాదిగ అని గానీ, కుర్మ, మంగలి అని గానీ అధికారికంగా ప్రకటించుకోవడం సాధ్యమా? ఇంత చిన్న ధార్మిక సూత్రాన్ని న్యాయస్థానాలు ఎలా విస్మరించాయో అర్థం కాదు. పదేళ్ల క్రితం ఓ రాజకీయ నాయకుడు తాను ఎస్.టి. అని చెప్పుకుని ఎస్.టి. రిజర్వ్‌డ్ నియోజకవర్గం నుండి లోక్‌సభకు ఎన్నికయ్యాడు. ఐదేళ్ల పదవీ కాలం ముగిసిన తరువాత అతను అసలు ఎస్.టి. కాదని కోర్టులు తీర్పు చెప్పాయి. కానీ, చట్టాన్ని దుర్వినియోగం చేసే అవకాశం ఉన్న కారణంగా మొత్తం ఎస్.టి. రిజర్వేషన్ చట్టాన్నే కొట్టివేయాలని తీర్పు ఇవ్వలేదు. చట్టాల్ని అమలు చేయడానికీ, దుర్వినియోగాన్ని నిరోధించడానికీ, దోషుల్ని శిక్షించడానికీ వేరే ప్రభుత్వ శాఖలు ఎలాగూ ఉన్నాయి.

ప్రతి చట్టంలోనూ కొన్ని లోపాలుంటాయి. దుర్వినియోగానికి ఎలాంటి అవకాశం లేని చట్టం ఇంతవరకు ఈ భూమ్మీద పుట్టనేలేదంటే అతిశయోక్తి కాదు. ఇతర చట్టాలతో పోలిస్తే ఆంధ్రప్రదేశ్ ముస్లిం రిజర్వేషన్ చట్టం – 2007లో దుర్వినియోగానికి అవకాశాలు చాలా తక్కువ. ఒక చట్టాన్ని చేసే సమయంలో దాన్ని తీసుకురావాల్సిన సామాజిక అవసరాల పరిష్కారానికే అత్యంత ప్రాధాన్యతనివ్వాలి. చట్టం దుర్వినియోగం అయ్యే అవకాశాలను కనిపెట్టి, వాటి నివారణకు కొన్ని పరిమితులు, షరతులు పెట్టే అవకాశం ఎలాగూ ఉంటుంది. అంతే తప్ప, దుర్వినియోగం అవుతుందనే ఆందోళనతో న్యాయస్థానాలు చట్టాలను కొట్టివేయడం మొదలుపెడితే, ఆంధ్రప్రదేశ్ ముస్లిం రిజర్వేషన్ చట్టం – 2007కు పూర్వం వచ్చిన వేల వేల చట్టాలను, దానికన్నా ముందు కొట్టివేయాల్సి ఉంటుంది. న్యాయస్థానాలు న్యాయాన్ని నిజంగానే అంత కచ్చితంగా పాటించాలనుకుంటున్నాయా?

అన్నింటి కన్నా ప్రాథమిక ప్రశ్న ఒకటుంది. హిందూత్వమే ఏకైక ఎజెండాగా ఉన్న సంఘ్ పరివార్ శక్తులకు మతమార్పిడుల అంశం రాజకీయ మేత లాంటిది. భారతదేశంలో హిందూయేతరుల జనాభా ప్రమాదకరంగా పెరిగిపోతున్నదనే అపోహల్ని ప్రచారం చేసి, హిందూ ఓటు బ్యాంక్‌ను కొల్లగొట్టి, అధికారాన్ని చేపట్టడానికి ప్రయత్నించడం సంఘ్ పరివార్ శక్తుల ప్రధాన కార్యకలాపం. కానీ, రాజ్యాంగాన్ని అమలుపర్చాల్సిన న్యాయస్థానాలు సహితం మతమార్పిడుల్ని అభ్యంతరకర వ్యవహారంగా పేర్కొనడం సరికొత్త పరిణామం. రాజ్యాంగంలోని 19వ అధికరణ భారత పౌరులకు మతస్వేచ్ఛను ప్రసాదించిందని ధర్మాసనం మర్చిపోయినట్టుంది. భారత రాజ్యాంగాన్ని క్రమక్రమంగా ఓడిస్తున్నదెవరూ?

ముస్లిం సమాజంలో కులాలను నిర్వచించడం అంత తేలికైన వ్యవహారం కాదు. మనుషుల్ని అసమానులుగా తానే సృష్టించానని స్వయంగా దేవుడే చెప్పాడనే మతాలు కొన్నున్నాయి. దేవుని ముందు మనుషులందరూ సమానులనే మతాలూ ఉన్నాయి. దేవుని ముందే కాదు, సమాజంలోని ప్రతి వ్యక్తీ, మరో వ్యక్తి ముందు సమానుడేనని ఇస్లాం అంటుంది. ఈ సమానత్వ సూత్రమే ముస్లిం సమాజంలో సౌభ్రాతృత్వానికి పునాది.

ప్రతి మతానికీ ఆధ్యాత్మిక సిద్ధాంతం (డాక్టరిన్), కర్మకాండ, ఆచార వ్యవహారాలు (రిచువల్స్) ఉంటాయి. ముస్లిం సమాజం దీనికి మినహాయింపు కాదు. ఆధ్యాత్మికంగా ఇస్లాం కుల వ్యవస్థకు వ్యతిరేకం అయినప్పటికీ, భారతీయ ముస్లిం సమాజం ఏకశిలా సదృశ్యమేమీ కాదు. హిందూ మతంలోని అంతర్గత అణచివేత కారణంగా భారత ఉపఖండంలోని ఆదివాసులు, పంచములు, శూద్రులు పెద్ద ఎత్తున ఇస్లాంను స్వీకరించారు. ఇందులో తరతమ బేధాలున్నాయి. కొందరు ఇస్లాంను సంపూర్ణంగా స్వీకరించగా, మరికొందరు సగమే స్వీకరించారు. ఇంకొందరు పాక్షికంగా ఇస్లాంను స్వీకరించారు. ఒక్క మాటలో చెప్పాలంటే, భారతీయ ముస్లిం సమాజం దాదాపు హిందూ సమాజానికి నకలుగా తయారైంది. ఆ మేరకు భారతీయ ముస్లిం సమాజంలో ప్రధానంగా మూడు అంతస్తులు ఏర్పడ్డాయి. అవే, అర్జాల్, అజ్లాఫ్, అష్రాఫ్. భారత రాజ్యాంగాన్ని అక్షరబద్ధంగా గాక స్ఫూర్తి బద్ధంగా అర్థం చేసుకుంటే అర్జాల్ వర్గానికి ఎస్.టి. గానూ, అజ్లాఫ వర్గానికి ఎస్.సి.లుగానూ రిజర్వేషన్ సౌకర్యం కల్పించాలి. అందుకు వాళ్లు అన్ని విధాలా అర్హులు. నిజానికి వాళ్లు ఆయా వర్గాల నుండి ఇస్లాంను స్వీకరించడమే కాదు, ఇప్పటికీ ఆయా వర్గాలతోనే సన్నిహితంగా ఉంటున్నారు. (ఇక్కడ పాఠకులు ఒకందుకు ఈ వ్యాసకర్తను క్షమించాలి. అష్రాఫ్ వర్గానికి చెందిన ఈ వ్యాసకర్తకు, ఈ పేర్లను అర్జాల్, అజ్లాఫ వర్గాలు ఆమోదిస్తున్నాయో లేదో తెలియదు).

భారతీయ ముస్లిం సమాజానికి హిందూ సమాజంతో ఇన్నిరకాల పోలికలున్నప్పటికీ, కొన్ని ప్రత్యేకతలు కూడా ఉన్నాయి. భారత ముస్లిం సమాజంలో కొనసాగుతున్న మూడు అంతస్తుల మధ్య కంచంపొత్తు ఉన్నప్పటికీ, మంచంపొత్తు అనేది ఇప్పటికీ అరుదైన వ్యవహారమే. ఆ మేరకు అది హిందూ సమాజ లక్షణమే. అయితే అష్రాఫ్ కులాల మధ్య, అర్జాల్ కులాల మధ్య, అజ్లాఫ్ కులాల మధ్య కంచం పొత్తుతో పాటు మంచం పొత్తు కూడా ఉంది. ఆ మేరకు అది హిందూ సమాజం కన్నా పూర్తిగా భిన్నమైనది. ఇలాంటి వైవిధ్యం కారణంగా ముస్లిం సామాజిక వర్గాలను హిందూ కులాల పద్ధతిలో నిర్వచించడం సాధ్యంకాదు. ఒక మతానికి మరే మతమూ సర్వసమానం కాదని తెలిసినప్పుడు, హిందూ మతానికి మాత్రమే ప్రత్యేకమైన కులవ్యవస్థ ఇతర మతాల్లోనూ సరిగ్గా అదే పద్ధతిలో ఉంటుందనుకోవడం, ఉండాలనడం ఏపాటి న్యాయం.

భారత రాజ్యాంగ నిర్మాతలు ఎస్.టి., ఎస్.సి.యేతరులకు రిజర్వేషన్‌లు కల్పించే సమయంలో ముందుచూపుతో తరగతులు, వర్గాలు అనే కొత్త పదాల్ని ప్రయోగించారే తప్ప 'కులాలు' అని పేర్కొనలేదు. ఎస్.సి.లో 'సి' అంటే కాస్ట్, బి.సి.లో 'సి' అంటే క్లాస్. సామాజికంగా, ఆర్థికంగా వెనుకబడిన ఏ ప్రజాసమూహానికైనా ఉద్దీపన చర్యలు తీసుకునేందుకు వీలుగానే 'క్లాస్, తరగతులు, వర్గాలు' వంటి పద ప్రయోగం జరిగిందని అర్థం చేసుకోవాలి. కులాలకూ వర్గాలకూ పోలికలుండవచ్చు, సంబంధం కూడా ఉండవచ్చు. అయినప్పటికీ ఉద్దీపనకు వర్గమే ప్రాతిపదిక కాబట్టి ఇలాంటి సందర్భాల్లో మనం నిర్వచించాల్సింది వర్గాల్నే కానీ కులాల్ని కాదు. ఈ అంశంలో ధర్మాసనం తద్విరుద్ధంగా స్పందించి, ముస్లింలకు అన్యాయం చేసింది.

హిందూ, సిక్కు తదితర ఇతర మతాలకు చెందిన 112 కులాల దరఖాస్తులు బి.సి. గుర్తింపు కోసం ఎదురు చూస్తుండగా ప్రభుత్వం ముస్లింల సమస్యనే ప్రస్తుతానికి అత్యవసరంగా భావించిందని ఈ కేసులో పిటీషనర్లు పేర్కొన్నారు. కేసును కొట్టివేయడానికి ఆ అంశాన్ని కూడా ధర్మాసనం ప్రధానంగా పేర్కొంది. పిటిషనర్ల వాదన రెండు వాస్తవాలను దురుద్దేశ్య పూర్వకంగా దాచింది. మొదటిది, ముస్లింలను బిసి జాబితాలో చేర్చాలనే ప్రయత్నాలు 1970వ దశకంలోనే ఆరంభమయ్యాయి. రెండవది, ఆంధ్రప్రదేశ్ బిసి జాబితాలో ప్రస్తుతం ఉన్న 94 కులాల్లో నాలుగు తప్ప మిగిలినవన్నీ హిందూ కులాలే. రాష్ట్ర ఒబిసి జాబితాలో బిసి–ఎ లో ఒక అర్జాల్ తరగతికి, బిసి–బి లో రెండు అజ్లాఫ్ తరగతులకు నాలుగు దశాబ్దాలుగా రిజర్వేషన్ సౌకర్యం ఉంది. అయితే ఒబిసి జాబితాలో చేరని అర్జాల్, అజ్లాఫ్ కులాలు ఆంధ్రప్రదేశ్‌లో మూడు డజన్లకు పైగానే ఉన్నాయి. వీళ్లకు రిజర్వేషన్ ఇవ్వాలనే డిమాండ్ నలభై ఏళ్లుగా పెండింగ్‌లో ఉందన్న విషయాన్ని న్యాయస్థానం పట్టించుకోలేదు. అన్యాయం జరిగింది, జరుగుతున్నది ముస్లింలకు అయితే, హిందువులకు అన్యాయం జరుగుతున్నట్టు కొన్ని హిందూ వెనుకబడిన కులాల సంఘాలు సాగించిన దుష్ప్రచారంలో ధర్మాసనం కొట్టుకుపోయింది.

ముస్లింలు అనగానే సామాన్యులకు పాతవాళ్లలో నిజాం నవాబో, కొత్త తరాల్లో బాబు ఖాన్ లాంటి వాళ్లో గుర్తుకు వస్తారు. వాళ్లకు రిజర్వేషన్ ఏమిటీ? అనే సందేహమూ కలుగుతుంది. ఆంధ్రప్రదేశ్ ముస్లిం రిజర్వేషన్ చట్టం – 2007 వల్ల భారత ముస్లిం వర్గాలలో ఎవరికి రిజర్వేషన్ దక్కే అవకాశం ఉంటుందో చాలా మందికి అపోహలు తప్ప, వాస్తవాలు తెలియవు. ఆ జాబితా ఇది –

అచ్చుకట్లవాళ్లు, సింగాలీ, సింగంవాళ్లు, అచ్చుపనివాళ్లు, అచ్చుకట్టువాళ్లు, అచ్చుకట్లలవాళ్లు, అత్తరు సాయిబులు, అత్తరోళ్లు, ధోవి ముస్లిం, ముస్లిం ధోబి, ధోబీ ముసల్మాన్, తుర్క చాకల, తుర్క చాకలి, తురుక చాకలి, తులుక్క వన్నన్, త్సాకలస్, సాకలాస్, చాకలాస్, ముస్లిం రజక, ఫకీర్లు, ఫఖీరు, బుడబుక్కల, ఘంట ఫకీర్లు, ఘంట ఫఖీర్లు, తురక బుడబుడ్కి, దర్వేష్, గారడీ ముస్లిం, గారడి సాయిబులు, పాముల వాళ్లు, కనికట్లువాళ్లు, గారడోళ్లు, గారడిగా, గోసంగీ ముస్లిం (కాటికాపరులు), ఫకీర్ సాయిబులు, గుడ్డి ఎలుగువాళ్లు, ఎలుగుబంట్ల వాళ్లు, ముసల్మాన్ కీలుగుర్రాల వాళ్లు, హజాంలు, నాయి, నాయి ముస్లిం, నవీద్, లబ్బీ, లబ్బే, లబ్బో, లబ్బా, బోరేవాలే, బొంతల, ఖురేషీ, కురేషి, కసాబ్, ముస్లిం కటిక, ఖటిక్బ ముస్లిం, సిద్ది, యాబ, హబ్షీ, జసి, తురక కాశ, కక్కుకొట్టే జింక సాయిబులు, చక్కిట కానేవాలే, తిరుగాడు గొంతలవాళ్లు, తిరుగాటిగాంట్ల, రోడ్లకు కక్కు కొట్టేవాళ్లు, ఫత్తర్ ఫోడూలు, చక్కెటకారే తురక, షేకులు, శేఖ్, శేక్ వర్గాలు.

సామాజిక నేపథ్యం కారణంగా, న్యాయంగా ఎస్.టి., ఎస్.సి. జాబితాలో చేర్చాల్సిన ఈ వర్గాల్ని బిసి–ఇ జాబితాలో చేర్చినా అడ్డుకోవడం మానవత్వం అనిపించుకోదు. న్యాయస్థానాలు ఇప్పుడు సరిగ్గా ఈ పనే చేస్తున్నాయి.

ఈ సందర్భంగా ఒక విషయాన్ని గుర్తు చేసుకోవాలి. ఒబిసిలకు కేటాయించిన 27 శాతం రిజర్వేషన్‌లో 8.5 శాతం ముస్లిం ఒబిసి ల కోసం ప్రత్యేకంగా కేటాయిస్తూ ప్రభుత్వాలు ఉత్తర్వులు జారీ చేయాలని, గతంలో బిపి మండల్ కమిషన్ పేర్కొంది. మండల్ కమిషన్ సిఫార్సును అమలు చేయడానికి ప్రభుత్వాలు జంకాయి. హిందూ ఒబిసిలు అనుభవిస్తున్న 27 శాతానికి బయట, ముస్లిం ఒబిసిలకు విడిగా 4 శాతం రిజర్వేషన్‌లు కల్పించి చేతులు దులుపుకున్నాయి.

సాధారణంగా పిచ్చుకను ఎత్తుక పోతున్నప్పుడు గద్ద మౌనంగా ఉంటుంది. పిచ్చుక ప్రాణ భయంతో అరుస్తుంటుంది. ముస్లిం కేసులో పిచ్చుకలు మౌనంగా ఉండిపోయాయి. గద్దలు అరిచాయి. ఎందుకంటే, చచ్చేటప్పుడూ గొంతు పెగలని దీనత్వం ముస్లిం పిచ్చుకలది. ధర్మాసనానికి గద్దల అరుపులే వినిపించాయి.

బి.సి. కమిషన్ నిర్వహించిన సర్వే అసమగ్రంగా ఉందనేది ధర్మాసనం చేసిన మరో ఆక్షేపణ. మానవ విజ్ఞాన శాస్త్ర వివరణ కోసం ఆంత్రోపాలజీ సర్వే ఆఫ్ ఇండియా సేకరించిన సమాచారాన్ని ముస్లిం రిజర్వేషన్‌ల కోసం వాడారంటూ అది తప్పుపట్టింది. ఇతర సంస్థలు ఒక ప్రయోజనం కోసం సేకరించిన సమాచారాన్ని ఇతర ప్రయోజనాల కోసం వాడడం పట్ల అభ్యంతరం చెప్పింది. ఈ ఆక్షేపణలు చాలా మందికి సమంజసంగానే కనిపించవచ్చు. ఇక్కడ అంతకన్నా కీలక ప్రశ్న ఒకటుంది. లోపాలు లేని సర్వేల గురించి ఇటీవలి కాలంలో ఎవరైనా ఎక్కడైనా విన్నారా?

రేషన్ కార్డుల పంపిణీలో పెద్ద ఎత్తున అవకతవకలు జరిగాయనీ, జనాభా కన్నా రేషన్ కార్డులు ఎక్కువగా ఉన్నాయని స్వయాన ముఖ్యమంత్రి కె. రోశయ్య, పౌరసరఫరాల శాఖ మంత్రి జూపల్లి

కృష్ణారావు అంటున్నారు. రేషన్ కార్డుల లబ్ధిదారుల్ని గుర్తించడంలో శాస్త్రీయత లోపించిందంటూ మొత్తం రేషన్‌కార్డుల్ని రద్దు చేస్తారా? ఓటర్ల జాబితాలు తయారు చేయడంలో అవధుల్లేని అవకతవకలు జరిగిన సందర్భాలు అనేకం వెలుగులోనికి వస్తుంటాయి. సామాన్యుల ఓట్లేకాక అత్యంత ప్రముఖుల ఓట్లు సహితం గల్లంతు కావడం సాధారణ విషయం అయిపోయింది. ఓటర్ల జాబితాలో శాస్త్రీయత లోపించిందంటూ మొత్తం ఎన్నికలని రద్దు చేస్తూ తీర్పునివ్వడం సాధ్యమేనా? ఐరిస్ కార్డుల యుగంలోనూ జనాభా గణాంక వివరాలను కచ్చితంగా సేకరించగలమని ఎవరైనా చెప్పగలరా? ఇతర అనేకానేక అంశాల్లో శాస్త్రీయత గుర్తుకు రాని న్యాయస్థానాలకు ఇలా ముస్లింల విషయంలోనే శాస్త్రీయత గుర్తుకు రావడాన్ని ఎలా అర్థం చేసుకోవాలి?

రాజకీయ ప్రయోజనాల కోసం ముస్లింలకు రిజర్వేషన్‌లు కల్పించారని ధర్మాసనం నిందార్థంలో పేర్కొంది. నిజానికి రిజర్వేషన్‌లు అనే భావం పుట్టిందే రాజకీయ ప్రయోజనాల కోసం. ఈ వివరాల కోసం మనం మరీ గాంధీ – అంబేద్కర్ పూనా ఒప్పందం వరకు వెళ్లాల్సిన పనిలేదు. దేశ సమగ్రత అంటేనే రాజకీయం. భారత రాజ్యాంగానికి మొట్టమొదటి సవరణ కూడా రాజకీయ ప్రయోజనాల కోసం చేసిందే. రాజకీయ ఉద్యమాల ఫలితంగానే, వెనుకబడిన తరగతుల సంక్షేమం కోసం 1951లో భారత రాజ్యాంగానికి తొలి సవరణ చేపట్టారు. అనుమానం ఉన్న వాళ్లు అరవై ఏళ్లు వెనక్కి వెళ్లాల్సి ఉంటుంది. ఆ తరువాత ఇప్పటి వరకు చేపట్టిన ప్రతి రాజ్యాంగ సవరణ, ప్రతి చట్టం, ప్రతి ప్రభుత్వ ఉత్తర్వు, ప్రతి ఆర్డినెన్స్ సమస్తం ఏదో ఒక రాజకీయ ప్రయోజనాల కోసం చేసినవే.

నిజానికి పార్టీ ఆధారిత పార్లమెంటరీ ప్రజాస్వామ్యంలో, రాజకీయ ప్రయోజనాలను సాధించడమే ప్రాణప్రదమైన అంశం. పార్లమెంటరీ ప్రజాస్వామ్యంలో ఇటు ప్రజలకు, అటు రాజకీయ పార్టీలకు రెండు నిర్దిష్ట రాజకీయ కార్యకలాపాలుంటాయి. ఓటర్ల ద్వారా ప్రజల మద్దతు పొంది, అధికారాన్ని చేపట్టి, ప్రజలకిచ్చిన హామీలను నెరవేర్చడం రాజకీయ పార్టీల కార్యకలాపమైతే, తమ సమస్యల పరిష్కారానికి ఓట్ల మాధ్యమాన్ని ఉపయోగించడం ప్రజల కార్యకలాపం. ఈ విషయాలు న్యాయమూర్తులకు తెలియక కాదు. రాజకీయ నాయకుల పట్ల మధ్యతరగతి వర్గాల్లో సాధారణంగా ఉండే నిస్సహాయపు ఏవగింపును చవకబారు పద్ధతుల్లో రెచ్చగొట్టే ప్రయత్నం చేసింది ధర్మాసనం.

ఆంధ్రప్రదేశ్ ఉన్నత న్యాయస్థానం ముస్లిం రిజర్వేషన్ చట్టం – 2007 ను కొట్టేస్తూ తీర్పునిచ్చిన పది రోజుల తరువాత భారతీయ జనతా పార్టీ జాతీయ మండలి సమావేశాలు ఇండోర్ సమీపాన జరిగాయి. బిజెపి శ్రేణులు తమ ప్రాణాల్ని పణంగా పెట్టైనా సరే ముస్లిం రిజర్వేషన్‌లను అడ్డుకోవాలని ఇండోర్ సమావేశం పిలుపునిచ్చింది.

ముస్లిం రిజర్వేషన్‌లను అడ్డుకోవాల్సిన అవసరాన్ని వివరిస్తూ బిజెపి చెప్పిన కారణాలు పాతవే అయినా ఈసారి కొంచెం కొత్త ఆసక్తిని కలిగించాయి. మత ప్రాతిపదికన రిజర్వేషన్‌లను ఇస్తే అది మత మార్పిడుల్ని ప్రోత్సహించినట్టు అవుతుంది అనే హెచ్చరికతో సహా, ఎపి హైకోర్టు పేర్కొన్న కారణాలనే యథాతథంగా బిజెపి నాయకులు పేర్కోవడం విశేషం. ముస్లింలకు తాము రిజర్వేషన్‌లు ఇచ్చేందుకు సిద్ధంగా ఉన్నా, న్యాయస్థానాలు మోకాలడ్డుతున్నాయనే భావనను ప్రజలకు కల్పిస్తోందంటూ బిజెపి నాయకులు, యుపిఎ సర్కార్‌ను దుయ్యబట్టారు. బిజెపి ఇండోర్ జాతీయ మండలి సమావేశ తీర్మానాలను గమనిస్తే, న్యాయస్థానాల్ని చూసి సంఘ్‌పరివార్ శక్తులు ఉత్తేజాన్ని పొందుతున్నాయా? లేక, సంఘ్‌పరివారాన్ని చూసి న్యాయస్థానాలు ఉత్తేజాన్ని పొందుతున్నాయా? అనే అనుమానాలు వస్తాయి.

బిజెపి నాయకులు తమ సహజ ధోరణిలో మరో అడుగు ముందుకేసి, ముస్లిం రిజర్వేషన్‌లు అమలైతే దేశ విభజన ఖాయం అని హెచ్చరించారు. ఇదో చిత్రమైన వాదన. తమకు రిజర్వేషన్‌లు కల్పించకపోతే తాము భారతదేశంలో అంతర్భాగంగా ఉండాల్సిన పనిలేదని గతంలో ద్రావిడ నాయకులు హెచ్చరించడం మనకు తెలుసు. ప్రాంతాల మధ్య, సామాజికవర్గాల మధ్య అసమాన అభివృద్ధి కొనసాగుతున్నప్పుడు ఏ దేశమైనా, ఆ మాటకొస్తే ఏ రాష్ట్రమైనా, సమగ్రతను సంతరించుకోవడం సాధ్యంకాదు. దేశసమగ్రతను సాధించడానికి బాధిత ప్రాంతాలకూ, బాధిత సామాజిక వర్గాలకూ రాయితీలు ఇవ్వడం అనివార్యం. వెనుకబడిన వర్గాల్ని ఉద్దీపన పథకాలతో అభివృద్ధి చేస్తే, సమాజంలో శాంతి సామరస్యాలు వెల్లివిరుస్తాయి. విభిన్న ప్రజాసమూహాల మధ్య సంఘీభావం ఏర్పడి దేశ సమగ్రత, సమైక్యత బలపడతాయి. దేశసమగ్రత, సమైక్యతలకు ముప్పు వచ్చేది అలాంటి ఉద్దీపన చర్యల్ని వ్యతిరేకించినప్పుడే. అందరికీ తెలిసిన సత్యాన్ని తలకిందులు చేసి, దాన్ని భావోద్వేగ అంశంగా మార్చి, రాజకీయంగా లబ్ధిపొందడానికి ప్రయత్నించడం సంఘ్ పరివారానికి పుట్టుకతో అబ్బిన విద్య.

మనం మరిచిపోతున్న విషయం ఏమంటే, తమ సమస్యల పరిష్కారం కోసం ప్రజలు అనేక మార్గాల్ని ఎంచుకుంటారు. పార్లమెంటరీ ప్రజాస్వామ్యం వాటిల్లో ఒకటి మాత్రమే. అహింసామార్గం విఫలమైనపుడు హింసామార్గం, శాంతియుత పోరాటాలు విఫలమైనపుడు సాయుధ పోరాటాలు, న్యాయస్థానాలు విఫలమయినపుడు ప్రజా న్యాయస్థానాలు ప్రత్యామ్నాయంగా ఎలాగూ ఉంటాయి.

ప్రభుత్వాలు రాజ్యాంగబద్ధంగా పరిపాలనను సాగించేటట్టు పర్యవేక్షించే అత్యున్నత బాధ్యతను న్యాయస్థానాలకు అప్పగించారు మన ప్రజాస్వామిక వ్యవస్థ రూపశిల్పులు. న్యాయమూర్తుల బాధ్యత; రాజ్యాంగానికి అక్షర బద్ధంగా వ్యాఖ్యానాలు చేస్తే సరిపోదు. ఇది తాత్కాలిక కర్తవ్యం మాత్రమే. నిజానికి ఆ మాత్రం పనికి మనుషులు అక్కరలేదు, యంత్రాలు కూడా చేస్తాయి. న్యాయంగానైతే విభిన్న ప్రజా సమూహాలు, సామాజిక వర్గాలకూ విద్యా, ఉపాధి రంగాల్లో జరుగుతున్న అన్యాయాన్ని సరిదిద్దడానికి ఎన్ని రకాల అవకాశాలున్నాయని న్యాయ నిపుణులు ఆలోచించాలి. ఆంధ్రప్రదేశ్ ముస్లిం రిజర్వేషన్ చట్టం–2007 కేసులో అందుకు విరుద్ధంగా జరిగింది. ముస్లిం సమాజంలోని వెనుకబడిన వర్గాలకు ఎన్ని విధాలుగా రిజర్వేషన్‌లను నిరాకరించవచ్చు అని ధర్మాసనం భారీ కసరత్తు చేసింది. ఇదీ అసలు విషాదం.

న్యాయం చేయడంలో ఆలస్యం, న్యాయాన్ని నిరాకరించడం రెండూ ఒక్కటే అనేది న్యాయశాస్త్రంలో ప్రాథమిక సూత్రం. స్వతంత్ర భారతదేశంలో న్యాయం కోసం ముస్లిం వర్గాలు 63 సంవత్సరాలుగా

*రైతాంగ సాయుధ పోరాటంతో సహా అనేక పోరాటాలకూ, ఉద్యమాలకూ, ధిక్కారాలకూ చిరునామా అయిన తెలంగాణ నేలపై ప్రత్యేక రాష్ట్రం కోసం విద్యార్థుల ఆత్మబలిదానాలను ఆపడానికి అందరూ నడుం బిగించాలంటున్నారు* **బి. రామకృష్ణ**

# ఉద్యమంలో ఆత్మహత్యలు - భిన్న పార్శ్వాలు

మలి దశ తెలంగాణ ఉద్యమ ఉద్ధృతి గ్రామ గ్రామానికి చేరింది. పల్లె పల్లెను తాకుతూ, చిన్నా, పెద్దా తేడా లేకుండా కుల మతాలకతీతంగా తెలంగాణ రాష్ట్ర సాధన కొరకు ఉద్యమాలు నడుస్తున్న చారిత్రక సందర్భమిది. ఆంధ్రప్రదేశ్ ఏర్పడే నాటికి, ఏర్పడ్డ తర్వాత నుండి తెలంగాణ కాంక్ష ప్రబలంగా ఉంది. అర్ధ శతాబ్దానికి పైగా తెలంగాణ ప్రజల్లో ఈ ఆకాంక్ష సజీవంగా ఉంటూ వస్తోంది. 1953లో (ఫజల్ అలీ కమిషన్ నియమించబడినప్పటి నుండి) 1956లో, 1969లో, 1990లలో, 2001లో, టిఆర్ఎస్ ఏర్పడ్డాక, 29 నవంబర్ 2009 నుండి నేటివరకు అనేక దశల్లో తెలంగాణాకాంక్ష వ్యక్తమవుతూనే ఉంది.

1969లో సంవత్సర కాలం పాటు ఉవ్వెత్తున తెలంగాణ ఉద్యమం ఎగిసింది. పోలీసుల తూటాలకు నాలుగేండ్ల పసి పిల్లల నుండి నడి ఈడు వరకు 369 మంది బలైనారని చరిత్ర తెలిపిన సత్యం. పోలీసుల విచక్షణారహిత కాల్పులు వీరందరినీ చంపేశాయి. ఈ దారుణం పై నాటి ప్రభుత్వం విచారణ జరిపించింది లేదు. నాటి అసెంబ్లీలో పశ్చాత్తాపం ప్రకటించిన దాఖలాలు లేవు. ఈ త్యాగాల చాళ్లపై నడుస్తూ తెలంగాణ తెస్తామని ఎన్నికల్లో గెలిచిన తెలంగాణ ప్రజా సమితి (టిపిఎస్) ప్రలోభాలకు లొంగిపోయింది. నాటి ప్రధానమంత్రి ఇందిరా గాంధీ, ఆంధ్ర నాయకుల కుట్రలకు లోనయ్యి తెలంగాణ ఆకాంక్షను మోసగించి పదవుల పందేరానికి లొంగిపోయి చరిత్రలో టిపిఎస్ అధమ స్థాయిలో నిలిచింది.

29 నవంబర్, 2009న కెసిఆర్ ఆమరణ నిరాహార దీక్ష భగ్నం చేయబడ్డ సందర్భం నుండి ఉద్యమ దశలో మార్పు వచ్చింది. చంద్రశేఖరరావు దీక్షను విరమించాడని ప్రచారం జరిగిన వెంటనే ఉస్మానియా యునివర్సిటీ విద్యార్థులు 'కెసిఆర్ ఆపేస్తే ఆగేది కాదని, తెలంగాణ ఉద్యమం కొనసాగుతుందని' ప్రకటించారు. తద్వారా తెలంగాణ ఉద్యమానికి ఒక 'బ్రేక్‌త్రూ'ను ఇచ్చారు. ఈ సందర్భంలో ఉస్మానియా యునివర్సిటీలో శాంతియుతంగా ఊరేగింపు తీస్తున్న విద్యార్థులపై లాఠీఛార్జి జరిగింది. దీనికి నిరసనగా గత యాభై ఏళ్లుగా నలుగుతున్న తెలంగాణ ఆకాంక్ష ఉద్ధృతమైన ఉద్యమరూపం తీసుకున్నది. పల్లె పల్లెను, గుండె గుండెను తాకుతూ తెలంగాణ అంతటా వ్యాపించింది. అది పార్టీల నియంత్రణల నుండి దాటుకుంటూ వాటినే నియంత్రించే, శాసించే స్థాయికి చేరుకుంది. విద్యార్థుల పిలుపు మేరకు నడుచుకుంటామని రాజకీయ పార్టీల నాయకులు ప్రకటిస్తూ వచ్చారు.

ఒక దశలో ఈ ఉద్యమానికి దిశా నిర్దేశనం చేసేంత స్థాయికి విద్యార్థులు చేరుకున్నారు. మొత్తం మీద 9 డిసెంబర్, 2009న కేంద్ర ప్రభుత్వం తెలంగాణ ఏర్పాటుకు స్పష్టమైన ప్రకటన చేసింది. ఆంధ్ర ప్రాంత శాసన సభ్యుల, పార్లమెంట్ సభ్యుల ఒత్తిడికి తలొగ్గిన కేంద్రం తన ప్రకటన నుండి జారుకునే, నాన్చివేసే లేదా కాలయాపన చేసే 23 డిసెంబర్, 2009; 05 జనవరి, 2010 ప్రకటనలిచ్చింది. దీంతో విద్యార్థులు, యువకులు, ప్రజలు ఒక రకమైన నిరాశ, నిస్పృహలకు, అసహనానికి గురయ్యారు. మళ్లీ మోసపోయామని, నోటికాడికొచ్చిన ముద్ద ఎగురేసుకుపోబడుతుంటే ఒక్కసారిగా మానసిక ఆందోళనకు లోనయ్యారు. గత మోసాల, వంచనా చరిత్ర పునరావృతం అవుతుందేమోనని తీవ్ర మానసిక క్షోభను అనుభవించారు. ఈ నేపథ్యంలో ఈ వ్యాసం రాసే నాటికి (8 ఫిబ్రవరి, 2010) 260 మందికి పైగా తెలంగాణ రాష్ట్రం కొరకు ఆత్మహత్యలు చేసుకున్నారు.

---

ఎదురుచూపులు చూస్తున్నాయి. వాళ్లు ఇంకెన్నాళ్లు ఆగాలని మన దేశపు న్యాయస్థానాలు భావిస్తున్నాయి? హైదరాబాద్‌లో ఉగ్రవాదం ఊపిరి పోసుకోవడానికి అనేకానేక కారణాల్లో వక్ఫ్ భూములు అన్యాక్రాంతం కావడం ఒకటని ఒక సందర్భంలో సిపిఎం నేత బివి రాఘవులు గుర్తించారు. ఇప్పుడు ఆ జాబితాలో న్యాయస్థానాలు చేరకూడదని ఆశిద్దాం.

రాజ్యాంగ సమయాన్నీ, రాజ్యాంగ హృదయాన్నీ భావ బద్ధంగా వ్యాఖ్యానించి, ప్రజల్లో రాజ్యాంగం పట్ల విశ్వసనీయతను పెంచుతూ ఉండడమే న్యాయస్థానాల దీర్ఘకాలిక కర్తవ్యం. సరిగ్గా ఈ అంశాన్నే ఏడుగురు న్యాయమూర్తుల విస్తృత ధర్మాసనం విస్మరించింది. మన దేశంలో పోలీసు వ్యవస్థ తరువాత ఎక్కువ అవినీతి న్యాయవ్యవస్థలోనే ఉన్నదంటూ ట్రాన్స్‌పరెన్సీ ఇంటర్నేషనల్ వంటి అంతర్జాతీయ సంస్థలు గగ్గోలుపెడుతున్న కాలంలో, న్యాయస్థానాల విశ్వసనీయతను పెంచడం న్యాయమూర్తులకు మరింత అత్యవసర కర్తవ్యంగా మారుతుంది. ఏడుగురు సభ్యుల విస్తృత ధర్మాసనంలో ఇద్దరు న్యాయమూర్తులు మిగిలిన ఐదుగురి తీర్పుతో విభేదించడం ఒక్కటే ఈ కేసులో కొంత సానుకూల అంశం. ఇప్పటికిప్పుడే కాకపోయినా, సమీప భవిష్యత్తులోనైనా సామాజిక న్యాయస్థానాలు అవతరిస్తాయని ఆశిద్దాం. వీ

రెండు నెలల కాలంలోనే ఇన్ని ఆత్మహత్యలంటే మామూలు విషయం కాదు. ఇది సమాజం పట్టించుకోవాల్సిన, స్పందించాల్సిన తీవ్రమైన సామాజిక సమస్య. ఈ సందర్భంలో తెలంగాణ రాష్ట్ర ఏర్పాటును కాంక్షిస్తూ జరిగిన ఆత్మహత్యల నేపథ్యాలను అర్థం చేసుకునే ప్రయత్నం చేద్దాం.

2009 ఎన్నికల్లో సిపిఐ (ఎం), అటు ఇటుగా ఎంఐఎం తప్పించి అన్ని పార్టీలు తెలంగాణ రాష్ట్రానికి అనుకూలంగా విధాన నిర్ణయం తీసుకుని పాల్గొన్నాయి. 7 డిసెంబర్, 2009 వరకు ఇదే వైఖరిలో ఉంటూ అదే రోజు అఖిలపక్ష సమావేశంలో తెలంగాణ రాష్ట్ర ఏర్పాటుకు సుముఖతను ప్రకటించాయి. 9 డిసెంబర్, 2009న చిదంబరం తెలంగాణ రాష్ట్ర ఏర్పాటు గురించి విధాన ప్రకటన చేసిన 24 గంటల్లోపే పార్టీలకు అతీతంగా ఆంధ్ర, రాయలసీమ ప్రాంత శాసనసభ్యులు, పార్లమెంట్ సభ్యులు రాజీనామాలు ప్రకటన చేస్తూ తెలంగాణ ఏర్పాటుకు వ్యతిరేకంగా మాట్లాడడం మొదలుపెట్టారు. వీరు తెలంగాణ రాష్ట్ర ఆకాంక్షకు వ్యతిరేకంగా కౌంటర్ ఆందోళనలు తీవ్రతరం చేస్తున్నారు. ఇదంతా కూడా వారి వారి పార్టీలలో ఉంటూనే చేస్తున్నారు. వీరంతా తెలంగాణ రాష్ట్ర ఏర్పాటును సమర్థించిన, పార్టీ నిర్ణయాన్ని అంగీకరించి ఆంధ్ర, రాయలసీమ, తెలంగాణలలో గెలిచిన వారే.

సామాజిక తెలంగాణ అన్న ప్రజారాజ్యం పార్టీ అయితే ఏకంగా తెలంగాణకు వ్యతిరేకంగా విధానపర నిర్ణయం చేసేసింది. తెలంగాణపై సోనియాదే తుది నిర్ణయం అని, ఆమె తీసుకునే ఏ నిర్ణయానికైనా కట్టుబడి ఉంటామని చెప్పి ఎన్నికల్లో గెలిచిన వారే నేడు సమైక్యాంధ్ర అంటూ తెలంగాణకు వ్యతిరేకంగా పనిచేస్తున్నారు. స్వయాన సోనియా అంగీకారంతోనే చిదంబరం తెలంగాణ రాష్ట్ర ఏర్పాటు నిర్ణయం తీసుకున్నాక సీమాంధ్ర కాంగ్రెస్ ఎం.ఎల్.ఎ., ఎం.పి.లు, మాట మార్చి మోసపూరితంగా ప్రవర్తిస్తున్నారు.

అలాగే టిడిపి వాళ్లు కూడా వాళ్లే తీసుకున్న ఎన్నికలప్పటి తెలంగాణ అనుకూల నిర్ణయాన్ని తుంగలో తొక్కి పూర్తిగా వ్యతిరేకంగా వ్యవహరిస్తున్నారు. వీరిపై వారి వారి పార్టీల నాయకత్వాలు ఎలాంటి క్రమశిక్షణా చర్యలు తీసుకోలేదు. ఇంతగా దగా, వంచనలు చేసేందుకు సిద్ధపడ్డ ఎం.ఎల్.ఎ., ఎం.పి.లు, వారి పార్టీల నాయకత్వాలు తెలంగాణ యువకుల్లో, విద్యార్థుల్లో, ప్రజల్లో ప్రమాదకరమైన మానసిక అశాంతి చెలరేగడానికి కారకులైనారు.

29 నవంబర్, 2009న సిద్ధిపేటలో టి.ఆర్.ఎస్. నాయకుడు, ఎం.ఎల్.ఎ. హరీష్‌రావు కిరోసిన్ పోసుకుని ఆత్మాహుతి సీన్ సృష్టించడం అనేది తప్పుడు సంకేతాన్ని ఇచ్చింది. ఫలితంగా శ్రీకాంత్‌చారి అనే యువ విద్యార్థి ఎల్.బి.నగర్ (హైదరాబాద్) వద్ద వంటిని అంటించుకుని ఆత్మహత్యలకు నాంది పలికాడు. ఈ నేపథ్యంలో రాజకీయ పార్టీల పై నమ్మకం పోయి తమను తాము ఆత్మార్పణ చేసుకుంటేనైనా తెలంగాణ ప్రక్రియ వేగవంతం అవుతుందేమోనన్న తపనతో ఆత్మహత్యలకు సిద్ధపడడం జరుగుతోంది.

9 డిసెంబర్, 2009 నాటి చిదంబరం ప్రకటనతో విజయోత్సవాలలో పాల్గొన్న విద్యార్థి లోకం, తెలంగాణ ప్రజలు 23 డిసెంబర్, 2009 నాటి ప్రకటనతో కొందరు ఒక్కసారిగా మానసికంగా కుప్పకూలిన భావనకు గురైనారు. లగడపాటి రాజగోపాల్ తదితర ఆంధ్ర, రాయలసీమ ప్రాంత టి.డి.పి., పి.ఆర్.పి., కాంగ్రెస్ నాయకుల ఒత్తిడి ప్రభావంతో కేంద్ర ప్రభుత్వాన్ని తన నిర్ణయం మార్చుకునేలా, సాచివేతకు తావిచ్చేలా 23 డిసెంబర్, 2009 నాటి ప్రకటనను ఇప్పించ గలిగారు.

దీంతో తిరిగి తెలంగాణ వారికి ఉద్యమించాల్సిన అవసరం ఏర్పడింది. ఉద్యమ సెగలను రగిలించాల్సిన తరుణం వచ్చినట్లుగా అభిప్రాయపడడం జరిగింది. రాజకీయ పార్టీలు తెలంగాణపై వెనుకపట్టు పడుతున్నట్లుగా భావించిన వారు తాము మరణించి ఈ ఉద్యమాన్ని రగిలిద్దామనే ఆలోచనతో, ఈ రాజకీయ పార్టీల వల్ల తెలంగాణ ఇక రాదేమోననే ఆందోళనతో మరికొందరు ఆత్మహత్యలకు ప్రేరేపించబడుతున్నారు.

భారత రాజ్యాంగంలోని 3వ ఆర్టికల్ ప్రకారం పార్లమెంట్‌లో రాష్ట్ర ఏర్పాటుపై బిల్లు ప్రవేశపెట్టి అమలు చేయవచ్చు. దీనికి అసెంబ్లీలో తీర్మానం అవసరం లేదు. అది చేయకుండా ప్రధాని, సోనియాగాంధీలు ఆడుతున్న రాజకీయ క్రీడలు ప్రజాస్వామిక వ్యవస్థలో ముఖ్యమైన పార్లమెంట్‌పై అపనమ్మకం కల్గించేలా చేస్తున్నాయి. తెలంగాణ ఉద్యమంలో కేసులన్నీ ఎత్తివేయబడతాయన్న కేంద్ర హోం మినిస్టర్ ప్రకటన ఆచరణకు నోచుకోలేదు. కుప్పలు, తెప్పలుగా కేసులు నమోదు చేయబడ్డాయి. విద్యార్థులపై, ప్రొఫెసర్లపై, లాయర్లపై హత్యా ప్రయత్నం వంటి తీవ్రమైన కేసుల వరకు అనేకం మోపబడినాయి. విద్యార్థి జె.ఎ.సి.కి చెందిన నాయకులపై ముప్పై వరకు కేసులు పెట్టడం జరిగింది. 144 సెక్షన్‌లు మామూలైపోయాయి. తెలంగాణ యూనివర్సిటీలన్నీ పోలీస్ క్యాంపులయ్యాయి.

సభలు, ఊరేగింపులు జరపనీయకుండా పోలీసు అనుమతులు నిరాకరిస్తున్నారు. హైకోర్టుకు వెళితే షరతులతో కూడిన అనుమతులు ఇస్తోంది. విద్యార్థులచే నిర్వహించబడే సభలకు విద్యార్థులనే, వైద్యులు నిర్వహించే వాటికి కేవలం వైద్య వృత్తికి చెందిన వారినే అనుమతించేలా కోర్టు షరతులు విధిస్తోంది. యూనివర్సిటీల హాస్టళ్ల ఖాళీ చేయించడం, విద్యార్థులకు మెస్‌లు బంద్ చేయడం, కాలేజీలకు సెలవులు ప్రకటించడం లాంటి చర్యలకు ప్రభుత్వం పూనుకున్నది. శాంతి యుతంగా జరిగే ఉద్యమాలను అనివార్యంగా ఉద్రిక్త ఆందోళనల వైపుగా సాగేలా ప్రభుత్వం ప్రవర్తిస్తోంది.

రాజ్యాంగం ప్రకారమే భావ ప్రకటనా స్వేచ్ఛ సభలు, సమావేశాలు జరుపుకునే హక్కు, పీడనను నిరోధించే హక్కులు గ్యారంటీ చేయబడ్డాయి. తెలంగాణ ఉద్యమం విషయంలో ఇవన్నీ నీటి మూటలవుతున్నాయి. ప్రజాస్వామికంగా, శాంతియుతంగా జరుగుతున్న ఉద్యమంపై పోలీసుల ప్రయోగం, అక్రమ కేసులు పెట్టడం శవయాత్రను జరుగకుండా అడ్డుకోవడం, యూనివర్సిటీలలో విద్యార్థుల ర్యాలీలపై లాఠీఛార్జ్‌లు చేయడం ద్వారా ప్రజాస్వామిక వ్యవస్థ, దాని అనుబంధ సంస్థలపై అపనమ్మకం కలుగుతున్నది. తద్వారా ఇక తెలంగాణ రాష్ట్రం కొరకు ఏమి చేయలేమని, ఏమైనా చేద్దామన్నా సాధ్యం కావడం కష్టమని తలచిన కొందరు ఆత్మహత్యల వైపు పయనించేలా ప్రేరేపించబడుతున్నారు.

పలు ఛానళ్లలో ఎప్పటికప్పుడు తెలంగాణ ఉద్యమ లైవ్ కార్యక్రమాలు చూపించబడుతున్నాయి. అనేక రకాల విశ్లేషణలు, ఇంటర్వ్యూలు, వాదోపవాదాలు, సంవాదాలు, చర్చలు అనేకం ప్రసారం

అవుతున్నాయి. రాజకీయ నాయకులు, ప్రజాసంఘాలు, విద్యార్థులు, తెలంగాణ ఉద్యమకారులు, మేధావులు, ఇలా అనేక మంది ఇందులో భాగం అవుతున్నారు.

తెలంగాణ వ్యతిరేక ఆలోచనలను, కార్యాచరణలను చూపిస్తున్నారు. ఛానళ్ల మధ్య పోటీ పెరగడమో, సెన్సేషన్ కోసమో, వ్యాపారాత్మక ప్రయోజనాల కోసమో, ప్రేక్షకుల సంఖ్యను పెంచు కోవడమో ఏమైతేనేమి గాని తెలంగాణ ఉద్యమ వ్యతిరేక, అనుకూల కార్యక్రమాలకు చోటైతే దొరికింది. ఈ కార్యక్రమాలను వీక్షిస్తున్న వారిలో పిల్లల నుండి పెద్దల వరకు ప్రభావితులు అవుతున్నారు. సెన్సిటివ్‌గా ఆలోచించే వారు విపరీత భావోద్వేగాలకు లోనవుతున్నారు. తమ ఆలోచననలకు అనుకూలమైన వాదనలు, దృశ్యాలు ప్రసారమైనపుడు హర్షాతిరేకాలు, సంతోషానుభూతులను పొందడం జరుగుతున్నది.

అదే సమయంలో వాటికి భిన్నమైనవి, వ్యతిరేకమైనవి ప్రసారమవుతున్నప్పుడు అసహనం, చికాకు, కోపం కూడా కలుగుతోంది. నచ్చని అభిప్రాయాన్ని వినే ఓపిక లేకపోవడం, వాటిని వ్యక్తీకరించనీయక పోవడం అన్ని ప్రాంతాలలో జరుగుతూనే ఉంది. పిడివాద, మూర్ఖపు, మొండి, సుదీర్ఘ వాదనలను నియంత్రించి సూటిగా, స్పష్టంగా, క్లుప్తంగా చెప్పే విధంగా జాగ్రత్త వహించాలి. అంతేగాని అసలే చెప్పనీయకపోవడం అనేది సమాజంలోని అనవసర అసహనాన్ని, అప్రజాస్వామిక వైఖరులను, సంకుచిత ధోరణులను, అపరిపక్వతను తెలియజేస్తున్నాయి.

తెలంగాణ ఏర్పాటుకు వ్యతిరేకంగా చేస్తున్న వాదనలను టివిలలో చూస్తున్న ప్రజలు, యువకులు, విద్యార్థులు తీవ్ర ఉద్విగ్నతలకు లోనవుతున్నారు. కొందరైతే టివిలకు అతుక్కుపోయి తదేకంగా చూస్తూ లీనమైపోతూ తామనుకున్న దానికి వ్యతిరేక పరిస్థితులు ఉన్నట్లు భావిస్తే, దాన్ని భరించలేక తీవ్ర నిస్పృహలకు లోనవుతున్నారు. అలా ప్రభావితులయినవారు ఆత్మహత్యల వైపు ఆలోచిస్తున్నారు.

రాజులకెదురు తిరిగిన సమ్మక్క సారక్కలు, నిజాం నిరంకుశత్వాన్ని ఎదిరించిన తెలంగాణ సాయుధ రైతాంగ పోరాటం, నిజాంకు వ్యతిరేకంగా ఆదివాసులను కదిలించి పోరాడిన కొమురం భీంల వారసత్వం ఉన్న ఈ ప్రాంతంలో, సమానత్వం, ఆత్మగౌరవాల కోసం అనేక ఉద్యమాలకు ఊపిరి పోసిన ఈ ప్రాంతంలో తెలంగాణ కోసం ఆత్మహత్యలు జరగడం గురించి ప్రజా ఉద్యమాలు ఆలోచించాల్సిన ఉంది. ప్రజలను సామాజిక చైతన్యం నుండి దూరం చేస్తూ పరాయికీకరణకు గురిచేస్తూ, సామాజిక ఉద్యమాలకు దూరంగా ఉండేలా ప్రపంచీకరణ ముందుకు తెస్తున్న విష సంస్కృతైతేనేమీ, భావజాలమైతేనేమీ బలంగా ముందుకు సాగుతున్నది. వినియోగదారీ సంస్కృతి, వ్యక్తిగత స్వార్థపూరిత అభివృద్ధిని ప్రోత్సహిస్తూ దూసుకొస్తోంది ప్రపంచీకరణ తత్వం. బహుళజాతి సంస్థల, పెట్టుబడిదారుల లాభాల కొరకు సామ్రాజ్యవాదం అన్ని రకాల మానవీయ విలువలను ధ్వంసం చేస్తూ వస్తోంది. ఈ క్రమంలో సామాజిక ఉద్యమాలు మరింత ప్రభావవంతంగా, సృజనాత్మకంగా పనిచేయాల్సిన సందర్భం ఇది.

సామాజిక లక్ష్యాల కోసం చేసే అనేక రకాల త్యాగాలలో ప్రాణ త్యాగం కంటే ఎక్కువైనది మరేమి ఉండబోదు. ప్రజలు తమ న్యాయబద్ధమైన డిమాండ్‌లను సాధించుకునే క్రమంలో భౌతిక పరిస్థితులు తీవ్ర ప్రతికూలంగా ఉన్నప్పుడు మరో నూతన, సృజనాత్మకమైన పోరాట మార్గాన్ని శోధించాలి. దీనిని విద్యార్థుల, యువకుల, ప్రజల మెదళ్లలో వేళ్లూనుకునేలా చేయడానికి ప్రజా ఉద్యమాలు, వాటి నాయకత్వాలు మరింతగా కృషి చేయాల్సిన అవసరముంది. పాలకవర్గాలు అనుసరిస్తున్న నిర్బంధపూరిత, నిరంకుశ విధానాలు, ధోరణులు ఈ ఆత్మహత్యలకు ముఖ్యకారణంగా అర్థం చేసుకోవాల్సి ఉంటుంది.

తాము కాంక్షించింది తమకు చేరువ కానపుడు ఒక్కొక్కరు ఒక్కో రకంగా స్పందిస్తుంటారు. పరిస్థితులను హేతుబద్ధంగా, గతితార్కికంగా, వాస్తవాల పునాదులపై నిలబడి సమస్యలను అర్థం చేసుకునే ప్రయత్నం కొందరు చేస్తారు. అవకాశం కొరకు వేచి చూసే వారు కొందరైతే, అవకాశాలను సృష్టించుకునే వారు కొందరుంటారు. ఎలాగైతేనేమి నాకెందుకు అనేవారు ఒక రకం. అసహాయత, అసమర్థతలతో తామనుకున్నా ఒనగూడనపుడు ఆ కోరికలను, కాంక్షలను అణచివేసుకునే వారు మరికొందరు ఉంటారు. అలా అణచుకోవడం సాధ్యం కాని వారు ఆ అసహనాన్ని, ఆక్రోశాన్ని మరొకరిపై ఉపయోగించడం లేదా తమపై తామే ప్రయోగించుకోవడం జరుగుతుంది. అలా తమపై తామే అగ్రెసివ్‌గా స్పందించే వ్యక్తుల కోవలోకి ఆత్మహత్యలకు పాల్పడే వారు వస్తారు. నిజానికి సమస్యలు ఎదురైనపుడు, వాటిని అధిగమించడానికి విభిన్న మార్గాలకై తమ జ్ఞానాన్ని వినియోగించి, ఇతరులచే నిర్మాణాత్మక సహాయాన్ని పొంది సమస్యల పరిష్కార దిశలో కృషి చేయాలి. అలా కాకుండా ఆ సమస్య నుండి తప్పుకోవడానికి చేసే ప్రయత్నంలో ఆత్మహత్యలు ఒక భాగం. అసమగ్ర ఆలోచనలు, ఒంటరితనం, సామూహిక చైతన్యం లోపించినపుడు, తీవ్రమైన నెగెటివ్ భావోద్వేగాలు ఆత్మహత్యలకు పురికొల్పుతాయి.

తాము సాధించదల్చుకొన్నది కొంచెంలో కొంచమైనా సాధించబడుతుంటే నూతనోత్సాహంతో మరింతగా కృషికి ఆస్కార ముంటుంది. అసలేమాత్రం ప్రగతి లేకపోగా వ్యతిరేకంగా పరిస్థితులు ఉన్నప్పుడు జీవితంలో ఏమి సాధించలేదని భావించినపుడు తీవ్ర మనోవ్యాకులతలకు లోనయ్యి జీవితం నుండి నిష్క్రమించే లేదా పలాయనం చిత్తగించడం జరుగుతుంది. ఇది ఒక మనోరోగ పీడిత సమస్య.

తన స్వార్థం కోసం కాకుండా ఒక సామాజిక లక్ష్యం కోసం, ఇతరుల శ్రేయస్సు కోసం తమ ప్రాణాలను తృణప్రాయంగా భావించడం, ఉన్నత సామాజికోపయోగ ఆదర్శాల కోసం నిర్మాణాత్మక పోరాటం చేయడం, అందులో భాగంగా కష్టనష్టాలను భరిస్తూ, ఏటికి ఎదురీదుతూ, ఆ క్రమంలో ప్రాణాలు పోవడం అనివార్యమయితే అది గొప్ప విషయమే. కాని ఏమి సాధించలేమనుకుని మనో నిబ్బరం సన్నగిల్లి, జీవితాలను చేజేతులా తమకు తామే చిదిమేసుకోవడం విషాదకరం. ఇది సభ్య సమాజానికి అవమానకరమైన అంశం. ఈ నేపథ్యంలో తెలంగాణ సాధన కోసం జరిగిన ఆత్మహత్యలను అర్థం చేసుకోవచ్చు. ఆత్మహత్యలకు గురైన వారి ముందు తమ ఆకాంక్షల కోసం అనేక పోరాట మార్గాలున్నాయి. అన్ని మార్గాలు మూసుకుపోయినప్పటికీ కూడా ఆత్మహత్యలు పరిష్కారం కానే కాదు. వాస్తవాల పునాదులపై, భౌతిక పరిస్థితులపై, కార్యకారణ సంబంధాలపై ఆలోచనలు చేసి స్పందించాల్సి ఉంటుంది. అంతేగాని ఆత్మహత్యలు చేసుకోవడం ఎప్పుడూ పరిష్కారం లేదు. వీ

*ఆంధ్రప్రదేశ్ రాష్ట్రం ఏర్పడిన నాటి పరిస్థితితో పోల్చి చూస్తే ఇప్పుడు తెలంగాణ చాలా అభివృద్ధి చెందిందనీ, ప్రస్తుతం రాయలసీమ, కోస్తా ఆంధ్ర ప్రాంతాలే వెనుకబడిపోయాయనీ అంటున్నారు* **చలసాని శ్రీనివాస్**

# మానసిక ఐక్యత ముఖ్యం

ఈనాడు ప్రత్యేక తెలంగాణ, సమైక్యాంధ్ర ఉద్యమాలతో రాష్ట్రం అతలాకుతలం అవుతోంది. అనేక చోట్ల విడిపోతే తేడాపడని, సంబంధం లేని సామాన్యులు కూడా ఉద్వేగాలకు లోనవుతున్నారు. ఈ సమయంలో ఒకసారి పూర్వాపరాలు పరిశీలిద్దాం. తెలంగాణ ప్రాంతంలో కొంతమంది చేస్తున్న ఆరోపణలు - వాస్తవాలు పరిశీలిద్దాం.

వలసవాదం పదాన్ని అనవసరంగా కొంతమంది దూషణకు వాడుతూ కోట్లాది మంది మనోభావాలను గాయపరుస్తున్నారు. దాదాపు 3-3500 సంవత్సరాల నుండి ఆంధ్రజాతి (తెలుగుజాతి) ఇక్కడ నివసిస్తోందని ఆధారాలు ఉన్నాయి. ప్రస్తుతం నివసించేవారిలో యానాదులు ఇక్కడి మొదటి వాసులు కాగా మిగతా వారందరూ తరువాత వలసవచ్చినవారే. అసలు మానవజాతే వలసజాతని అన్ని చారిత్రాత్మక పరిశోధనలు తీర్మానించాయి. స్కల్ ఇండెక్స్ చూసుకుంటే ఒడియా, మహారాష్ట్రీయులు, కన్నడిగులు, తమిళులు వేరే కాగా దాదాపుగా మన తెలుగువారందరం డొలికో సెపాతికి చెందినవారం.

కొంతకాలం పాలించిన పాలకుల అథారిటీవల్ల ఆయా ప్రాంతీయులు కొన్ని తమ సంస్కృతిలో ఇముడ్చుకున్నా వేల సంవత్సరాలు కలిసే ఉన్నామన్నది, సంస్కృతులు, అనేక ఆచారాలు ఒక్కటిగానే ఉండేవన్నది గమనార్హం. ఇస్లాం, క్రిస్టియన్, బౌద్ధ మతాలలో కూడా రాష్ట్రం అంతా ఒకే సంస్కృతి అన్న భావమున్నది. ఇతర ప్రాంతాలకు వలసవెళ్లిన తెలుగువారు ఇతర రాష్ట్రాలకు ముఖ్యమంత్రులుగా (ప్రెసిడెన్సీలకు ప్రధానమంత్రులుగా) ఇతర దేశాలకు అధ్యక్షులుగా ఎన్నికైన విషయం తప్పేమీ కాదు. మహారాష్ట్రకి తెలంగాణ నుంచి వెళ్లినవాసులు ముఖ్యమంత్రులు.

ఆయా ప్రాంతాలకు వెళ్లడం అక్కడ వస్త్ర పరిశ్రమలు, మగ్గాలు, ఇతర వ్యాపారాలు చేసుకోవడం తప్పేమీ కాదు. వారి పరిశ్రమలలో అక్కడి స్థానికులు పనిచేయడం విచిత్రమేమీ కాదు. ఇంకా అక్కడికి వెళ్లినవారు మన భాష, సంస్కృతులు మరిచిపోకుండా ఉండడం తప్పా? కొందరు నాయకులు తెలంగాణలో ఇటుకల కూలీలని పంపించివేస్తూ, మేస్త్రీలని, ఉద్యోగులని, వ్యాపారులని, పరిశ్రమలు పెట్టినవారు, చిన్న వ్యాపారాలు పెట్టిన వారిని పొట్టకొట్టే వారిగా ఒక పక్క తిడుతూ మరొకపక్క పొట్టకూటికి వచ్చేవారికి వ్యతిరేకం కాదంటే ఇక అడుక్కునేవారే మిగలాలా? భారతదేశంలో సెటిలరని, వలస ద్రోహులని వాడే పదజాలాలు తప్పుకాదా?

మన హిందీ యాస ఢిల్లీలో, ఉత్తరాది యాసకు విభిన్నంగా ఉంటే కొంత అపహాస్యానికి గురవుతున్న మాత్రాన విద్వేషం రెచ్చగొట్టడం భావ్యమా? ఉత్తర భారతీయులు 63 సంవత్సరాలలో 57 సంవత్సరాలు పాలించారనీ, ఢిల్లీ పరిసర ప్రాంతాలలోనే రాజధాని కారణంగా అభివృద్ధి అయిందనీ, అక్కడ ఉద్యోగాలు ఎక్కువ అక్కడి ప్రాంతం వారికే వస్తున్నాయనీ, మన భాషలని అవమానపరుస్తున్నారనీ, మన దేశం నుండి వేర్పాటు కోరతామనీ, విద్వేషం రెచ్చగొట్టడం ఎంత ప్రమాదకరమో, తోటి తెలుగువాడి మీద విద్వేషం రెచ్చగొట్టడం అంతే ప్రమాదకరం.

దాదాపు వంద సంవత్సరాల నుండే తెలుగువారు తిరిగి కలిసి సమైక్య రాష్ట్రంగా ఏర్పడాలనే కోర్కె మద్రాసు, హైదరాబాద్‌లోని తెలుగువారికి ఉండేది. ఆంధ్ర పదనామం తెలంగాణలోనే ఎక్కువగా ఉండేది. చెప్పలేనన్ని గ్రంథాలయాలు ఆంధ్రనామం పేరు మీదే తెలంగాణలో 110 సంవత్సరాల నుండి ఏర్పరిచారు.

ఆంధ్రసభలకు అన్ని ప్రాంతాల తెలుగువారు హాజరయ్యారు. 1921-23లలో ఏర్పడిన ఆంధ్ర మహాసభ, నిజాం రాష్ట్ర ఆంధ్రమహాసభ ఉద్దేశ పత్రాలు ఈరోజు గమనించినా ఆంధ్రుల పేరుమీదె ప్రతిదీ నడిచిందని తెలుస్తుంది. ఆఖరికి హైదరాబాద్‌లో పెత్తందారీ, కర్కోటక పాలనను తుదముట్టించడంలో అతి ముఖ్యమైనది కూడా ఆంధ్ర మహాసభేనన్నది ముమ్మాటికి నిజం. విశాలాంధ్ర సభలు తెలంగాణలో ఎన్నో జరిగాయి, విశాలాంధ్రనే కోరాయి. వామపక్షాలే కాక, మితవాద పక్షాలలో కూడా 1046 నుంచే స్వామి రామనందతీర్థతో పాటు అనేకమంది విశాలాంధ్రని కోరారు.

మొదటి ఎస్.ఆర్.సి., ఫజల్ అలీ కమిషన్ రెకమెండేషన్ కొన్ని చూద్దాం. బాగా వెనుకబడి ఉన్న మరట్వాడా ప్రాంతాన్ని అక్కడి ప్రజలకు ఏం రక్షణలు కల్పించకుండా దేశంలో దాదాపు యాభై శాతం ఆదాయం వచ్చే అత్యంత సంపన్నమైన బొంబాయిలో కలపాలంది. గుల్బర్గా, ఇతర ప్రాంతాలని ఏం మాట్లాడకుండా మైసూర్‌కి అతికించాలంది. సౌరాష్ట్రని గుజరాత్‌కి కాకుండా మహారాష్ట్రకి కలపాలని, త్రిపురని అస్సాంకి కలపాలని, అస్సాంని విభజించి ఇతర రాష్ట్రాలు ఏర్పాటు చెయ్యవద్దని, ఉన్న హిమాచల్‌ప్రదేశ్‌ని పంజాబ్‌లో కలపాలని అనేక అర్థంలేని నిర్ణయాలు తీసుకుంది. కాని విదర్భను ప్రత్యేక రాష్ట్రం చెయ్యాలని ఏకగ్రీవంగా తీర్మానించిన కమిటీ, తెలుగువారి విషయం వచ్చేటప్పటికి సమైక్య రాష్ట్రానికి అనుకూలంగా కొన్ని పేరాలను పొందుపరిచినా, అంతిమంగా తెలంగాణ (బీదర్‌తో సహా) తాత్కాలికంగా ప్రత్యేక రాష్ట్రంగా ఉంచాలని, 1961 ఎన్నికల తర్వాత 2/3 మెజారిటీ శాసనసభ్యులు ఒప్పుకుంటే ఆంధ్రరాష్ట్రంతో కలపవచ్చని ఆఖరి పేరాలలో తెలిపింది.

అంతవరకూ ఆగకుండా వెంటనే కావలసినదానికంటే అత్యధికంగా తెలంగాణ శాసనసభ్యులు 103:29 మెజారిటీతో ఆంధ్రరాష్ట్రంతో విలీనమవ్వాలని నిర్ణయం తీసుకున్నారు. తెలంగాణ ప్రాంతం నుండి విలీనానికి వ్యతిరేకంగా కొందరున్నట్టే ఆంధ్ర ప్రాంతం

నుంచి ఆచార్య ఎన్.జి.రంగా ఇంకా అనేకులు విలీనాన్ని వ్యతిరేకించారు. తరువాత 1969 ఉద్యమం మొదలైనది కేవలం ఉద్యోగాల సమస్య మీద. తరువాత ప్రత్యేక రాష్ట్ర డిమాండ్‌గా మారి దాదాపు 369 మంది అమాయకులు బలిదానం చేసారు.

1972లో జై ఆంధ్ర ఉద్యమం ఉద్యోగాల విషయంలో వచ్చినా, హైదరాబాద్ రాజధానిగా వద్దని, వేరే రాష్ట్రం కావాలని దాదాపు 400 మంది బలిదానం అయ్యారు. అప్పుడు, సర్దార్ గౌతు లచ్చన్న ప్రత్యేక రాష్ట్రం కావాలన్నప్పుడు, లోక్‌సభలో ప్రధాన ప్రతిపక్ష నాయకుడు దేశ స్వతంత్ర పార్టీ అధ్యక్షులు ఎన్.జి. రంగా గొంతెత్తినప్పుడు అనేకమంది తెలంగాణ నాయకులు తమ విధానం సమైక్య రాష్ట్రమేనన్నారు.

ఆఖరికి తీరాంధ్రా, సీమ వాసులని మభ్యపెట్టి ఆరు సూత్రాల ఒప్పందం పేరు మీద మరల సమైక్య రాష్ట్రాన్ని బలవంతంగా రుద్దారు. ఆరోజే విడిపోయుంటే బావుండేదని 90 శాతం కోస్తా, సీమ ప్రజలు ఈనాడు భావిస్తున్నారు. అయినా ఆరు సూత్రాల ఒప్పందం పూర్తిగా అమలు పరచకుండా అక్కడి ప్రజల ఆత్మత్యాగాన్ని అపహాస్యం చెయ్యడం జరిగింది. వెనుకబడ్డామని, అన్యాయం అయిపోయామని తెలంగాణ ప్రాంత ప్రజలు ఆవేదన చెందినట్టే కోస్తా, సీమ ప్రజలు కూడా ఆవేదన చెందుతున్నారు.

ఆంధ్రప్రదేశ్ ఏర్పడేనాటికి పారిశ్రామిక రంగంలో కోస్తా ఎంతో ముందుండేది. అనేక పట్టణాల్లో పారిశ్రామిక వాడలు దిగ్విజయంగా నడుస్తూండేవి. నేడు వాటిల్లో 95 శాతం మూలబడ్డాయి. మొత్తం పారిశ్రామిక అభివృద్ధి హైదరాబాద్ పరిసర ప్రాంతంలో కేంద్రీకృతమైంది. 1961లో 2,43,736 మంది ఉండిన కార్మికుల సంఖ్య ఈనాడు కోస్తా ప్రాంతంలో 2,03,131కి పడిపోగా, అది తెలంగాణ ప్రాంతంలో 1,47,942 నుంచి 5,35,289కి పెరిగింది. తీరాంధ్ర, సీమ జిల్లాలలో ఊరూ, వాడల్లో ఇదివరకు ఉన్న చిన్న తరహా పరిశ్రమలు కనుమరుగై పోయాయి. కార్మికులు పుట్టకొకరుగా చెదిరిపోయి ఆఖరికి హైదరాబాద్ పరిసర ప్రాంతాలలో బతకాల్సిన పరిస్థితి వచ్చింది.

రాష్ట్రం వచ్చిన తరువాత ఇ.సి.ఐ.ఎల్., మిధాని, డి.ఆర్.డి.ఎల్., బి.ఎచ్.ఇ.ఎల్., ఆర్డినెన్స్ ఫ్యాక్టరీ, ఒకటా రెండా, వందల, వేల పరిశ్రమలే కాక కేంద్ర, రాష్ట్ర ప్రభుత్వ సంస్థలు పోరాటాలేమీ లేకుండా అక్కడే ఏర్పరిచారు. ఏర్పడడానికి ఎక్కువగా కారణమైనవారు తీరాంధ్ర, సీమ ప్రాంతం వాసులే. మన తెలుగువారందరికీ రాజధాని, మనం మోసపోమని అనుకున్నారు.

ఏది ఏమైనా ఆయా ప్రాంత ప్రజలు దగాపడ్డారు. కాకినాడలో రెండు వ్యవసాయ అనుబంధ పరిశ్రమలు, స్థానికులకు ఉద్యోగాలు లేని విశాఖ ఉక్కు తప్ప కోస్తాకేమీ విదల్చలేదు. రాయలసీమకి ఇప్పుడు పరిశ్రమలు ఏర్పరుస్తామని నమ్మబలుకుతున్నారు. సబ్సిడీలు, అనేక పథకాలు కేవలం హైదరాబాద్ పరిసర జిల్లాలలో ప్రలోభపెట్టి ఈనాడు కోస్తా ప్రాంతంలో పరిశ్రమలు రాకుండా చేసి, మరల ఇతర ప్రాంతాల వారిని ద్రోహులనడం, దోచుకుంటున్నారని అనడం శోచనీయం కాదా?

విస్తృత అవకాశాలకు 5 శాతం ప్రజలు వలసవెళ్లడం మామూలే. కానీ బతుకు తెరువుకు దాదాపు 80 శాతం తీరాంధ్ర, సీమ పట్టభద్రులు వలసలు వెళుతుంటే మరల అందులో హైదరాబాద్ ప్రాంతానికి మూడొంతులు వలస వెళ్లాల్సి వచ్చిన పరిస్థితులు ఉండడం వలన ఆయా ప్రాంతాలు ఎంత దగాపడ్డాయో తెలుస్తుంది.

వాణిజ్య సంస్థలలో పనిచేసి నమోదైన ఉద్యోగులు 1961లో మూడు లక్షలు ఉంటే ఇప్పుడు తగ్గిపోయారు. కాని తెలంగాణలో 200 శాతం పెరిగారు. తీరాంధ్ర, రాయలసీమ, తెలంగాణ దూర ప్రాంతాలలో ప్రజలకి, నిరుద్యోగులకి అక్కడే గౌరవప్రదమైన జీవితాన్ని కల్పించడంలో మన రాజకీయ నాయకులు, ప్రభుత్వాలు విఫలమయ్యాయనే దాంట్లో సందేహం లేదు. దాని వల్ల ఈనాడు ముఖ్యంగా తీరాంధ్ర, సీమ వారు వలసవాదులుగా వేరే వారిచే ముద్ర వేయించుకోవాల్సి వస్తోంది.

1956-69 వరకూ సరైన అర్హతల కొరత కారణంగా తెలంగాణ ప్రాంతంలోని జిల్లా పరిషత్ ఛైర్మన్, ఇతర అధ్యక్షులు ఇతర ప్రాంతాల నుంచే ఎక్కువ జీతాలు తీసుకువచ్చి ఇక్కడ ఉపాధ్యాయులు, నర్సులు, వైద్యులు, కొంతమంది సాంకేతిక నిపుణులని ఉద్యోగాలలో పెట్టుకుని, అవసరమైతే కొంతమందికి దొంగ ముల్కీ సర్టిఫికెట్లు ఇప్పించిన సంగతి వాస్తవమే. అయితే కొంతమంది అక్రమంగా రావడం కూడా జరిగింది.

1970 నుంచి అలాంటివి తగ్గిపోయాయి. తరువాత వచ్చిన కమిటీలు ఇచ్చిన వివరాల ప్రకారం, నాన్‌లోకల్ అంటే దాదాపు 90 శాతం ఉద్యోగాలకు పక్క జిల్లావాసులే నాన్ లోకల్ అవుతారు. అంతేకాని అంతమంది ఇతర ప్రాంతాలు, రాష్ట్రాల నుంచి వచ్చినవారు కాదు. ఈ విషయాన్ని ఏమార్చి కొంతమంది అనవసరంగా తెలంగాణ ప్రాంతంలో లక్షలాది ప్రభుత్వ ఉద్యోగాలు ఇతర ప్రాంతీయులు కాజేసారని విద్వేషాలు పెంచే విధంగా మాట్లాడుతూ తెలంగాణ వస్తే లక్షల ఉద్యోగాలని ప్రచారం చేస్తున్నారు. తెలంగాణ ఏర్పడితే ఏ విధంగా లక్షల ప్రభుత్వ ఉద్యోగాలు యువతకి దక్కుతాయో శ్వేతపత్రం ఇన్ని సంవత్సరాల నుంచి ఇవ్వకపోవడం సరైనది కాదు.

ఆనాడు ముల్కీ నిబంధనలకు వ్యతిరేకంగా ఆత్మగౌరవంకై ప్రాణాలు త్యాగం చేసిన కోస్తావారు సాధించిన వాటిల్లో కొన్ని చూద్దాం: Six Point formula clarification issued on 22-10-1973 "We, however, visualise that the state as a whole may consist of 5 or 6 divisions, the twin cities including the cantonment being constituted into a separate division". Thus it is evident that always Hyderabad city area is different to Zone VI. ఇది పూర్తిగా గాలికిపోయింది.

గిర్‌గ్లానీ ఏకపక్ష నివేదికపై కోస్తా, రాయలసీమ ప్రజలలో కచ్చితమైన అనుమానాలున్నా, తెలంగాణలో ఉద్యోగాలన్నీ కోస్తా, రాయలసీమల వాసులు దోచేశారనే ఘోరమైన ప్రచారంలో నిజాన్ని వారి రిపోర్ట్ బయటపెట్టింది. "The statistical part of non-locals and locals has been examined by the Commission and it will be seen that the percentage non-locals in the Zones V and VI is negligible and far below the ceiling of 20 per cent. Therefore on the statistical aspect there is no question of any action or implementation of the GO".

In the Conclusion para Page 11 end-I Shri Girglani ONC reports says "5) The total number of employees in the Zone V and VI are 1,80,080. 6) Out of item no. 5 above the breakup of locals and non-locals as under. Locals 1,45,606, non-locals 16,653. 7) Under item 6 above the non-locals constituted on aggregate of 9.25 percent in the Zone V and VI".

రాష్ట్రపతి శాసనం ఇచ్చిన మినహాయింపులలో ఒకటైన (14 ఎఫ్) ప్రకారం హైదరాబాద్ పోలీస్‌ల భర్తీలో రాష్ట్రంలో అన్ని జిల్లాలకు సమాన హక్కులుండాలి. సచివాలయంలో, రాష్ట్ర ప్రభుత్వ, కార్పొరేషన్లకు, భారీ ప్రాజెక్టులకు, ప్రత్యేక విభాగాలకు స్థానికీకరణ వర్తించదని రాష్ట్రపతి శాసనంలో ఉంది. 30 సంవత్సరాల నుండి సరిగ్గా అమలైన (14 ఎఫ్) రాష్ట్రపతి శాసనంపై వచ్చిన ఒక తప్పైన తీర్పుని సరిచేస్తూ సుప్రీంకోర్టు తీర్పు ఇస్తే (అది హైదరాబాద్ నగరంలో కేవలం పోలీస్ యూనిఫార్మ్ ఉద్యోగాలకే వర్తిస్తుంది), పూర్తిగా అర్థంచేసుకోకుండా కొందరు ప్రత్యేక తెలంగాణవాదులు చేసిన వాదాన్ని నమ్మి దాన్ని కూడా సవరించాలని అనేకపార్టీలు అభిప్రాయ పడ్డాయంటే దానికి అర్థం లేదు.

ఈరోజు అనేక రాష్ట్ర ప్రభుత్వ కార్యాలయాలు హైదరాబాద్ రాజధాని అని అక్కడ ఉండాల్సి వస్తే వాటిల్లో అనేక విభాగాల్లో స్థానికులే

ఉండాలని నిర్ణయాలు జరగబోతుంటే మరి అన్ని ప్రధాన కార్యాలయాలు అక్కడెందుకు? కొన్ని విశాఖలో, కొన్ని విజయవాడలో, మరికొన్ని ఒంగోలులో పెట్టవచ్చుకదా? అందుకనే కోస్తా, రాయలసీమలు హక్కుల కోసం వేరుపడాలని మేము కోరుకునేది.

31 మార్చ్, 1956 నాటికి తెలంగాణ ప్రాంతంలో మొత్తం కలిపి 11 గ్రామాలు కూడా విద్యుదీకరణ లేకుండా అంధకారంలో ఉంటే, చిత్తూరు జిల్లాలో ఒక్క తాలూకాలోనే 15 గ్రామాలు విద్యుదీకరణ అయి ఉన్నాయంటే తెలంగాణలో ఆనాటి పరిస్థితి ఏమిటో తెలుస్తుంది. ఈనాడు రాష్ట్రంలో దాదాపు 100 శాతం విద్యుదీకరణ జరిగింది. తెలంగాణలోనే అత్యధికంగా ఖర్చుపెట్టారు. 1994-2004 వరకూ విద్యుత్‌రంగంలో ప్రభుత్వ పెట్టుబడులను పరిశీలిస్తే తెలంగాణలో రు. 7367 కోట్లు, కోస్తాలో రు. 1836 కోట్లు, రాయలసీమలో రు. 1450 కోట్ల రూపాయలు ఖర్చు చేసారు. కోస్తా కంటే తెలంగాణలో 400 శాతం పైగా ఖర్చు పెట్టారు. (సి.ఎం.ఆర్.పి. - 2003).

ఉద్యోగాలతో సహా సర్వం తెలంగాణలోనే. బిల్లులు సక్రమంగా కడుతున్న ఉత్తర కోస్తా యూనిట్‌కి 70-80 పైసలు ఉత్తర తెలంగాణ కంపెనీ కన్నా ఎక్కువ వసూలు చేసి వేలాది కోట్ల రూపాయలు వేరే ప్రాంతానికి తరలించారు. తాము మోసపోతున్నామని వారికి తెలియదు, అయినా ఆ ప్రాంతంవాసులే దొంగలని ముద్ర వేయించుకోవడం సరైనదా?

పారిశ్రామికంగా చూసుకుంటే 1961లో కోస్తాలో 58.5 శాతం విద్యుత్ వినియోగం అవుతూ ఉంటే తెలంగాణలో అది కేవలం 28.1 శాతం. కాని ఇప్పుడు తెలంగాణలో 58.77 శాతం ఉండగా, కోస్తాలో 29.35 శాతానికి పడిపోయింది. రాయలసీమలో కూడా 11.86 శాతానికి తగ్గింది. దినదినానికి పారిశ్రామికంగా కోస్తా అణగారి పోతోందనడానికి నిదర్శనమిది. 1961 నాటి భారత గణాంక వివరాల ప్రకారం చూస్తే కేవలం కృష్ణా జిల్లా విద్యుత్ వినియోగం ఆనాటి హైదరాబాద్ జిల్లా (రంగారెడ్డి, హైదరాబాద్ కలిపి) మొత్తం వినియోగం కంటే 45 శాతం కంటే ఎక్కువ.

ఓడలు బళ్లు, బళ్లు ఓడలు అవ్వడమంటే ఇదే. ఈరోజు పరిస్థితి ఎంత దయనీయంగా ఉంది. కిందపడ్డా పైచేయి అనుకుని 'మీసాలకు సంపెంగ నూనె' సామెతను పోషించే కొంతమంది కోస్తా నాయకులున్నంత వరకూ తీరాంధ్ర, రాయలసీమ కునారిల్లుతూనే ఉంటాయి. అందుకనే నవయువత అభివృద్ధి కోరుతూ ముందుకు రావాల్సిన సమయం ఆసన్నమైంది.

కాలడ్డం పెడితే నీరు వచ్చే మన తెలంగాణకి నీరు రాకుండా నీటి దొంగలు కోస్తావారు దోచుకుపోతున్నారనే ఆరోపణలు వస్తున్నాయి. అలాగే 80 శాతం గోదావరి, కృష్ణా జలాలు తెలంగాణలో నుంచి వస్తుంటే 90 శాతం కోస్తా, సీమలు వాడుకుంటున్నాయి.

హైదరాబాద్ అవిభాజ్య రాష్ట్రం నుండి తెలంగాణ ప్రాంతం విడిపోయి ఆంధ్ర రాష్ట్రంతో కలిసి ముందే గ్రావిటీతో వచ్చే ప్రాజెక్టులు పై ప్రాంతాలలో కట్టడం మీద దృష్టిపెట్టక, విడిపోయేటప్పుడు జలాలు దుముకుతూ గలగలా వచ్చే చోట ప్రాజెక్టులకి ఒప్పందాలు చేసుకోవడంలో, దూరదృష్టి చూపించడంలో నిర్లక్ష్యం చెయ్యడం వల్ల ఈ రోజు తెలంగాణ ప్రాంతానికి నిజమైన అన్యాయం జరిగింది. కాని కోస్తా, రాయలసీమ వారి వల్ల కాదు. కాలడ్డం పెడితే వేలాది టి.ఎం.సి.ల నీరు తెలంగాణనే సస్యశ్యామలం చేస్తుందనే అభూత కల్పనలతో ప్రజలని మాయచేయడం మానివేయకపోతే తెలంగాణ రాష్ట్రం వచ్చిన తరువాత సమాధానం చెప్పాల్సి ఉంటుంది. ముఖ్యమైన నీరు సమకూరే ప్రదేశం వద్ద గోదావరి బెడ్‌లెవల్ 70-80 మీటరు (సముద్ర మట్టానికి) ఉంటే, దాదాపు తెలంగాణ అంతా 150-600 మీటరు ఎత్తు ఉంటే ఎత్తిపోతలు శరణ్యం కాదా? ఎస్.ఎల్.బి.సి. సొరంగమార్గం ఆలస్యం అయినమాట వాస్తవం. అలాగే నలభై సంవత్సరాల నుండి వెలిగొండ పూర్తవలేదు.

అన్యాయం చాలాచోట్ల జరిగింది. కాని కొన్ని విషయాలు అందరూ గమనించాలి. ఏనాడో బ్రిటిష్ వారు కట్టిన ప్రాజెక్టులు తప్ప కోస్తాకి ప్రత్యేకంగా ఏ భారీ ప్రాజెక్టూ ఈ ప్రభుత్వాలు పూర్తి చెయ్యలేదు. ఏనాడో కట్టిన ప్రాజెక్టు చూపించి ఆయా ప్రాంతాలు ఆంధ్రప్రదేశ్ వచ్చిన తరువాతే బాగుపడ్డాయని చెప్పడం సరైనది కాదు. 1954-55లో పంటల దిగుబడి ప్రాంతాలవారి చూస్తే మరో వివరం అక్కరలేదు.

అంతేకాదు, దిగుబడి అభివృద్ధిలో నానాటికీ కోస్తావారు వెనకబడుతున్నారు. ఒకనాడు అట్టడుగున ఉండే కరీంనగర్ వరి దిగుబడిలో 320 కిలోలు ఉంటే ఈనాడు 3000 కిలోలకు పెరగగా, ముందున్నాయని భావించే కొన్ని కోస్తా జిల్లాలలో రెండు, మూడు మినహా - మిగతా వాటిల్లో 2006లో కరీంనగర్ జిల్లా కంటె తక్కువలో ఉందన్న విషయం నమ్మలేని నిజం. ఆహార ధాన్యాల ఉత్పత్తిలో 2006లో కరీంనగర్ జిల్లా 16.69 లక్షల మెట్రిక్ టన్నుల ఉత్పత్తితో 140 సంవత్సరాల నుండి మొదటి స్థానంలో ఉన్న పశ్చిమ గోదావరి జిల్లా స్థానాన్ని కైవసం చేసుకోగా, రాష్ట్రంలో ఆఖరున ఉన్నది విశాఖ జిల్లాయే.

వెనుకబడిన జిల్లాలకు ప్రాధాన్యత ఇవ్వడం సరైనదే. కాని రికరింగ్ వ్యయం అత్యంత భారీగా ఉండి సామాన్యులు చెయ్యలేని వ్యవసాయం కోసమని రు. 38,500 కోట్లతో (ప్రస్తుత ఖర్చుని పరిశీలిస్తే ప్రాజెక్టు పూర్తయ్యేటప్పటికి 1.5 లక్షల కోట్లు దాటుతుంది), 16 లిఫ్ట్‌లతో దాదాపు అర కిలోమీటర్ ఎత్తిపోతల ప్రాజెక్టులు గుత్తెదారుకా? అవసరమైన చోట్ల ప్రాజెక్టు కట్టి తీరాల్సిందే.

ఎవరో ఏదో బ్లాక్‌మెయిల్ చేసి ప్రజలకి నిజాలు చెప్పడం మాని మాయచెయ్యడం పొరపాటు. ఈనాడు 60 శాతం నిధులు తెలంగాణలోనే ఖర్చు పెడుతున్నామన్న మంత్రుల ప్రకటనలు చూస్తున్నా, అది సరిపోవడం లేదని, ఇంకా మోసం జరుగుతోందని, ఎక్కువ కావాలని తెలంగాణలోని కొందరు బెదిరిస్తున్నా, తీరాంధ్ర సీమ నాయకులు ఏం చేస్తున్నారో తెలియదు. రాష్ట్ర విభజన ఆలస్యం అయితే ఇంకో లక్ష కోట్లు అధికంగా అప్పులు మోయాల్సి వస్తుంది.

ఏది ఏమైనా కొద్దిరోజులలో బ్రిజేష్ కుమార్ ట్రిబ్యునల్ హియరింగ్స్ పూర్తి కావస్తున్నాయి. పాత బిస్కెం బయటకు తీసి దాదాపు 300-400 మిగులు జలాలను నికర జలాలుగా ముద్ర వేసి పై రాష్ట్రాలకు 75 శాతం నీరు కేటాయించ వచ్చని తెలుస్తోంది. 2004లో 20 టి.ఎం.సి.లు తాగునీటికి ఇమ్మని ముఖ్యమంత్రి, ఆపై ప్రధానమంత్రి పై రాష్ట్రాల వారిని బతిమాలినా నీరు విడుదల చెయ్యలేదనేది గమనార్హం. ట్రిబ్యునల్, కమిటీలు, బోర్డులు ఆఖరికి సుప్రీంకోర్టు తీర్పును కూడా నేటికీ పై రాష్ట్రాలు లెక్కచెయ్యకుండా ప్రజలను రెచ్చగొట్టినట్టు కావేరి వివాదం ఇతరత్రా చూసాం.

ఇప్పుడు అధికంగా వందల టి.ఎం.సి.ల నీటిని ముందుగా వారు ఆపు చేసుకుంటే మన పరిస్థితి ఏమవుతుంది? దాదాపు ఐదు టి.ఎం.సి.ల బాబ్లీ ప్రాజెక్టుపై మన ఉద్యమాలతో ఏం సాధించలేక పోయాం అనేది గుర్తు పెట్టుకోవాల్సిన విషయం. కాగా మహబూబ్‌నగర్, నల్గొండ (హైదరాబాద్‌కి నీరు), చిత్తూరు, అనంతపురం లాంటి అనేక జిల్లాలకు మిగులు జలాలపై ఆధారపడి దాదాపు 27 లక్షల ఎకరాలకు కాలువలు నిర్మిస్తున్న ఈ సమయంలో మన రాష్ట్ర ప్రజలు సమైక్యంగా ఉద్యమించాలని కోరుతున్నాను. కె.సి.ఆర్. దూషణలో, లేదా కె.సి.ఆర్.ని వేరొకరు దూషిస్తే బాగా ప్రచారమిస్తూ ఉండే మీడియా ఈ విషయంలో

నేనూ, మా వేదిక పదే పదే గట్టిగా స్పందించామని అభ్యర్థిస్తున్నా స్పందన లేదని బాధ కలుగుతోంది.

కోస్తాలో ఆధునిక వైద్యశాలలు ఏర్పరచడంలో ఇప్పటి వరకూ అన్ని ప్రభుత్వాలు విఫలమైనాయి. హైదరాబాద్ ప్రాంతం ఆధునిక ప్రభుత్వ, కార్పొరేట్ ఆసుపత్రులకు కేంద్రమైంది కాబట్టి దూరాభారమైనా తప్పనిసరిగా అక్కడికి అరప్రాణాలతో పరిగెట్టాల్సిందే. అన్ని సూపర్ స్పెషాలిటీ ఆసుపత్రులూ అక్కడే. తీరాంధ్ర అభివృద్ధిపై మేము నిర్వహించిన అనేక సమావేశాలలో ఆయా ప్రాంతాలకి సూపర్ స్పెషాలిటీ ఆసుపత్రులు కావాలని ఘోషిస్తే, తీరుస్తామని కంటితుడుపు వాగ్దానాలు తప్ప ఒక్కటీ కట్టలేదు.

ఒక్క గాంధీ ఆసుపత్రి, నిమ్స్‌కి ఉన్న సదుపాయాలు, పరికరాలు మొత్తం కోస్తా జిల్లాలోని అన్ని ప్రభుత్వ ఆసుపత్రులకి కలిపినా లేవు. వందల కోట్ల ఖర్చుతో ఇంకా కొత్త నిమ్స్ ఆసుపత్రులు, ఇ.ఎస్.ఐ. ఆసుపత్రులు ఎన్నో అన్నీ తెలంగాణలోనే ఏర్పాటు చెయ్యబోతున్నారట. అవికాక నాలుగు కొత్త ప్రభుత్వ అత్యాధునిక ఆసుపత్రులు తెలంగాణ ప్రాంతంలోనే కట్టడానికి నిర్ణయించారు. ఇంకా అక్కడ కట్టాలనే కోరుకుందాం. కాని మిగతా ప్రాంతాల విషయమేమిటి? ప్రాంత అభివృద్ధి ఏమవుతుందో ఒక్కసారి విజ్ఞానులైన తీరాంధ్ర, సీమ ప్రజలూ, ఉద్యోగస్తులూ ఆలోచించండి. ఒకటా రెండా అనేక విభాగాలలో ఆయా ప్రాంతానికి అన్యాయాలే. ఒక్కసారి ఆనాటి (1961) వివరాలు చూడండి–

వైద్యుల సంఖ్య: కోస్తా – శ్రీకాకుళం : 630; విశాఖ : 988; తూర్పు గోదావరి : 1829; పశ్చిమ గోదావరి : 1203; కృష్ణా : 1893; గుంటూరు : 2298; నెల్లూరు : 679

తెలంగాణ – నల్గొండ : 27; ఖమ్మం : 54; వరంగల్లు : 258; కరీంనగర్ : 160; నిజామాబాద్ : 122; మహబూబ్‌నగర్ : 85; ఆదిలాబాద్ : 85; మెదక్ : 95

రాయలసీమ – చిత్తూరు : 425; కడప : 547; అనంతపురం: 598; కర్నూలు : 848.

ఆనాడు హాస్పిటల్ పడకల విషయంలో, ఉదాహరణకు ఒక్క తూర్పు గోదావరి జిల్లాలో 1904 ఉండగా కరీంనగర్‌లో 186, నల్గొండలో 149, మెదక్‌లో 112, ఆదిలాబాద్‌లో 79 ఉండేవి. మరి నేటి గోదావరి జిల్లాల పరిస్థితి ఎక్కడ వేసిన గొంగళి అక్కడేలా ఉంది. విజయనగరం లాంటి జిల్లాలలో ప్రభుత్వ వైద్యరంగం అధోగతిలో ఉంది.

ఈరోజు కొత్తగా వచ్చి కుదురుకోనివి మినహాయిస్తే కోస్తాలో ఆంధ్ర, నాగార్జున, కుంటుతూ నడుస్తున్న ఆరోగ్య విశ్వవిద్యాలయం కలిపి ఇప్పటివరకు ఉన్నవి మూడు. మరి తెలంగాణలో పాతవే 15.

| జిల్లా | విద్యార్థులు | | విద్యాలయాలు | |
|---|---|---|---|---|
| | 1956-57 | 2001 | 1956-57 | 2001 |
| శ్రీకాకుళం | 216769 | 451514 | 2516 | 3877 |
| ప.గో.జిల్లా | 237992 | 570980 | 2024 | 3352 |
| కృష్ణా | 280178 | 609241 | 2263 | 3506 |
| గుంటూరు | 339168 | 625639 | 2962 | 3831 |
| కరీంనగర్ | 69621 | 677991 | 1026 | 3724 |
| వరంగల్ | 81039 | 652573 | 1000 | 3866 |
| నల్గొండ | 59414 | 646232 | 893 | 3719 |
| ఆదిలాబాద్ | 33642 | 517137 | 611 | 4091 |

అంటే ఒకనాడు కోస్తా విద్యారంగంలో అధోగతిలో ఉండేదన్న అనుమానం ఈ తరానికి రావచ్చు. కానీ విద్యారంగంలో కోస్తాకు జరిగిన దగా చూస్తే దిగ్భ్రాంతికి గురవుతారు.

1961లో కృష్ణా జిల్లాలో అక్షరాస్యత 36.69 శాతం ఉంటే తెలంగాణలో కరీంనగర్ తదితర జిల్లాలలో 15 శాతం దాటలేదు. హైదరాబాద్ రాష్ట్రంలోని జిల్లాల గెజిట్ (1951) ప్రకారం నల్గొండలో అక్షరాస్యత 6.39 శాతం, మెదక్‌లో 6.50 శాతం, నిజామాబాద్‌లో 5.78 శాతం మాత్రమే. ఉర్దూ కొంచెం తెలిసినా అది అక్షరాస్యతగా ఉండేది. అది అలా ఉంచి విద్యార్థుల / ఉపాధ్యాయుల సంఖ్యను ఆనాడు ఈనాడు కనీసం కొన్ని జిల్లాలలో పోల్చి చూస్తే ఏ ప్రాంతం అభివృద్ధి అయ్యిందో తెలుస్తుంది.

1961లో తెలంగాణ విద్యా సంస్థలలో 17511 మంది ఉపాధ్యాయులు ఉండగా ఈనాడు 1000 శాతం పైగా అభివృద్ధి చెంది 1,95,814కి చేరగా, అదే కోస్తాలో 53,535 నుంచి మూడురెట్లైనా పెరగకుండా 1.43 లక్షలు మాత్రమే ఉన్నారు. (ఆధారం : తెలంగాణ డిస్ట్రిక్ట్ గెజిటర్స్, అబ్‌స్ట్రాక్ట్ ఆఫ్ ఎకనామిక్స్ అండ్ స్టాటిస్టిక్స్ ఆఫ్ ఎ.పి. టి.బి.ఎస్.డి.ఎస్. ల ప్రకారం)

గత కొన్ని సంవత్సరాలుగా 10వ తరగతి ఉత్తీర్ణులవుతున్న విద్యార్థుల శాతంలో మొదటి పది జిల్లాలలో ఏడు జిల్లాలు తెలంగాణలోవి కాగా ఆఖరి ఏడు జిల్లాలు కోస్తాలోనివి.

ఇంజనీరింగ్, మెడికల్, బి.ఇడి. లాంటి వృత్తి విద్యా సీట్లలో యాభై శాతం తెలంగాణలోనే ఎక్కువగా ఉన్నాయి. అనేకం రాజధాని హైదరాబాద్ ప్రాంతంలో ఉండగా వాటిలో 15 శాతం మెరిట్ పేరిట, 85 శాతం కేవలం తెలంగాణ వారికే ఇస్తున్నారు. మొత్తంలో 7.8 శాతం కూడా తీరాంధ్ర, సీమవాసులకి సీటు దక్కడం లేదు. ఎంతకాలం విద్యార్థులకి రాజధానిలో ఈ రెండవ తరగతి జీవితాలు? అనేక వృత్తి విద్యలు, కంప్యూటర్ కోర్సులు అన్నింటా తీరాంధ్ర, రాయలసీమలకు కళ్లెదురుగా జరుగుతున్న అన్యాయం కనపడుతుంటే తెలుసుకోలేనివారు ఇంకెంతకాలం దగాపడాలి?

కోస్తాలోని దళిత బలహీనవర్గాల వారు చదువులో ముందుండడం వల్ల తెలంగాణలోని అన్ని అవకాశాలు కాజేశారని కొందరు ఆరోపిస్తున్నారు. కొన్ని ఉద్యోగాలు ఇంతకు ముందే చెప్పినట్టు ఎక్కువ వచ్చిన మాట వాస్తవమే. కాని దళిత, బలహీనవర్గాలలో తెలంగాణలోని 'నీ కాల్మొక్కుతా బాంచెన్ దొర' అనే సంస్కృతి పోవడానికి తెలంగాణ దళితులు అమోఘమైన ఉద్యమం చేశారు. చేస్తున్నారు. వారికి అనేక విధాలుగా కోస్తా దళిత, బలహీన వర్గాలవారు అందించిన సహకారం మరువలేనిది.

పెద్దదైన అవిభక్త హైదరాబాద్ రాష్ట్రం 1954-55 బడ్జెట్ ప్లాన్ పరిశీలిస్తే దళితులకు కేటాయించిన నిధులకంటే ఆనాటి చిన్నదైన ఆంధ్ర రాష్ట్రం కేటాయించిన నిధులు దాదాపు 7 రెట్లు ఎక్కువ. ఒకనాడు నిజాం హైదరాబాద్ రాష్ట్రంలో దళితులకు ప్రత్యేక వసతి గృహాలే ఉండేవి కావు. ముఖ్యంగా తెలంగాణలో బలహీనవర్గాల పట్ల గుదిబండగా మారిన పటేల్, పట్వారీ వ్యవస్థని రూపుమాపింది, ఫ్యూడల్ వ్యవస్థకి ప్రతీకగా ఉన్న సమితులు మార్చి మండల్ వ్యవస్థని ఏర్పరిచిన ముఖ్యమంత్రులు ఏ ప్రాంతవాసులో ప్రత్యేకంగా చెప్పవలసిన అవసరం లేదు.

- జి.డి.పి. పెరుగుదల రేటు తెలంగాణలో 6.02, కోస్తాలో 4.97, రాయలసీమలో 4.8 శాతం ఉంది.
- హైకోర్టులో దాదాపు 60 శాతం కేసులు కోస్తా నుంచి ఉన్నా,

ఆనాడే హైకోర్టును త్యాగం చేసిన గుంటూరులో కనీసం ఒక బెంచ్ అయినా పెట్టమని దశాబ్దాలుగా పోరాడి అలసి సొలసిన ప్రజలు ఇప్పటికైనా తమకు జరిగిన దగాను గుర్తిస్తారా?

- రాష్ట్రానికి విదిల్చిన కొద్ది నిధులతో కొత్త రైల్వే లైన్లు, స్టేషన్లు అన్ని ఎక్కువ తెలంగాణలోనే పెడుతున్నారు. హర్షించాల్సిందే. కానీ, తీరాంధ్ర, సీమకు యాభై సంవత్సరాలు కేవలం ప్రకటనలతో సరిపుచ్చుతూ చేసే మోసం ఇంకా ఎన్నాళ్లు సహించాలి?
- పర్యాటక రంగంలో నిధులన్నీ దాదాపుగా తెలంగాణలో ఖర్చు పెడుతూ కోస్తాని దారుణంగా నిర్లక్ష్యం చేసారు. ఉదాహరణకి కుతుబ్‌షాహీ గారి నాట్యకత్తె, నాట్యశాలలపై (తారామతి - ప్రేమావతి) కోట్ల రూపాయల ఖర్చు పెట్టి కోస్తాలోని అద్భుతమైన కోటలనూ, మాన్యుమెంట్స్‌ను శిథిలం చేసారు.

అయితే తెలంగాణ ప్రాంత మేధావులు చేస్తున్న ఆరోపణలలో వాస్తవం ఏమీ లేదనుకుంటే అంతకంటే అవివేకం మరొకటి ఉండదు. బూర్గుల రామకృష్ణారావు ప్రాధాన్యత విషయంలో, అంతెందుకు తరువాత పి.వి. నరసింహారావు గారికి ఢిల్లీ పాలకుల నుంచి హైదరాబాద్ వరకూ జరిగిన అవమానాలు, యాసపై అపహాస్యం (గోదావరి, ఉత్తరాంధ్ర యాసతో సహా) కళ్లెదుటే కనబడుతున్నాయి.

అలాగే ఎయిడెడ్ కళాశాలల విషయంలో, ఉద్యోగాల విషయంలో 1956-79 వరకూ, ఓపెన్ కోటాలో నాన్‌లోకల్ విషయంలో, రాష్ట్రం విడిపోయే ముందు పైన కట్టాల్సిన ప్రాజెక్టులపై అవగాహన లేకుండా ఉన్న నాయకుల వల్ల నీరు రాక మహబూబ్‌నగర్ ఇతర జిల్లాలకు, ఇలాగే కొన్ని విషయాలలో అన్యాయం జరిగిన మాట వాస్తవమే. కాని, ఈ అన్యాయాలలో తెలంగాణ ప్రాంతం నుంచి ఎన్నికైన ప్రజా ప్రతినిధుల పాత్రే ఎక్కువగా లేదని ఎవరైనా అనగలరా? వారు ఆ రోజే పదవులను తృణప్రాయంగా చూసి ఉద్యమిస్తే సాధించుకునేవారు కాదా? ఇదే విధంగా తీరాంధ్ర, రాయలసీమ ప్రజలు కూడా తమ తమ రాజకీయ నాయకులని నిలదీస్తే ఎప్పుడో తమ ఆకాంక్షలను సాధించుకుని నిజమైన అభివృద్ధిని సాధించుకునేవారు.

ఈ రోజు పదిహేను కోట్ల మంది ఉన్న తెలుగుజాతికి ఉన్న ఒక్క రాష్ట్రమైనా గట్టిగా ఒకటిగా ఉండాలని అనేక మంది భావిస్తున్నారు. కాని అత్యధికంగా కోస్తా, రాయలసీమ ప్రజలు విడిపోవడానికి ఈ కింది అభ్యంతరాలు కొంత కాల పరిమితి పెట్టుకుని పరిష్కరిస్తే హర్షాతిరేకాలతో ఆమోదం తెలుపుతారు. అందులో ముఖ్యమైనవి నీటి పారుదల, హైదరాబాద్, యువతకి విద్య, ఉపాధి, మౌలిక సదుపాయాలు, తెలుగు భాష (తెలుగు వారందరికి సంబంధించినది) మొదలైనవి.

1. నీటి పారుదల సమస్య పరిష్కారానికి ప్రతిపాదన : ముందుగా పోలవరం లాంటి ప్రాజెక్టుల లిటిగేషన్ పరిష్కరించి జాతీయ ప్రాజెక్టులుగా వాటిని ప్రకటించి అంతరాష్ట్ర నదుల నీటిని రాష్ట్ర సబ్జెక్ట్ నుంచి కేంద్ర సబ్జెక్ట్‌కి మార్చి నీటిపారుదలపై చట్టబద్ధమైన, ప్రాజెక్టులవారి కచ్చితమైన విధానాన్ని ప్రకటించాలి.

2. హైదరాబాద్ - రాజధాని : తెలంగాణ రాష్ట్రం ఏర్పడినప్పుడు అరచేతిలో నాయకులు చూపించిన స్వర్గం వాస్తవం కానప్పుడు లక్షలాది ఉద్యోగాలు రానప్పుడు, అద్భుతమైన ఉపాధి దొరకనప్పుడు, నీటి కేటాయింపులు - విడుదలప్పుడు పరిస్థితి ఉద్రిక్తంగా మారుతుంది.

రాష్ట్రం విడిపోక ముందే పెంచబడిన విద్వేష భావం, విభజన జరిగినప్పుడు, హ్రస్వ దృష్టి ఉన్న నాయకులకు ప్రస్తుతం కొరతలేనప్పుడు కచ్చితంగా మున్ముందు ఇబ్బందులు తప్పవు. హైదరాబాద్‌లో పిడికెడు (100) ఉండేవారి కోసం కాక మిగతా స్థిరపడిన 34,99,900 మంది ఎంత అభద్రతా భావంతో ఉన్నారో, వారిలో సమైక్యత అధికులు ఎందుకు కోరుకుంటున్నారనే విషయాలను మిగతా వారు గ్రహించాలి.

అందువల్ల హైదరాబాద్ మహానగర ప్రాంతాన్ని దేశానికి రెండవ రాజధానిగా ప్రకటించి అక్కడ స్థిరబడిన ఇతరుల భద్రతకు ఆశ్వాసనలు ఇచ్చి, శాంతి భద్రతల విభాగాన్ని కేంద్ర ప్రభుత్వం తీసుకోవాలి (ఢిల్లీ ప్రాతిపదికన). కోస్తా, రాయలసీమ ప్రాంతాల రాజధానులకి లక్ష కోట్ల ప్యాకేజీలను ముందుగా కేంద్ర ప్రభుత్వం ఎస్క్రో అకౌంట్‌లలో వేయాలి.

హైదరాబాద్ మిగులు ఆదాయంలో కొంత భాగాన్ని కొంతకాలం వరకూ కొత్త రాజధానుల అభివృద్ధి కోసం ఇవ్వాలి. కొత్త రాజధానులు ఏర్పడి, ఒక్కో విభాగాన్ని నెమ్మదిగా తరలించేంత వరకూ (కొంత కాల పరిమితి) హైదరాబాద్ ఉమ్మడి రాజధానిగా ఉండాలి.

3. కోస్తా, సీమ ప్రాంతాలలో ఐఐటిలు, ఇతర మంచి విద్యాలయాలు ఏర్పరచి, యువత ఉపాధికి ఇప్పటి నుంచే కేంద్ర ప్రభుత్వం ప్రత్యేకంగా సంస్థలు, పరిశ్రమలు ప్రారంభించాలి. భౌగోళికంగా చీలికగా ఉండే ప్రాంతం కాబట్టి పర్యావరణ అనుకూల రోడ్ / రైల్ కోస్టల్ కారిడార్ ఇతర మౌలిక సదుపాయాలు కల్పించాలి.

4. తెలుగు భాష అభివృద్ధికి అధికారిక సంస్థని ముందుగా ఏర్పరిచి, దానికి భాషా మంత్రిత్వ శాఖలు ఏర్పరిచి కచ్చితంగా బడ్జెట్ నుంచి 1 శాతం దానికి కేటాయించాలని, ఉద్యోగాలలో మొదటి ప్రాధాన్యత తెలుగు లేదా రాష్ట్రంలో ఉన్న మాతృభాషకే ఇవ్వాలని రాజ్యాంగబద్ధమైన నిబంధన లాంటివి పొందుపరిస్తే రెండు రాష్ట్రాలలోనే కాక ఇతర రాష్ట్రాలలో కూడా తెలుగు భాష వికసిస్తుంది.

ఈ ప్రాతిపదికలపై చర్చ జరిగి ఒక మధ్యే మార్గంగా అన్నింటిని పరిష్కరించుకోవచ్చు.

పైన రాసిన వ్యాసంలో నా అభిప్రాయాలే కాక ఇతర మేధావులు చెప్పిన ఆకాంక్షలను పొందుపరిచాను. 1969-71 వరకూ ఉన్న జై తెలంగాణ ఉద్యమంలో స్వతంత్ర పార్టీ తప్ప ఎవ్వరూ మద్దతు తెలపలేదు. మిగతా ప్రజలలో కూడా సమైక్య రాష్ట్ర భావన ఉండేది. కానీ నేడు తెలంగాణ ప్రాంతం ఓకల్ సెక్షన్ ప్రజలలో అత్యధికులు ప్రత్యేక రాష్ట్రం కావాలని కోరుతున్నారనేది మిగతా ప్రజలు కూడా గమనించాలి. తెలంగాణపై నిబద్ధతతో పోరాడుతున్న కొన్ని తాడిత పీడిత పక్షపాత పక్షాలు, మేధావులు, కోస్తా, రాయలసీమ ప్రజలనేమీ దూషించలేదని కేవలం కొందరు రాజకీయ నాయకులు, కొందరు మేధావులు మాత్రం స్వార్థంతో ప్రజల మధ్యన చిచ్చుపెట్టేట్టు చేస్తున్నారని గమనించాలని కోరుతున్నాను.

అయితే తోటి తెలుగువారిని దొంగలు, ద్రోహులుగా ముద్ర వేసి వెళ్లగొట్టడానికి ఎవ్వరూ చూడకూడదని, అసలు తెలంగాణ ప్రజలు వెనుకబాట పట్టడానికి కారణమెవ్వరు అనే విషయాలు ముందుగా తెలుసుకోవాలని ఇతర ప్రజలు కోరడం తప్పేమీ కాదు. ఎవ్వరు విడిపోయినా సోదరులిద్దరూ సంపూర్ణ హక్కులతో, ఆత్మగౌరవంతో వేరుపడి ఉన్నతమైన జీవితం సాగించాలని ఆశిస్తున్నాను. రాష్ట్రాలు వేరైనా తెలంగాణ, తీరాంధ్ర, రాయలసీమ రాష్ట్రాలలో కూడా ప్రస్తుతం వక్రమార్గాన పడుతున్న పెట్టుబడిదారీ వ్యవస్థకు అనుగుణంగా నడుచుకునే నాయకులు ఉన్నంత వరకూ కూడా బడుగు ప్రజల ఆకాంక్షలు పోరాడి సాధించుకోవాలని ఉంటుందనే అభిప్రాయ పడుతున్నాను.

ఏది ఏమైనా ఆంధ్రప్రదేశ్‌లో భౌగోళిక విభజన జరిగినా తప్పు లేదని, తెలుగు ప్రజలందరూ మానసికంగా ఒక్కటిగానే ఉండాలని, ఎవ్వరికి, ఎప్పుడు సమస్యలు వచ్చినా మరొకరు తోడుగా ఉండి కేంద్రంతోనో, ఇతర రాష్ట్రాలతోనో పోరాడి సమస్యలు పరిష్కరించుకునే విధంగా అవగాహన పెరగాలని ఆశిస్తున్నాను. వీ

**వలసవాద అభివృద్ధి నమూనా, దానికి కొనసాగింపుగా కోస్తాంధ్ర అభివృద్ధి నమూనాల మధ్య పడి అస్తిత్వాన్ని కోల్పోయిన రాయలసీమ, తన అస్తిత్వం కోసమే కాదు, ప్రజావిముక్తి దిశగా ఉద్యమించాల్సిన అవసరాన్ని గుర్తుచేస్తున్నారు పాణి**

# రాయలసీమ అస్తిత్వాన్ని గుర్తించాలి

రాయలసీమ సమస్యల పట్ల అడపాదడపా ఆందోళనలు జరిగినా వాటికొక ఉద్యమ ప్రతిపత్తి దొరకలేదు. అవి ప్రజలను ప్రభావితం చేయకపోవడం వల్ల చాలా చిన్న స్థాయిలోనే ఉండిపోయాయి. జాతీయోద్యమంలో భాగంగా జరిగిన ఆంధ్ర రాష్ట్రోద్యమంలో కాంగ్రెస్ వాదులు సీమ సమస్యలపై తొలి స్వరం వినిపించారు. ఆ తర్వాత మళ్లీ 1980లలో రాయలసీమ విమోచనోద్యమం వచ్చింది. దానిలో కాంగ్రెస్ భాగస్వామ్యం వహించింది. అదే సమయంలో విప్లవ శక్తులు సీమ సమస్యల మీద విద్యార్థి యువజన ఉద్యమాన్ని నిర్మించాయి. అట్టడుగు స్థాయి నుంచి నిర్మాణ రూపాన్నివ్వాలని విప్లవకారులు ప్రయత్నించారు. బహుశా సీమ సమస్యలపై కమ్యూనిస్టు శిబిరం నుండి తొలి స్పందన అది. ఆ తర్వాత సాయుధ ముఠాల వ్యతిరేక ఉద్యమం, సీమలో మూతబడ్డ పరిశ్రమల సమస్యలపై ఆందోళన, కరువు, ఫ్యాక్షనిజం – కోస్తాంధ్ర పాలకుల వివక్ష అనే మూడు అంశాలు కేంద్రంగా రాయలసీమ ప్రజాసమితి చేసిన ఉద్యమం కూడా సీమలో విప్లవశక్తుల చొరవతో సాగినదే. ఆ కాలమంతా పాలక పార్టీల నుండి సీమ సమస్యలపై కనీస స్పందన లేదు.

కాంగ్రెస్ పార్టీ దగ్గర నుండి విప్లవకారుల దాకా చేసిన ఈ ప్రయత్నాలేవీ ఉద్యమ రూపాన్ని సంతరించుకోకపోయినా 1980లలోని ప్రయత్నం వల్ల బూర్జువా శక్తులకు మంచి ప్రచారమైతే దక్కింది. ఉద్యమ ఫలితాలు అనే మాట అనేక పొరల్లో పలు అర్థాలు పలుకుతుంది. ఆనాటి ఉద్యమానికి కేంద్రం నదీజలాల్లో రాయలసీమకు రావలసిన నీటి వాటా. కానీ ఆ ఉద్యమం అర్థాంతరంగా ముగిసిపోయింది. ఇప్పుడు దాన్ని సమీక్షించనవసరం లేదు. నీటి వాటాలో, పారిశ్రామిక, విద్యా, ఉద్యోగ రంగాల్లో నికరంగా ఒనగూడిన ప్రయోజనాలేవీ లేకపోయినా హంద్రీనీవా, గాలేరు, నగరి ప్రాజెక్టులు పదే పదే శంకుస్థాపనలకు నోచుకొని నేటికి 'సాగు'తూనే ఉన్నాయి. నిజానికి ఇవి కృష్ణా మిగులు జలాలపై ఆధారపడినవి.

ఈ ఉద్యమాల వల్ల పరోక్షంగా రెండు ప్రయోజనాలు కలిగాయని చెప్పుకోవచ్చు. ఆనాటి సంచలనం సీమ చరిత్రలో విడదీయరాని భాగమైంది. సాహిత్యంలో, ఆలోచనా రంగంలో దాని ప్రభావం నిలిచే ఉన్నది. ఇది సీమ ప్రజలకు కలిగిన ప్రయోజనం. అంతకంటే సీమ బూర్జువా వర్గం పొందిన ప్రయోజనం పెద్దది. అది ఆనాటి యువ నాయకత్వానికి గొప్ప రాజకీయ జీవితాన్నిచ్చింది. ఆ ఉద్యమం వల్లే రాజకీయాల్లో నిలదొక్కుకొని, ప్రజా ప్రతినిధులుగా, మంత్రులుగా, ముఖ్యమంత్రులుగా సీమ రాజకీయ రంగాన్నే గాక, రాష్ట్ర రాజకీయ చక్రాన్ని తిప్పే స్థాయికి చాలామంది ఎదిగారు. ఇప్పటి రాజకీయ చిత్రపటంలోని హేమాహేమీలందరూ అక్కడి నుండి వచ్చినవారే.

రాయలసీమ ప్రాంతీయ సమస్యలపై జరిగిన ఆందోళనల్లో బూర్జువా శక్తులకు తప్ప విప్లవ ప్రజాస్వామిక శక్తులకు తగిన గుర్తింపు రాకపోవడం, అసలు సీమ ప్రాంతీయ ఆందోళనలన్నీ చాలా చిన్న ప్రయత్నాలుగానే మిగిలిపోవడం, ఆ మేరకైనా అవి సమాజ జీవితంలో నిత్య సంభాషణా విషయాలు కాజాలకపోవడం, బూర్జువా శక్తులకు గొప్ప రాజకీయ భవిష్యత్తును ప్రసాదించే వనరుగానే మిగిలిపోవడం అనే ప్రత్యేకతలకు కారణాలు వెతకాల్సి ఉంది.

సీమ సామాజిక అంతర్నిర్మాణంలోని ప్రత్యేకతల దగ్గర ఈ అన్వేషణ ప్రారంభించాలి. రాయలసీమ గ్రామీణ ప్రాంతాల్లో ఆధునికతా ప్రవేశం చాలా సంక్లిష్ట మార్గాన్ని తీసుకున్నది. ఆధునికతలోని అత్యంత మౌలిక విషయమైన వ్యక్తి గుర్తింపు అనేది సీమలో చాలా తక్కువ. లేదా మిగతా తెలుగు సమాజానికంటే వికృతంగా రూపొందింది. ఫ్యాక్షన్ సంస్కృతి వల్ల ముఠాతత్వం తప్ప ప్రజాస్వామిక ఆవరణ ఏర్పడలేదు. మూకతత్వం తప్ప వ్యక్తి స్వేచ్ఛ, హక్కులు నిలదొక్కుకోడానికి అనుగుణమైన మార్పులు వ్యవస్థలో జరగలేదు. సీమలో పౌర స్పృహ అనేదే పెద్దగా ఏర్పడలేదు. మూకతత్వం ఆధునిక పూర్వ వ్యవస్థలోని సామాజిక సంస్కృతి. ఇది ఎందుకు మిగిలి ఉన్నదనేది చాలా లోతయిన సామాజిక ప్రశ్న.

తెలుగుజాతిలోని రాయలసీమ ప్రాంతీయ అస్తిత్వంలో, ప్రత్యేకత్వంలో ఇది కీలకమైనది. వెనుకబాటుతనం అనే దానికి పలు కొలమానాలుంటాయి. రాయలసీమ సమాజ గర్భంలోనే చారిత్రకంగా ఫ్యాక్షనిజం లేదా మూకతత్వం రూపంలో వెనుకబాటుతనం ఉన్నది. లోపలి నుండి కాని, బైటి నుండి గాని దాన్ని సమూలంగా తుడిచేసే ప్రకంపనలేవి తలెత్తలేదు. అట్లని తెలుగు సినిమాల్లో చూపినట్లు రాయలసీమ అటవిక సమాజం కాదు. పట్టు సడలని భూస్వామ్య సమాజం కాదు. అందువల్ల సామాజిక స్వభావ విశ్లేషణలో రాయలసీమ చాలా అరుదైన సవాళ్లను విసురుతోంది. మామూలుగానైతే సారంలో ఏ మార్పు లేకుండా రూపంలో అనూహ్య మార్పులకు గురైందనే విశ్లేషణ ఇవ్వవచ్చు. కాని అది సరిపోదు, సరికాదు. ఆ రెండింటి మధ్య – ఒకటి ఏ మాత్రంగా మారకుండా, ఇంకోటి అంతగా మారిపోయేలాగా ఆ సంబంధం ఉండదు. సారంలో గుర్తించవలసిన మార్పులు జరిగినా మూకతత్వం లాంటి ఆధునిక పూర్వ లక్షణాలు మాత్రం మిగిలే ఉన్నాయి.

ఇది రాయలసీమ పల్లె సీమల్లోని తాజా పరిణామాలను తాజా దృష్టితో సూక్ష్మంగా చూస్తే అర్థమవుతుంది. ఈ పరిణామాలు సీమ అంతటా ఒకేలా లేవు. అసలు నాలుగు జిల్లాల మధ్య సారూప్యత కూడా ఉన్నది కాని దాని కోసం వెతికితే ఒక్కో జిల్లాకు ఒక్కో ప్రత్యేకత కనిపిస్తుంది. అంటే రాయలసీమ మొత్తాన్ని కలిపే ఆర్థిక, సాంఘిక,

సాంస్కృతిక కైవారం చాలా బలహీనమైంది. ఇంకా సూక్ష్మస్థాయిలోకి వెళితే ఒక జిల్లాలోనే కనీసం రెండు మూడు ప్రత్యేకతలు కనిపిస్తాయి. ఆ మాత్రం తేడాలు ఏ ప్రాంతంలోనైనా ఉండేవే అనవచ్చు. కానీ వాటికి రాయలసీమలో మిగితా చోట్ల కంటే ఎక్కువ ప్రాధాన్యత ఉంది. ఎంతగానంటే ఒక రాయలసీమ గురించి ఆలోచించబోతే పలు రాయలసీమలు పరస్పర విభిన్నంగా, విరుద్ధంగా పోటీపడతాయి.

బహుశా రాయలసీమ అనబడే ప్రాంతం మొత్తానికి ఒక బలమైన అస్తిత్వం వ్యక్తమై, వ్యవహారంలో భాగమై ఉంటే ఈ ఉప వైవిధ్యాల గురించి పట్టింపు ఉండేది కాదు. అట్లని సీమకు తనదని చెప్పుకోదగిన అస్తిత్వం లేదనలేం. నాలుగు జిల్లాలకు ఒక సాధారణ చరిత్ర, సాంస్కృతిక వారసత్వం, ఉమ్మడి జీవితం ఉన్నాయి. విషాదకరంగా ఫ్యాక్షనిజం, కరువు మాత్రమే సాధారణాంశాలుగా ప్రచారంలో ఉన్నాయి. సీమ వాసులు తమ గురించి తాము ఇట్లాగే అనుకోవడం, బైటి వాళ్లూ అట్లాగే గుర్తించడం బాధాకరమైన అంశం. ఈ ఉమ్మడి లేదా ఏక అస్తిత్వాన్ని వెలికి తీయవలసి ఉంది. నిర్మించవలసి ఉంది. దాని గురించి తర్వాత చూద్దాం.

దాన్ని సాధించాలన్నా అంతర్గతంగా ఉన్న అనేక తేడాలను పట్టించుకోవలసిందే. ఉదాహరణకు కర్నూలు జిల్లాలోనే మూడు ప్రత్యేకతలు కనిపిస్తాయి. నందికొట్కూరు, నంద్యాల లాంటి ప్రాంత్లోని నీటిపారుదల సౌకర్యం రీత్యా ఫ్యాక్షనిజంతో సహా అక్కడి సామాజిక జీవితం ఒక విధంగా ఉంటుంది. అక్కడ ఇప్పటికీ వ్యవసాయ ఆర్థిక వ్యవస్థ ప్రధానంగా ఉంటుంది. ఆ ప్రాంతంలోని పెత్తందారులు అటవి సంపదను కొల్లగొట్టి, కాంట్రాక్టర్ల దగ్గర లెవీలు వసూలు చేసి, సారా వ్యాపారం చేసి సంపద పోగేసుకున్నా ఎక్కువగా ప్రజా జీవితం వ్యవసాయంతో మనగలగడం వాస్తవం. అందువల్లే ఆ ప్రాంతానికి చెందిన రాజకీయ నాయకులకు రైతు నాయకుల ముఖం కూడా ఉంది. బైరెడ్డి రాజశేఖరరెడ్డి, ఎస్.పి.వై. రెడ్డిలాంటి వాళ్లు నీటి సమస్య గురించి, రైతాంగ సమస్యల గురించి మాట్లాడవలసి వస్తుంటుంది.

ఆ ప్రాంత ఆయకట్టుదారులంతా ఆ పార్టీల, వ్యక్తుల అనుచరులు కావడం, స్థానిక సంస్థల్లో వారే నాయకులు కావడం యాదృచ్ఛికం కాదు. వ్యవసాయాధారిత రాజకీయార్థిక వ్యవస్థ ఉన్నందు వల్లనే ఈ ప్రత్యేకత. డోన్ దగ్గరి నుంచి కొలిమిగుండ్ల వరకు గని ఆర్థికం ప్రధానం. ఆ ప్రాంత రాజకీయ నాయకులకు సారా లాంటి ఇతర ఆదాయ మార్గాలున్నా గనుల నుండి కోట్లు గడించడం, అసంఖ్యాక ప్రజలు గనుల్లో కూలీలుగా బతుకెళ్లదీయడం అక్కడి ప్రత్యేకత. దీనికి మంచి ఉదాహరణ కె.ఇ. సామ్రాజ్యం. అది పక్క రాష్ట్రాలకు విస్తరించినా, సారా సంపాదన ఉన్నా సంపద ఉన్నా గనులు మీద వారి ఆర్థిక వ్యవహారాలు ప్రధానమయ్యాక వారి కుటుంబ రాజకీయ పాత్రల్లో మార్పులు వచ్చాయి. ప్రజా జీవితం కూడా ఆ మేరకు భిన్నంగా ఉంటుంది.

ఇక మూడవది కోడుమూరు దాటాక పత్తికొండ, ఆలూరు మొదలైన ప్రాంతాల్లోని కరువు ఆర్థిక వ్యవస్థ, పూర్తిగా వర్షాధార మెట్ట వ్యవసాయం, ఏ మాత్రం లాభసాటి గాని సేద్య ప్రాంతమది. జనవరి నుండే ఊళ్లకు ఊళ్లు ఖాళీ అయిపోతాయి. తక్కువ వర్షపాతంతో స్వల్ప కాలంలోనే పండే టమోటా వారి జీవితాలతో అనూహ్యంగా ఆడుకుంటుంది. అక్కడి ఫ్యాక్షనిజం ఎంత క్రూరంగా ఉండేదీ, అంటరానితనం ఎట్లా ఉండేదీ ప్రత్యేకంగా చెప్పుకోనవసరం లేదు.

ఇట్లా రాయలసీమ మిగతా జిల్లాల్లో కూడా ఉండొచ్చు. అనంతపురమంతా స్వల్ప వర్షపాతంతో అరగొర పంటలు, కరువు, వలసలు ప్రధానంగా ఉన్నా గనులు – వాటి మీద ఆదాయం ప్రధానంగా ఉన్న ప్రాంతాలు కూడా ఉంటాయి. ఈ ప్రత్యేకతల వల్ల సీమ ప్రజలకు జీవన్మరణ పోరాటమే సరిపోతుంది. ఆధునిక జీవితానికి పునాది అయిన పౌరస్పృహ, హక్కుల స్పృహ వాళ్ల అనుభవంలోకి రావడం కష్టం. అయితే ఇక్కడా వర్గాలున్నాయని, వర్గమూలాల వల్ల ఇంత దుర్భర స్థితిలో సైతం, ఇంత వైవిధ్యంలో సైతం ఆధిపత్య వర్గాల దోపిడీ సాగుతున్నదనీ మర్చిపోవడానికి లేదు. అంతకు మించి ఆధిపత్య వర్గాల స్వభావంలో మార్పు వస్తున్నదనీ, మొత్తంగా సమాజ సంబంధాల్లో, వ్యవస్థల సంబంధంలో గుర్తించవలసిన మార్పులు (వీటిలో కూడా చాలా తేడాలున్నాయి. ఎంతగానంటే ఏమరపాటయితే వీటిని సాధారణీకరించడం సాధ్యం కూడా కాదు) వస్తున్నాయి.

ఈ మార్పులు ఒక పక్క సాగుతున్నా ఆధునిక స్పృహకు, హక్కుల చైతన్యానికి సీమలో సామాజికంగానే అవరోధాలూ ఉన్నాయి. ఈ విచిత్రమైన స్థితే రాయలసీమ సామాజిక అన్వేషణలో చాలా జటిలమైన, కొత్త సవాళ్లను విసురుతోంది. వాస్తవికతలోని ఏ చిన్న అంశాన్నీ విస్మరించకుండా రాయలసీమ చారిత్రక గతిని వివరించడం ఇవాళ చాలా గంభీరమైన బాధ్యత.

అయితే ఇలాంటి పనులేవైనా ప్రజా సంచలనాల వెలుగు లేకుండా, ఉత్తేజం లేకుండా శుద్ధ సిద్ధాంత వ్యవహారంగా సాగడం కష్టం. ఒక్కోసారి అలాంటి కృషి కూడా చేయవలసి రావచ్చు. దాని ప్రయోజనం దానికి ఉండొచ్చు. అయితే రాజకీయ కార్యాచరణ పురికొల్పినప్పుడు అందులో ఒకరకమైన ప్రభావ గుణం ఉంటుంది.

కాని రాయలసీమలో రాజకీయ ప్రపంచం చాలా బలహీనం, అందులో ప్రజల భాగస్వామ్యం మరీ తక్కువ. ఆధునిక రాజకీయ, పాలనా వ్యవస్థలు ఒకప్పటితో పోల్చితే మారుమూల ప్రాంతాల్లో కూడా స్థిరపడ్డాయి. వాటి ప్రక్రియలు అమలవుతున్నాయి. పాత రోజుల్లోలాగా పాలెగాళ్ల రీతిరివాజులే రాజ్యమేలడం లేదు. అట్లని సాంతం తుడిచిపెట్టుకపోయాయని కాదు. అలాంటి ప్రాంతాలు తగ్గుతున్నాయి. ఉన్న చోట కూడా బలహీనపడుతున్నాయి. పాతవే కొత్త రూపంలో, కొత్త పరిస్థితుల్లో కొనసాగుతున్నాయి. వీటి మధ్యనే కొత్త వ్యవస్థలు, కొత్త క్రమాలూ రంగం మీదికి వచ్చాయి. అవి భవిష్యత్తులో బలపడేవనీ, పాతవి ఎంత ఉన్నా కేవలం మిగిలి ఉండేవేనని అర్థం చేసుకోవడం కష్టం కాదు. పాతవి తుడిచిపెట్టుకపోవడానికి సమాజంలో ఒక మౌలిక సంఘర్షణ ఏదీ జరగలేదు. అయితే అలాంటివి జరిగితేనే కొత్తది వస్తుందని, లేకుంటే లేదని అనలేం.

రాయలసీమలో పాతది అంతరించిపోవడానికి, కొత్త సంబంధాలు ప్రాబల్యంలోకి వస్తున్నాయనడానికి వాస్తవ జీవితాన్ని, పరిణామాలను వాస్తవికంగా చూస్తే సరిపోతుంది. అయితే వీటిని సిద్ధాంతపరంగా వివరించడం మన ముందున్న సవాలు. వ్యవసాయాధారిత సమాజంలో ఇలాంటి పరిణామాలను విశ్లేషించడంలో దానికదే కొన్ని చిక్కు సమస్యలను తెచ్చిపెడుతుంది. అయితే సువిశాల ప్రజానీకం వ్యవసాయం మీద ఆధారపడి ఉండడం వాస్తవం. దీనిలోని మార్పులను సమాజమనే మొత్తంలో భాగంగా చూడాల్సింది. ఇతర వ్యవస్థలతో నిమిత్తం లేని విడి అంశంగా వ్యవసాయాన్ని చూడడం పరిశీలనా వ్యూహ సౌలభ్యం అయితే ఫర్వాలేదు గాని అదే సర్వస్వం కారాదు.

రాయలసీమలోనైనా, మరెక్కడైనా ఉత్పత్తి సంబంధాల్లో మార్పుకు సుదీర్ఘకాలం పడుతుంది. అవి ఒక గుణాత్మక దశకు చేరుకున్నాక ఉత్పత్తి శక్తులతో తలెత్తే వైరుధ్యం రాజకీయ తలంలో ప్రస్ఫుటమవుతుంది. కాబట్టి

రాజకీయరంగంలో మౌలిక పరివర్తనను గుర్తించినంత నిర్దిష్టంగా (అది రాత్రికి రాత్రి బద్దలైపోయే ఘటన కాదు) ఉత్పత్తి సంబంధాల్లో మార్పు ఎప్పటి నుంచి, ఎట్లా ఎలా మొదలైందీ చెప్పడం కష్టం. ఆధునిక రాయలసీమ పరిణామం సరిగ్గా అట్లాగే జరిగింది. మన్రో రైత్వారీ పద్ధతి చేపట్టి, వ్యక్తి పేరు మీద భూమిని గుర్తించే ఆధునిక పద్ధతి మొదలైనప్పటి నుంచి ఇప్పటి వరకు జరిగిన మార్పులన్నీ ఉత్పత్తి సంబంధాల్లో చాలా మెల్లగా జరిగిపోయినవే. ఎక్కడా తీవ్రరూపం ధరించి ఉత్పత్తి శక్తులతో వైరుధ్యం తెచ్చుకోలేదు. ఇది రాయలసీమ భౌతిక పునాదిలో జరిగిన వాస్తవిక పరివర్తన.

దీన్నుంచి రాయలసీమ చరిత్రను ఎలా చూడాలి? ఇప్పటికే స్థిరపడిపోయిన భావనలను, నిర్ధారణలను విమర్శనాత్మకంగా చూడకపోతే జరిగే నష్టం ఏమిటి? అనే ప్రశ్నలు తలెత్తుతాయి. మరీ పాత చరిత్ర సంగతి అలా ఉంచినా, వలస పాలనతో ఆధునిక రాయలసీమ చరిత్ర అనబడేది ప్రారంభమైంది. బ్రిటిష్ అధీనంలోకి వచ్చిన తెలుగు ప్రాంతంలో రైత్వారీ పద్ధతి మొదట అమలయింది రాయలసీమలోనే. ప్రజలకు – భూమికి – అధికార వ్యవస్థలకు మధ్య అప్పటిదాకా ఉన్న సంబంధాల కంటే ఇది చాలా భిన్నమైంది, కొత్తది. నేరుగా ప్రజలతో రాజ్యానికి సంబంధం ఏర్పడాలని, మధ్యంతర వ్యవస్థలను రద్దు చేయాలనే ఉద్దేశ్యాలు అందులో ఉన్నాయి. ఈ రెండూ ఎట్లా జరిగాయి? ఏమేరకు జరిగాయి? వాటి పర్యవసానాలు ఏ ఫలితాలకు దారితీశాయి? అనేవి ముఖ్యం.

రైత్వారీ విధానం ఒక చేత్తో, పాలెగాళ్ల నిర్మూలన ఒక చేత్తో వలసవాదం రాయలసీమలో ప్రారంభమైంది. సైనిక చర్య ద్వారా పాలెగాళ్ల వ్యవస్థను రద్దు చేయదలచుకున్నది. అనేకమంది పాలెగాళ్ల అధికారం తీసేసి, వాళ్లను కేవలం పింఛన్‌దార్లుగా మార్చేసింది. కొందరిని భౌతికంగా నిర్మూలించింది. అంటే వలసవాద ప్రవేశం ఒక సైనిక చర్యతో ప్రారంభమై పాలనా – ఆర్థిక సంస్కరణలుగా విస్తరించింది. కోస్తా ప్రాంతానికంటే రాయలసీమలో వలసవాదం కొన్ని తీవ్రమైన చర్యలతో తన అధికారాన్ని స్థాపించుకుందని చెప్పవచ్చు. వ్యక్తిని గుర్తించి, ప్రభుత్వం వ్యక్తితో లావాదేవీలు నిర్వహించడం అనే ఆధునిక రూపం మొదలైందని చెప్పవచ్చు. అయితే రైత్వారీ విధానానికి వర్షాధార స్థానిక సమాజం ఎంతవరకు అనుమతించింది? సమాజం మీద అదెంత ఒత్తిడి కలిగించింది? అనే వాటి గురించి ఇంకా తెలుసుకోవలసే ఉంది.

మామూలుగా ఇప్పటి ఫ్యాక్షనిజం గురించి మాట్లాడుతున్నప్పుడల్లా వీళ్ళు ఆనాటి పాలెగాళ్ల చారిత్రక వారసులనే మాట తరచూ వినిపిస్తుంటుంది. రాయలసీమల వెనుకబాటుతనానికి అంతర్గత కారణాలు వెతికేటప్పుడు ఎవరైనా ఇక్కడికి చేరుకుంటారు. ఈ వ్యాసం మొదట్లో చెప్పినట్లు మూకతత్వం అనే సమస్య ఉన్నప్పటికీ దానికి నేరుగా పాత పాలెగాళ్ల వ్యవస్థలో మూలాలు వెతకడం కష్టం. అసలు ఇప్పటికి తెలిసిన, రాతరూపంలో ఉన్న చరిత్ర ప్రకారమైతే మన్రోకాలంలో పాలెగాళ్ల గురించిన చారిత్రక ఘట్టం తర్వాత మళ్లీ 1940–50లలో గ్రామీణ ప్రాంతాల్లో అధికారం కోసం ఘర్షణలు, రక్తపాతం రూపంలో ఫ్యాక్షనిజం గురించిన ప్రస్తావన వస్తుంది. మధ్యలో దీనికి సంబంధించిన ఆధారాలేవీ కనిపించవు. సుమారు ఒకటిన్నర శతాబ్దం మధ్యలో ఉంది. దీన్ని దృష్టిలో పెట్టుకొని రాయలసీమ సామాజిక చరిత్రను కొంచెం భిన్నంగా చూడొచ్చు.

లేకపోతే రాజకీయ, సాంఘిక, సాంస్కృతిక వ్యవస్థలోని వేరెవరు స్థాయిల పరిణామాలు వివరించడం కష్టం. ఉత్పత్తి వ్యవస్థలోని దీర్ఘకాలావధి వైపు నుంచి వీటిని వివరించడం సాధ్యమే. పై వ్యవస్థలోని ప్రతి మార్పుకూ లేదా మార్పు రాకపోవడానికీ ఉత్పత్తి సంబంధాల్లో కారణాలు ఉంటాయి. అయితే ఉత్పత్తి వ్యవస్థలోని మార్పులు చప్పున గోచరం కాజాలవని, అవి ఇతర వ్యవస్థల్లో వ్యవస్థీకరింపబడతాయనీ, వ్యక్తమవుతాయనీ అనుకోవడం కొంచెం సృజనాత్మక పద్ధతి అవుతుంది. ఉదాహరణకు రాయలసీమలో ఇన్నేసి ఆధునిక పరిణామాలు కంటికి కనిపిస్తున్నా పాత పద్ధతులూ కొనసాగడం మనందరికీ తెలిసిందే. ఉత్పత్తి సంబంధాల్లో పాత అంత దీర్ఘకాల పరివర్తనలో సైతం సజీవంగానే ఉంటుంది. కానీ దానితో నేరుగా నిర్ణాయకం కాని నూతన వ్యవస్థలు కూడా ముందుకు వస్తాయి. రాయలసీమలో వలసపాలన కాలంలో అట్టడుగుతలంలోని ఉత్పత్తి సంబంధాల పరివర్తనా క్రమం, వలసపాలన వల్లనే స్థిరపడిన రాజకీయ పాలనా వ్యవస్థల పరివర్తనా క్రమం అనే రెండింటి గురించి ఆలోచించవలసి ఉంది.

ఈ రెండు వేర్వేరు క్రమాల క్లిష్టత వల్ల రాయలసీమ సాంఘిక వ్యవస్థను తరచి చూసే కొద్ది బేజారెత్తిపోతుంది. దీంట్లో ఏది ఆధునికతో, ఏది గతమో, అవి రెండూ కలిసే మనకు పరమ వికృతంగా కనిపిస్తున్న దాని సారమేమిటో తేల్చుకోవడం కష్టం. ఒక్కోసారి ఫక్తు తెలుగు సినిమా దృశ్యాలు ఈ ప్రాంత సాంఘిక జీవితంలో కనిపిస్తుంటాయి. కంటికి కనిపించే వాటినే కలర్‌ఫుల్‌గా చూపించే సినిమాల్లోకి అది యథాతథంగా రావడం, 'వైవిధ్యభరితమై' ఇతివృత్తంగా లాభాలు దండుకోవడమనే పెట్టుబడి దుగ్ధ సరే. అది సినిమా పెట్టుబడికి ఉండే లక్షణమే. ఇక్కడ చెప్పుకోవలసిందేమంటే – రాయలసీమ సాంఘిక వ్యవస్థ అలాంటి మిశ్రమ పదార్థం.

పాత రోజుల్లో అయితే ఆర్థిక వ్యవస్థ, సాంఘిక సాంస్కృతిక వ్యవస్థలు కలగాపులగంగా ఉండేవి. వలసపాలన వల్ల సంక్రమించిన ఆధునికత రాయలసీమలో వీటి మధ్య తేడా తీసుకొని వచ్చింది. (చాలా ప్రాంతాల్లో ఇదే జరిగింది). దీనికి మంచి ఉదాహరణ రాజకీయ వ్యవస్థ. అది పూర్తి ఆధునిక వ్యవస్థగా ఆధునిక ప్రక్రియలో, క్రమాల్లో ఇటీవల వేగం పుంజుకుంటుంది. కానీ అందులో ఆధునిక లక్షణాలు, పాత లక్షణాలు కలగలసి ఉన్నాయి. ఈ అర్థంలోనే ఈ ప్రాంత రాజకీయ వ్యవస్థ చాలా బలహీనమైందని మొట్టమొదట చెప్పాల్సి వచ్చింది. అంటే సమాజంలో బూర్జువా రాజకీయ వ్యవస్థ చేయగలిగిన పనులేవీ అది చేయలేదు. ఆ వ్యవస్థ ప్రతినిధుల వ్యవహార శైలి గమనించామంటే వారిని ఆ ప్రాంత రాజకీయ నాయకులుగా గుర్తించడమే కష్టం. రాజకీయ వ్యవస్థలో ప్రజల భాగస్వామ్యం కూడా మరీ తక్కువ.

ఉత్పత్తి సాధనాల మీద యాజమాన్యం ఉన్న వర్గం తనను తాను నిరంతరం కొత్త పద్ధతుల్లోకి మార్చుకుంటూ కొత్త పద్ధతుల్లో దోపిడీకి పాల్పడుతుంది. కొత్త ఆదాయ మార్గాలను ఆశ్రయించిందని గుర్తించడం కష్టమేమీ కాదు. ఈ సంపద భూస్వామ్య సంపదగానే మిగిలిపోవడం లేదు. తిరిగి పెట్టుబడిగా మారుతున్నది. (సీమలోని ప్రతి ముఠా నాయకుడి వ్యవహారం ఆధారంగా దీన్ని వివరించవచ్చు). పందొమ్మిదో శతాబ్దిలోని పెట్టుబడి రూపంగా ఇది పరివర్తన చెందకపోవచ్చు. ప్రపంచ వ్యాప్తంగానే పెట్టుబడి స్వభావంలో వచ్చిన మార్పులకు అనుగుణంగానే సీమ పెట్టుబడి వ్యవహరిస్తోంది. ఆ విషయంలోనే కోస్తా – రాయలసీమల్లో కొంచెం తేడా ఉంటే ఉండొచ్చు గాని 'సీమాంధ్ర' అనే రాజకీయ 'ఆందోళన' వెనుక ఈ పెట్టుబడి స్వభావం, ప్రయోజనం ఇరు ప్రాంతాల్లో సాధారణాంశం. రాయలసీమ నాయకులు పాతకాలపు భూస్వాములే అయితే కోస్తా పెట్టుబడిదారులతో ఇంత నెయ్యం కుదిరేదా? అనే సందేహం కలుగుతుంది.

(ఇంకా ఉంది)

*తగిన వనరులు, సరైన నాయకత్వం ఉన్నప్పడే చిన్న రాష్ట్రాలు ఏర్పడినా ప్రయోజనముంటుందని అంటున్నారు*

**డా. ఇమ్మానేని సత్యసుందరం**

# బలమైన కారణం ఉంటేనే కొత్త రాష్ట్రాలు

ఇటీవలి కాలంలో చిన్న రాష్ట్రాలకై పోరాటం జరగడం, కొన్ని పెద్ద రాష్ట్రాల నుండి చిన్న రాష్ట్రాలు ఏర్పడడం జరిగింది. ఆర్థికరంగంలో చిన్న రాష్ట్రాలు ప్రగతిని సాధించలేవని, భవిష్యత్తులో వీటి మనుగడ కష్టమని ఒక వాదన ఉంది. ఇది సరికాదు. ఆర్థికాభివృద్ధి అనేక అంశాలపై ఆధారపడి ఉంటుందని గ్రహించాలి.

మన దేశ ఇటీవల అనుభవం తీసుకుంటే కొన్ని చిన్న రాష్ట్రాలు మంచి అభివృద్ధి రేటును సాధించాయి, కొన్ని కొత్త సమస్యలను ఎదుర్కొంటున్నాయి. ఉదాహరణకు, 2007-08లో బీహార్ వృద్ధి రేటు 12 శాతం, జార్ఖండ్ వృద్ధి రేటు 9.5 శాతం. అయితే మధ్యప్రదేశ్ వృద్ధిరేటు 7 శాతం, చత్తీస్‌ఘఢ్ వృద్ధిరేటు 17.5 శాతం. ఒక రాష్ట్రానికి కనీస విస్తీర్ణం ఉండాలి. అయితే, అది ఎంత అనేది అనేక అంశాలపై ఆధారపడి ఉంటుంది. మన దేశంలో భాషా ప్రయుక్త రాష్ట్రాలు ఏర్పడడం వల్ల దక్షిణ భారతదేశంలో రాష్ట్రాల మధ్య విస్తీర్ణంలో తేడాలు బాగా ఉన్నాయి. హిందీ మాట్లాడే ప్రాంతాలలో కూడా ఈ తేడాలు ఉన్నాయి. అందువల్ల మధ్యప్రదేశ్, బీహార్, ఉత్తరప్రదేశ్‌లను విభజించడం జరిగింది. ఇతర కారణాల వల్ల కూడా విడిపోవడం జరిగింది.

ఏ రాష్ట్రానికైనా ఆర్థిక వనరులు ముఖ్యం. ప్రస్తుతం రాష్ట్రాలు నిధులను మూడు మార్గాల ద్వారా సమకూర్చుకొంటున్నాయి. 1) సొంత పన్ను, పన్నేతర ఆదాయం; 2) కేంద్ర ఆదాయపు పన్ను, ఎక్సైజ్ ఆదాయాలలో రాష్ట్రాల వాటా; 3) రాష్ట్ర ప్రణాళికలకు కేంద్ర ప్రణాళికా సంఘం సమకూర్చే సహాయం.

చిన్న రాష్ట్రాలు మంచి ప్రగతి సాధించాలంటే తమ ఆర్థిక వనరులు పెంచుకోవాలి. ఉన్న వనరులను సమర్థవంతంగా వినియోగించుకోవాలి. ఇది రాష్ట్ర నాయకత్వంపై ఆధారపడి ఉంటుంది. ఉదాహరణకు, బీహార్‌లో ముఖ్యమంత్రి మారాక అభివృద్ధి రేటు పెరిగింది. వెనుకబడిన బీహార్ నితీష్‌కుమార్ సారథ్యంలో 11 శాతం వార్షిక వృద్ధిరేటు సాధించింది. అంటే అభివృద్ధికి సుపరిపాలనే కీలకం.

అభివృద్ధి విషయంలో రాష్ట్రాల మధ్య వ్యత్యాసాలు, ఒకే రాష్ట్రంలో ప్రాంతాల మధ్య వ్యత్యాసాలు ఉంటున్నాయి. ప్రాంతాల మధ్య సహజ వనరుల విషయంలో వ్యత్యాసాలున్నాయి. అయితే, ప్రాంతీయ వ్యత్యాసాలకు ప్రధాన కారణం ప్రైవేట్ పెట్టుబడులు. ఈ పెట్టుబడులు అభివృద్ధి చెందిన ప్రాంతాలలోనే జరుగుతాయి. అవస్థాపన సౌకర్యాలు లేని వెనుకబడిన ప్రాంతాలు వెనుకబడే ఉంటున్నాయి. కొంతకాలానికి అభివృద్ధి చెందిన, వెనుకబడిన ప్రాంతాల మధ్య వ్యత్యాసాలు పెరుగుతాయి. ఇవి ప్రత్యేక రాష్ట్రాల కోసం ఆందోళనలకు దారి తీయవచ్చు.

పెద్ద రాష్ట్రాలు మంచి అభివృద్ధి సాధిస్తాయని అనుకోవడం పొరపాటు. చాలా పెద్ద రాష్ట్రాలలో శాంతి, భద్రతల సమస్యలున్నాయి. వివిధ శాఖల మధ్య సమన్వయం లోపించి, పథకాల అమలు బాగుండడం లేదు. ప్రాంతాల మధ్య వ్యత్యాసాలు ఉండడం వల్ల ప్రత్యేక సమస్యలను ఎదుర్కోవలసి వస్తోంది. కొన్ని ప్రాంతాలు కొత్త రాష్ట్రాలకై డిమాండ్ చేస్తున్నాయి. పెద్ద రాష్ట్రాలలో అవినీతి స్థాయి కూడా ఎక్కువగా ఉండవచ్చు. రాజకీయ రంగం వేల కోట్ల రూపాయల వ్యాపారంగా మారవచ్చు. ఇక ముఖ్యమంత్రి, మంత్రులు మహారాజు, రాజులుగా మారే ప్రమాదం ఉంది.

ప్రస్తుతం చిన్న రాష్ట్రాలపై మొగ్గుచూపుతున్నారు. ఒక రాష్ట్రంలో కొన్ని ప్రాంతాల ప్రజలు తమకు గుర్తింపులేదని భావించడం వల్లే ఈ పరిస్థితి వచ్చింది. జాతి, మతపరమైన కారణాలే కాకుండా భౌగోళిక ప్రాంతాలు, వాటి సంస్కృతుల మధ్య అంతరాలు కూడా కొత్త రాష్ట్రాల ఏర్పాటుకు దారితీసాయి. ఈశాన్య ప్రాంత గిరిజనులు మరింత స్వయం ప్రతిపత్తి కోసం ప్రత్యేక రాష్ట్రాలకై పోరాడి వాటిని సాధించారు. నాగాలాండ్, మేఘాలయ, అరుణాచల్‌ప్రదేశ్, మిజోరాం అలా ఏర్పడ్డాయి. ప్రజలు, ప్రభుత్వం మధ్య సాధ్యమైనంత సాన్నిహిత్యం ఉంటుందని చిన్న రాష్ట్రాల వైపు మొగ్గు చూపడం జరిగింది.

అయితే, చిన్న రాష్ట్రాలు కూడా కొన్ని సమస్యలను ఎదుర్కోవలసి ఉంటుంది. ఈ రాష్ట్రాలలో అభివృద్ధికి కావలసిన అవస్థాపన తక్కువ. కేంద్రంపై నిధులకు ఆధారపడవలసి ఉంటుంది. ప్రైవేట్ పెట్టుబడి దారులు పెద్ద రాష్ట్రాలవైపే మొగ్గు చూపుతున్నారు.

భగ్గుమన్న తెలంగాణ సమస్యకు పరిష్కారం లేదా? పది జిల్లాలు గల తెలంగాణ పరిమాణంలో చిన్నది కాదు. సహజ వనరులు కూడా ఉన్నాయి. ఖనిజ సంపద ఉంది. అయితే వెనుకబడి ఉంది. కారణాలు ఏవైనా, తెలంగాణ ప్రత్యేక రాష్ట్ర డిమాండ్ సమంజసమే అంటున్నారు కొందరు మేధావులు.

తెలంగాణ విషయంలో కొన్ని ప్రత్యేక సమస్యలు ఎదురవుతున్నాయి. తెలంగాణ లాగానే రాయలసీమ కూడా వెనుకబడి ఉంది. కోస్తా ఆంధ్రాలో శ్రీకాకుళం, విజయనగరం వెనుకబడి ఉన్నాయి. కేవలం వెనుకబాటుతనం వల్లే రాష్ట్రాలను ఏర్పరచాలా? తెలంగాణలో కొన్ని జిల్లాలు అభివృద్ధి చెంది ఉన్నాయి. ఉదాహరణకు, 2005-06లో నీటిపారుదల గల భూమి విస్తీర్ణం కరీంనగర్‌లో 3,17,339 హెక్టార్లు, వరంగల్‌లో 3,25,090 హెక్టార్లు, కడపలో 1,41,707 హెక్టార్లు, విశాఖపట్నంలో 91,357 హెక్టార్లు. తెలంగాణతో పాటు అనేక కొత్త రాష్ట్రాలు ఏర్పరచడానికి కేంద్రం సిద్ధంగా ఉండాలి.

*పెట్టుబడికీ, అధికారానికీ, పాలకపక్షానికీ అనుకూలంగా, ప్రజలకు వ్యతిరేకంగా పత్రికల రాతలు సరయినవి కావనీ, చిన్న రాష్ట్రాలతో ప్రజలకు పాలన మరింత చేరువవుతుందనీ అంటున్నారు* **డా. జి. లచ్చయ్య**

# చిన్న రాష్ట్రాలు అభివృద్ధి నిరోధకాలా?

**యు**పిఎ చైర్ పర్సన్ సోనియాగాంధీ తెలంగాణ పట్ల సానుభూతిని ప్రకటించగానే ఆంధ్ర ప్రాంత రాజకీయ నాయకులందరు ఒకటయ్యారు. ఈ మాత్రం ఇంగితజ్ఞానం తెలంగాణ రాజకీయ నాయకులకు గత నలభై ఏండ్లుగా కాదుగదా, గత తొమ్మిది సంవత్సరాలుగా ఉన్నా రాజకీయ తెలంగాణనన్నా కనీసం ఎప్పుడో ఏర్పడేది. ఈ సందర్భంగా వివిధ పత్రికలు వివిధ కథనాలను ప్రచురిస్తున్నాయి. సంపాదకీయాలను రాస్తున్నాయి. ముఖ్యంగా జాతీయ స్థాయి ఆంగ్ల పత్రికలు (పేర్లు అవసరం లేదు) ఏ ప్రయోజనాన్ని ఆశించోగాని, చిన్న రాష్ట్రాలకు వ్యతిరేకంగా, ముఖ్యంగా తెలంగాణకు వ్యతిరేకంగా సంపాదకీయాలను, కథనాలను ప్రచురిస్తున్నాయి. తెలంగాణ గురించి రాస్తూ ఒక పత్రిక తన సంపాదకీయంలో 'రోగనిర్ధారణ సరిగానే జరిగింది గాని, నివారణ సరిగా లేదని' అంటే తెలంగాణలో నెలకొన్న సమస్యలు, వలసవాద దోపిడీ, జలవనరుల చౌర్యం వాస్తవమేగాని, వీటికి నివారణగా ప్రత్యేక రాష్ట్రం ఏర్పాటు చేయడం సరిగాలేదని వ్యాఖ్యానించింది.

దేశవ్యాపితంగా ప్రచురించబడుతున్న మరొక జాతీయ దినపత్రికనైతే విడిపోవడం సరియైంది కాదనే శీర్షికన కథనాలను ప్రచురించడమే కాకుండా, 14 డిసెంబర్ 2009 నాడు బెంగుళూరు సంచికలో చిన్న రాష్ట్రాలు దేశాభివృద్ధిని కుంటుపరుస్తాయని రాస్తూ, సందర్భరహితమైన ఓ కార్టూన్‌ను కూడా ప్రచురించింది. ఇవన్నీ కూడా బెంగుళూరులో స్థిరపడి వ్యాపారాలను, కాంట్రాక్ట్‌లను చేసుకుంటున్న కొంతమంది రాయలసీమ పెద్ద మనుషులు 'రాయలసీమ రాష్ట్ర సమితి' పేరున కేంద్ర న్యాయశాఖ మంత్రి వీరప్ప మొయిలీ 13 డిసెంబర్ 2009న బెంగుళూరును సందర్శించిన సందర్భంగా తెలంగాణను ఏర్పాటు చేయవద్దని కోరుతూ ఇచ్చిన మెమోరాండం సందర్భంగా, అలాగే 'తెలుగు జాతి రక్షణ' పేరున అదేరోజు జరిగిన ర్యాలీ సందర్భంగా వచ్చిన కథనాలు. విచిత్రమేమంటే, ఒకవైపు తెలంగాణను వ్యతిరేకిస్తూనే, రాయలసీమను ఓ రాష్ట్రంగా చిత్రీకరించుకోవడం గమనార్హం. ఇదే పత్రిక తన ఆదివారం (13 డిసెంబర్) నాటి సంచికలో 2000లో ఎన్‌డిఎ కాలంలో ఏర్పాటైన రాష్ట్రాల కథనాలను ప్రచురించింది. అందులో చత్తీస్‌ఘఢ్, ఉత్తరాఖండ్ రాష్ట్రాలలో జరిగిన అభివృద్ధిని చూపుతూనే చత్తీస్‌ఘఢ్ తుపాకి రాజ్యంగా మారిందనే వ్యంగ్య శీర్షికను పెట్టింది. మరో రాష్ట్రం జార్ఖండ్ గూర్చి రాస్తూ స్కాంలలో ఇరుక్కున్న రాష్ట్రం అని ప్రస్తావించింది.

ఈ మూడు రాష్ట్రాల కథనాలను వివరిస్తూ, గత యాభై సంవత్సరాలలో జరగని అభివృద్ధి కేవలం గత తొమ్మిది సంవత్సరాలలో జరిగిందని, కొన్ని గణాంకాలతో వివరించడం గమనార్హం. ఉత్తరాఖండ్ గూర్చి ముగింపు వాక్యంగా, నిజమైన స్వాతంత్ర్యం 1947లో కాకుండా నవంబర్ 2000లో వచ్చిందని ప్రజలనుకుంటున్నారని, చిన్న రాష్ట్రం అద్భుతంగా ఉందని అభిప్రాయపడుతున్నట్లు కథనంలో పేర్కొనడం జరిగింది. గతంలో కన్నా బడ్జెట్ ఆరు రెట్లు పెరిగిందని తెలిపింది. గతంలో ఈ ప్రాంతంలో 30 తహశీళ్లు ఉండగా ప్రస్తుతం 78కి పెరిగాయని, దీంతో ప్రజలకు ప్రభుత్వం అందుబాటులోకి వచ్చిందని తెలిపింది.

ఇలాంటి కథనమే చత్తీస్‌ఘఢ్ గూర్చి రాస్తూ, మధ్యప్రదేశ్‌తో పోల్చినప్పుడు తలసరి ఆదాయం గణనీయంగా (మధ్యప్రదేశ్

రాష్ట్ర రాజధాని విడిపోవాలనుకునే తెలంగాణలోనే ఉంది. ఇదే అసలైన సమస్య. హైదరాబాద్ మూడు ప్రాంతాలకి రాజధాననే మొత్తం సినిమా పరిశ్రమ అక్కడకు తరలివెళ్లింది. సీమాంధ్ర పారిశ్రామికవేత్తలు పెట్టుబడులు పెట్టారు. కేంద్ర ప్రభుత్వం కూడా కీలకమైన సంస్థలను హైదరాబాద్‌లోనే స్థాపించింది. 1960 ప్రాంతంలో తెలంగాణ విడిపోతే ఏ సమస్యా ఉండేది కాదు. ప్రస్తుతం హైదరాబాద్ ఒక పెద్ద రాజధానిగా ఎదిగింది. పెట్టుబడులు అక్కడ పెట్టిన వారిని, వేరే రాజధాని ఏర్పరచుకోమనడం, సీమాంధ్ర నేతలకి ఆగ్రహం కలిగిస్తుంది. 13 జిల్లాలకు రాజధాని ఏర్పరచడంలో అనేక సమస్యలుంటాయి.

తెరాస స్థాపించినప్పటి నుండి తెలంగాణకు జరిగిన అన్యాయాలపై పోరాటం జరిపితే బాగుండేది. ప్రస్తుతం ప్రత్యేక తెలంగాణ రాష్ట్రం ఇవ్వాలా లేదా అని చర్చలు జరుగుతున్నాయి. అసలు చర్చ జరగవలసింది తెలంగాణ వెనుకబడి ఉండడానికి కారణాలేమిటి, సమస్య పరిష్కారానికి ఏం చర్యలు తీసుకోవాలి. ఇప్పటికైనా వెనుకబడిన జిల్లాల అభివృద్ధికి ప్రత్యేక చర్యలు తీసుకొంటే బాగుంటుంది.

కేంద్రం చిన్న రాష్ట్రాలు ఇస్తానని హామీ ఇస్తే అది తప్పే. దీనివల్ల దేశవ్యాప్తంగా చిన్న రాష్ట్రాల ఏర్పాటుకై ఉద్యమాలు ఊపందుకొంటాయి. చిన్న రాష్ట్రాల ఏర్పాటు అన్ని సమయాలలో మంచిదనుకోవడం పొరపాటే. విడిపోయాక చిన్న రాష్ట్రాల అభివృద్ధి కుంటుపడితే చేసేది ఏమీలేదు. ఉదాహరణకు, జార్ఖండ్, చత్తీస్‌ఘఢ్‌ల అభివృద్ధి ఆశాజనకంగా లేదు. పైగా కొత్త సమస్యలను ఎదుర్కొంటున్నాయి. చిన్న రాష్ట్రాలు ఏర్పడాలంటే బలమైన కారణాలుండాలి. వనరులు తగినంతగా ఉండి, సమర్థవంతమైన నాయకత్వం ఉంటే చిన్న రాష్ట్రాలు, అభివృద్ధితో పాటు సాంఘిక న్యాయం కూడా సాధించగలవు. వీ

రు.18.051, చత్తీస్‌ఘఢ్ రు. 29,621) పెరిగిందని, పబ్లిక్, ప్రైవేట్ సెక్టార్‌లలో ఉద్యోగ అవకాశాలు విపరీతంగా పెరిగాయని, డిసెంబర్ 2009 మొదటివారంలోనే 80,000 మంది ఉపాధ్యాయ నియామకాలకై రాతపరీక్షల్ని నిర్వహించారనీ, ఇలాంటి అభివృద్ధి మధ్యప్రదేశ్ తో కలిసి ఉన్నప్పుడు జరగలేదనే వాస్తవాన్ని కూడా ఈ కథనం తెలిపింది. జార్ఖండ్ గూర్చి రాస్తూ, అక్షరాస్యతలో బీహార్ కన్నా (బీహార్ 55.7 శాతం కాగా జార్ఖండ్ 61.4 శాతం) ముందుందని, శిబుసోరెన్, మధుకోడా లాంటి ముఖ్యమంత్రుల్ని ప్రస్తావిస్తూ, చిన్న రాష్ట్రాల్లో అస్థిరత్వం ఉంటుందని, తొమ్మిది సంవత్సరాలలో ఆరు ప్రభుత్వాలు ఏర్పడ్డాయని, ఈ నేపథ్యంలో చూసినప్పుడు తెలంగాణ ఏర్పాటు సరికాదని తెలపడం జరిగింది.

ఈ విధంగా పత్రికలు తమ తమ ప్రయోజనాలను కాపాడుకోవడానికి, ప్రచురణపరమైన సమస్యల్ని తగ్గించుకోవడానికి, ప్రభుత్వం నుంచి ప్రకటల్ని దండిగా పొందడానికి, ప్రభుత్వంలో ఉన్న బడా పెట్టుబడిదారుల ప్రయోజనాల్ని కాపాడడానికే ఇలాంటి కథనాలను ప్రచురిస్తున్నాయి తప్ప సామాజిక, ఆర్థిక, రాజకీయ కోణంలో నుంచి కాదనేది ఈ కథనాలను చూస్తే అర్థమవుతున్నది. వీటికి పనిచేసే జర్నలిస్టులు గాని, కాలమిస్టులు గాని ఎవ్వరూ అట్టడుగు వర్గాల నుంచి వచ్చిన వారు కారు – సాధారణ ప్రజల సమస్యలు వీరికి ఎప్పుడూ పట్టవు. ప్రభుత్వంతో లబ్దిపొందాలనే తపనతో, జాతీయ స్థాయి జర్నలిస్టులుగా గుర్తింపు పొందడానికి, రాజ్యసభకు పోవడానికి, ఇతరత్రా లబ్ధిపొందడానికి పడే తపనలో భాగంగానే వీరి పత్రికా రచనలు కనపడుతుంటాయి. ప్రభుత్వం సిద్ధం చేసుకున్న గణాంకాలను ఉటంకిస్తూ వ్యాఖ్యానాలను చేయడం తప్ప నేరుగా ప్రజల వాస్తవ చింతనను ఎప్పుడూ వీరు పరిగణనలోకి తీసుకోరు.

విచిత్రమేమిటంటే ఇదే పత్రిక శతాబ్దాల క్రితం, దశాబ్దాల క్రితం తెలంగాణలో స్థిరపడిన ఇద్దరి ప్రముఖుల (విజయకరణ్, కేశవరావ్ జాదవ్) కథనాలను, ఇంటర్వ్యూలను ప్రచురించింది. వీరిద్దరు కూడా మనస్ఫూర్తిగా తెలంగాణ ఏర్పాటు కావాలని కోరుకుంటున్నట్లు ప్రస్తావించడం జరిగింది. ఇందులో జాదవ్‌గారు తెలంగాణ కోసం మొదటి నుంచి గళమెత్తుతున్న వ్యక్తే. ఒకవైపు ఇవన్నీ ప్రస్తావిస్తూనే, చిన్న రాష్ట్రాలు వద్దని వ్యంగ్య కార్టూన్లను ఈ పత్రికలు రోజూ వేస్తున్నాయి. ఇప్పుడు గనక తెలంగాణ ఇస్తే 2030 నాటికి గూర్ఖాల్యాండ్, బోడోల్యాండ్, విదర్భ, కూర్గ్, ఉత్తరాంచల్, వనాంచల్, బుందేల్‌ఖండ్ తదితర రాష్ట్రాలు ఏర్పడి భారతదేశం చిన్నాభిన్నం అవుతుందని తెలిపే భారతదేశ చిత్రపటాన్ని వేయడంలోని దురుద్దేశాన్ని అర్థం చేసుకోవాలి. పత్రికలు న్యాయబద్ధంగా ప్రజల పక్షాన నిలబడాలి గాని రాజకీయ ప్రయోజనాలకు, స్వార్థ ప్రయోజనాలకు పాకులాడి ప్రజల ఆకాంక్షల్ని కాదనడం, కాలరాయడం పత్రికల బాధ్యతారాహిత్యమే అవుతుంది. చిన్న రాష్ట్రాలు కాదు, సుపరిపాలన కావాలని ఘోషిస్తున్న ఈ పత్రికలు చిన్న రాష్ట్రాల్లో సుపరిపాలన ఉండదనే తప్పుడు సంకేతాలను కలిగిస్తున్నవి. ఇవే పత్రికలు పెద్ద రాష్ట్రాల్లోని ప్రజల కష్టాల్ని, పాలకుల వైఫల్యాల్ని, ప్రజా వ్యతిరేక చర్యల్ని, అసాంఘిక శక్తుల ఆగడాలను, బడా కాంట్రాక్టర్ల దోపిడీలను, రైతుల, నేత కార్మికుల ఆత్మహత్యల్ని, ఎండుతున్న భూముల్ని, అరవై సంవత్సరాల తర్వాత కూడా నీడలేని ప్రజల స్థితిగతుల్ని కనీస విద్యను, వైద్యాన్ని పొందలేకపోతున్న కుటుంబాల్ని, ఆచరణకు నోచుకోని హామీలిస్తున్న రాజకీయ నాయకుల బండారాల్ని, పెద్ద రాష్ట్రాల్లోకూడా అస్థిరతతో నడుస్తున్న ప్రభుత్వాలను, అవినీతి కుంభకోణాలను ప్రస్తావించకపోవడం విడ్డూరంగా ఉంది.

ఇదే సందర్భంగా సమైక్య రాష్ట్ర నినాదంతో జరుగుతున్న ఉద్యమాలను విశ్లేషించక, వాటి వెనకనున్న రాజకీయ శక్తుల్ని ఇంతవరకు ఈ శక్తులు తెలంగాణను దోచుకున్న తీరును, సమైక్య రాష్ట్రం పేరున మరింతగా దోచుకోవాలనే వారి ఎత్తుగడలను ప్రస్తావించకుండా, సమైక్య రాష్ట్ర నినాదం మొత్తం రాష్ట్ర ప్రజల నినాదంగా చూపడం అటు ఎలక్ట్రానిక్ మీడియాలోను జరుగుతున్నది. ఎందుకంటే ఈ ఛానళ్లన్నీ కూడా తెలంగాణేతర వ్యక్తుల చేతుల్లో ఉండడమే కారణం. 1953లో ఇదే ప్రజలు మద్రాసు నుంచి విడిపోయి వచ్చారు. అప్పుడు మద్రాసు ప్రజలు సమైక్యంగా ఉండాలని నినదించలేదు కదా! బ్రిటిష్ వారు కూడా దేశంలో పెట్టుబడులు (మన డబ్బే) పెట్టి కొన్ని అభివృద్ధి పనులు చేసారు. వారిని వెళ్లగొట్టలేదా? అభివృద్ధి చేసారు కాబట్టి వారు ఈ దేశంలోనే ఉండాలని కోరుకున్నామా? హైదరాబాద్‌లో పెట్టిన పెట్టుబడులు ఎవరికి లాభాల్ని చేకూర్చి పెట్టాయి? తెలంగాణ వారికా? ఆంధ్రావారికా? ఈ రోజు సినీరంగం పొందుతున్న రాయితీలు తెలంగాణ ప్రజల ఆస్తులు కావా? సినిమా పరిశ్రమ ద్వారా లబ్దిపొందుతున్నది తెలంగాణ ప్రజలా? ఇలాంటి మోసపూరిత విధానాలను ఈ పత్రికలు కథనాలుగా రాయలేక పోతున్నాయంటే వీటికి కూడా ఆ లాభాల్లో భాగస్వామ్యం ఉందని అనుకోవాల్సి వస్తుంది.

అయితే చిన్న రాష్ట్రాలు ప్రజల కడగండ్లను పూర్తిగా తీరుస్తాయని, ప్రజలకు సుఖశాంతుల్ని అందిస్తాయని, భద్రతను కల్పిస్తాయని, ఉపాధి, ఉద్యోగావకాశాల్ని పెంపొందిస్తాయని, ఇంకా చెప్పాలంటే రాజ్యాంగంలో పొందుపర్చిన హామీలన్నింటిని నెరవేరుస్తాయనే భ్రమలు ఎవరికీ లేవు. వలస పాలకుల స్థానంలో స్థానికులు వస్తారు. జలవనరులు రక్షించడం, వినియోగించడం జరుగుతుంది. ఉద్యోగ, ఉపాధి అవకాశాలు స్థానికులకే లభిస్తాయి. విద్యావకాశాలు మరింత పెరుగుతాయి. వైద్య సౌకర్యాలు మరింత అందుబాటులోకి వస్తాయి. ఉత్పత్తికి, వినియోగానికి దగ్గరి సంబంధం ఏర్పడుతుంది. పోటీతత్వం పెరుగుతుంది. పక్క రాష్ట్రంతో పోల్చుకోవడం జరుగుతుంది. విధిగా విద్యకు, ఆరోగ్యానికి, ఉపాధికి అధిక మొత్తంలో బడ్జెట్‌ను కేటాయించాల్సి వస్తుంది. బడ్జెట్ వినియోగంపై పర్యవేక్షణ పెరుగుతుంది. సామాజిక, రాజకీయ చైతన్యం పెరుగుతుంది. ప్రజల సంస్కృతి, సాహితీ రంగాలు రక్షించబడతాయి. గుత్తపెట్టుబడిదారీ విధానం తగ్గుతుంది. పారిశ్రామికీకరణ జరిగి, ఉత్పత్తి పెరుగుతుంది. స్థానిక వనరులు వినియోగించబడుతాయి. తలసరి ఆదాయం పెరుగుతుంది. పరిపాలన వికేంద్రీకరించబడుతుంది. జవాబుదారీతనం కొంతలో కొంత పెరుగుతుంది.

అయితే ఇప్పుడున్నట్లుగానే ప్రజావ్యతిరేక చర్యలు కొనసాగుతాయి. జాతీయ, అంతర్జాతీయ పెట్టుబడిదార్లకు ఖనిజ సంపదను ధారాదత్తం చేయడం కొనసాగుతూనే ఉంటుంది. అటవీ సంపద, ఇతర వనరులు దోపిడీకి గురి అవుతాయి. కొత్త పెట్టుబడిదార్లు ఎదుగుతారు. వీరే రాష్ట్ర రాజకీయాల్లో చురుకైన పాత్రను పోషిస్తారు. ఏదో ఒక రాజకీయ పార్టీకి అనుగుణంగా పనిచేస్తూ, ప్రజల ఆకాంక్షల్ని దెబ్బతీస్తారు కూడా. అయితే వీటికి వ్యతిరేకంగా ప్రజలు ఇప్పుడు ఉద్యమించినట్లే కొత్త రాష్ట్రం ఆవిర్భావం తర్వాత ఉద్యమిస్తారు. హక్కుల కోసం పోరాడుతారు. ఉద్యమాల, పోరాటాల స్వరూపం మారవచ్చు.

కాబట్టి చిన్న రాష్ట్రాలు అభివృద్ధికి దోహదపడేలాగానే ఉంటాయి గాని అభివృద్ధి నిరోధకాలుగా కావని ఈ జాతీయ పత్రికలు గుర్తిస్తే మంచిది. లేకపోతే ఈ పత్రికలకు వ్యతిరేకంగా కూడా ప్రజలు పోరాటం చేయాల్సి వస్తుంది. వీ

*రాష్ట్రం చిన్నదా, పెద్దదా అనేది సమస్య కాదనీ, చారిత్రక, భౌగోళిక, సామాజిక స్థితిగతులూ, పాలకులు అనుసరించే రాజకీయార్థిక విధానాలూ ఏ ప్రాంత అభివృద్ధికి అయినా కీలకమని అంటున్నారు* **ఎన్. వేణుగోపాల్**

# చిన్న రాష్ట్రాలు - అనుకూల, ప్రతికూల వాదనలు

ఒక పక్క తెలంగాణ రాష్ట్రం ఏర్పాటు గురించి, ఆంధ్రప్రదేశ్‌ను యథాతథంగా ఉంచడం గురించి వాదనలు, ఆందోళనలు జరుగుతుండగానే, మరొకపక్క చిన్నరాష్ట్రాల బాగోగుల గురించి చర్చ కూడ మొదలయింది. ప్రస్తుతం కేంద్ర హోంమంత్రిగా ఉన్న పి. చిదంబరం 2003లో ఫైనాన్షియల్ ఎక్స్‌ప్రెస్‌లో రాస్తుండిన వారం వారం శీర్షికలో చిన్న రాష్ట్రాలకు అనుకూలంగా ఒక వ్యాసం రాశారని, అందులో తెలంగాణ ఏర్పాటు చేయాలని సూచించారని, అందువల్ల ప్రస్తుతం ఆయనకు తెలంగాణ గురించి మాట్లాడే అరత లేదని విమర్శలు రావడంతో తెలంగాణ చర్చ, చిన్న రాష్ట్రాల పనితీరు చర్చ కలిసి పోయాయి. ఈలోగానే ఉత్తరాఖండ్, జార్ఖండ్, చత్తీస్‌ఘఢ్‌ల ఉదాహరణలు చూపుతూ చిన్నరాష్ట్రాలలోనే ఇతోధికమైన అభివృద్ధి జరుగుతుందని స్వామినాథన్ అయ్యర్, సి. ఎచ్. హనుమంతరావు వంటి ప్రఖ్యాత అర్థశాస్త్రవేత్తలు వ్యాసాలు రాశారు. అందుకు భిన్నంగా చిన్నరాష్ట్రమైతే కేంద్ర ప్రభుత్వం దగ్గర పరపతి తగ్గిపోతుందని, అందువల్ల కేంద్రం నుంచి రావలసినవి రాబట్టుకోలేమని, సమైక్యరాష్ట్రం ఉండి తీరవలసిందేనని మరికొందరు వాదిస్తున్నారు.

నిజానికి చిన్న రాష్ట్రాలు మంచివా కావా అనే చర్చను, తెలంగాణ రాష్ట్ర ఏర్పాటు, ఆంధ్రప్రదేశ్ రాష్ట్ర విభజన వంటి భావోద్వేగపూరితమైన అంశాలతో ముడిపెట్టి చర్చించనక్కరలేదు. తెలంగాణ ఏర్పడినా 'చిన్న రాష్ట్రం' కాబోదు. దేశంలోని 28 రాష్ట్రాలలో తెలంగాణ కన్న విస్తీర్ణంలో చిన్నవైన రాష్ట్రాలు పదిహేడు ఉన్నాయి. ఆ మాటకొస్తే ప్రపంచంలోని 233 దేశాల జాబితాను విస్తీర్ణం ప్రకారం చూస్తే, తెలంగాణ కన్న చిన్న దేశాలు 133 ఉన్నాయి. కనుక తెలంగాణ చర్చకూ, చిన్న రాష్ట్రాల చర్చకూ పెద్దగా సంబంధం లేదు. తెలంగాణ అంశాన్ని పక్కనపెట్టి చిన్న రాష్ట్రాల అభివృద్ధి గురించి చర్చించవలసి ఉంది.

ఆ చర్చలోకి వెళ్లబోయే ముందు ప్రస్తుతం వివాదాస్పదమైన చిదంబరం వ్యాసం గురించి కొంచెం తెలుసుకోవాలి. అది తెలంగాణ కోసం రాసిన వ్యాసం కాదు. ఇండియా టుడే వారపత్రిక 2003లో స్టేట్ ఆఫ్ ఇండియన్ స్టేట్స్ (రాష్ట్రాల పరిస్థితి) అని ఒక అధ్యయనం ప్రారంభించింది. ఆ సంవత్సరం అర్థశాస్త్రవేత్తలు వివేక్ దేబ్‌రాయ్, లవీష్ భండారీ తొమ్మిది ప్రాతిపదికల మీద రాష్ట్రాలకు సంబంధించిన విస్తృత సమాచారాన్ని పోగు చేసి ఆయా రాష్ట్రాల పనితీరును బట్టి వాటికి స్థానాలు కేటాయించారు. ఆ నివేదిక ప్రకారం గోవా, ఢిల్లీ, హిమాచల్‌ప్రదేశ్, కేరళ, హర్యానా, పంజాబ్ వంటి చిన్న రాష్ట్రాలే అన్ని సూచికలలోనూ అగ్రస్థానాలలో ఉన్నాయి. పెద్ద రాష్ట్రాలన్నీ, వాటి పరిమాణాన్ని బట్టి అట్టడుగు స్థానాలు పొందాయి. ఆ నివేదిక మీద వ్యాఖ్యానిస్తూ చిదంబరం 2003 మే 18న రాసిన వ్యాసంలో 'ఈ నివేదిక చిన్నరాష్ట్రాలకు అనుకూలమైన, ఖండించడానికి వీలులేని వాదనలు చేస్తుంది.... దాని అర్థం ప్రతి రాష్ట్రాన్నీ రెండు ముక్కలో, మూడు ముక్కలో చేయాలని కాదు. కాని పరిమాణం, జనసంఖ్య, భౌగోళిక లక్షణాల పునాదిపై రాష్ట్రం ఏర్పాటు చేయాలనే ఆకాంక్ష గనుక ఉంటే రాష్ట్ర విభజనే వివేకవంతమైన నిర్ణయమనిపిస్తుంది' అని రాశారు.

అలాగే 2003 నుంచీ కూడ ప్రతి సంవత్సరం ఇండియా టుడే ఇటువంటి అధ్యయనాన్ని సాగిస్తూ రాష్ట్రాలకు వాటి అభివృద్ధి, పనితీరులను బట్టి తరతమ స్థానాలు కేటాయిస్తోంది. ఈ పరిశీలనలో మొత్తం పనితీరు, వ్యవసాయం, వినియోగ సరుకుల మార్కెట్లు, విద్య, శాంతి భద్రతలు, ఆరోగ్యం, మౌలిక సౌకర్యాలు, పెట్టుబడులు, స్థూల ఆర్థికవ్యవస్థ అనే తొమ్మిది ప్రాతిపదికలను అధ్యయనం చేస్తున్నారు. 2009 సెప్టెంబర్ 14న వెలువడిన తాజా, తొమ్మిదో నివేదిక ప్రకారం కూడ హిమాచల్‌ప్రదేశ్, పంజాబ్, సిక్కిం, ఢిల్లీ, ఉత్తరాఖండ్ మొదటి ఐదు స్థానాలలో నిలిచాయి. మొదటి పది స్థానాలలో ఒక్క పెద్ద రాష్ట్రం కూడ లేదు.

అయితే ఈ అధ్యయనంలోని ప్రాతిపదికలన్నీ కూడ సగటు అంకెలను మాత్రమే దృష్టిలో పెట్టుకుంటాయి గనుక వాటిలో లోపాలు ఉండే అవకాశం కూడ ఉంది. ఆమేరకు చిన్నరాష్ట్రాలకు అనుకూలంగా గాని, వ్యతిరేకంగా గాని నిర్ధారణకు రావడానికి వీలులేదు. ఆ సగటు అంకెలను అలా ఉంచి, చిన్న రాష్ట్రాలకు అనుకూల వాదనలలోని గుణాత్మకమైన అంశాలు కొన్ని చూడవలసి ఉంది.

ఒక పాలనా ప్రాంతపు విస్తీర్ణం తగ్గిన కొద్దీ పాలనా వికేంద్రీకరణ సులభసాధ్యమవుతుంది. ప్రజలు తమను తాము పాలించుకోవాలనే ప్రజాస్వామిక ఆదర్శం వాస్తవరూపం ధరించాలంటే పాలనా వ్యవస్థలు వికేంద్రీకరణ జరగాలి. పాలనా ప్రాంతం నిర్వహించడానికి వీలులేనంత సువిశాలంగా ఉండి, పాలన కేంద్రీకరణ జరిగినప్పుడు ప్రజాస్వామిక ఆదర్శం భగ్నమయ్యే అవకాశం ఉంది. అందువల్ల పాలన సులభతరం కావాలన్నా, సరళం కావాలన్నా, ప్రజలవద్దకు చేరాలన్నా, పాలనా పరిధి అంతకంతకూ చిన్నది కావలసి ఉంటుంది. నిజానికి జాతీయోద్యమ ఆదర్శాలలో ఒకటిగా గాంధీ గ్రామ స్వరాజ్యాన్ని ఆకాంక్షించడానికి కారణం ఇదే. అందుకే రాజ్యాంగం సమాఖ్య పాలనా పద్ధతిని

ఎంచుకుంది. బలవంతరాయ్ మెహతా కమిటీ సిఫారసుల మేరకు పంచాయతీరాజ్ వ్యవస్థను నెలకొల్పింది కూడ అందుకే. రాజ్యాంగపు 73, 74 సవరణల ద్వారా స్థానిక స్వపరిపాలనా సంస్థలకు ఎక్కువ అధికారాలు ఇవ్వడం జరిగింది కూడ అందుకే. చిన్న రాష్ట్రాలను ఏర్పరచాలనే డిమాండ్ కూడా ఈ ప్రజాస్వామిక విస్తరణలో భాగమే.

ప్రజలందరికీ పాలనలో ఇతోధిక భాగస్వామ్యం కలిగించడానికి, స్వపరిపాలన పెంచడానికి గత ఆరు దశాబ్దాలుగా దేశంలో జరుగుతున్న ప్రయత్నాలు సఫలం కాలేదు. ప్రజలకు ఎక్కువ అధికారాలు ఇస్తే, అధికారవర్గాల ప్రయోజనాలు దెబ్బతింటాయనే అనుమానం వల్లనే, మాటల్లో ఏమి చెప్పినప్పటికీ అన్ని పాలక రాజకీయ పక్షాలూ ఆ ప్రజాస్వామిక ప్రయోగాలకు తూట్లు పొడిచాయి. ఆ నేపథ్యంలోనే ప్రజలలో అసంతృప్తి పెరిగిపోవడం, ఆ అసంతృప్తి విభిన్న రూపాలలో వ్యక్తం కావడం జరుగుతోంది. ఆ అసంతృప్తి ప్రకటిస్తున్నవారిలో కొందరిని వేరుచేసి, వారికి ఏవో స్వార్థ ప్రయోజనాలు కల్పించి, విస్తృత ప్రజానీకాన్ని మాత్రం ప్రజాస్వామ్యానికి దూరం చేయడంలో పాలక వర్గాలు విజయం సాధిస్తూనే ఉన్నాయి. ఈ పరిస్థితిలో ప్రజాస్వామ్యం నిజంగా అమలు జరగాలంటే, పాలనలో ప్రజలకు ఇతోధిక భాగస్వామ్యం దొరకాలంటే కనీసం పాలనా వ్యవస్థలు వారికి చేరువగా ఉండడం అవసరం. అలా ఉన్నప్పుడు ప్రజలకు తమ పాలనా వ్యవస్థలను నిలదీసే, ప్రశ్నించే అధికారం, వాటిలో పాలుపంచుకునే అవకాశం, అవి తప్పుడు మార్గంలో నడిచినప్పుడు ప్రతిఘటించే అవకాశం దొరుకుతాయి.

అలాగే, చిన్న రాష్ట్రాల డిమాండ్‌కు ప్రజాస్వామిక విస్తరణ అనే కోణం మాత్రమే కాక, చరిత్ర కోణం కూడ ఉంది. దేశంలో విభిన్న రాజవంశాల పాలనలో బతికిన ప్రజలలో అత్యధికులను ఒకే పాలన కిందికి తీసుకువచ్చిన ఘనత బ్రిటిష్ వలసవాదులదే. వారు కూడ 560 సంస్థానాలను ముట్టుకోకపోయినా, మిగిలిన దేశాన్ని మాత్రం రాష్ట్రాలుగా విభజించారు. ఆ రాష్ట్రాలు కేవలం పాలనాసౌలభ్యాన్ని దృష్టిలో పెట్టుకుని ఏర్పరచినవే తప్ప పాలితుల సామాజిక, సాంస్కృతిక, చారిత్రక బంధాలను దృష్టిలో పెట్టుకున్నవి కావు. అందువల్ల రాష్ట్ర విభజనకు భాషా ప్రాతిపదికను పునాదిగా పెట్టుకుంటానని భారత జాతీయోద్యమం 1920లలోనే ప్రకటించింది. కాని 1940ల చివరికి వచ్చేసరికి 'స్వతంత్ర' భారత పాలకులు భాషా ప్రాతిపదికతోపాటు, దేశ సమగ్రత, సార్వభౌమాధికారం అనే కొత్త ప్రాతిపదికలనూ, పాలనా సౌలభ్యం అనే వలసవాద ప్రాతిపదికనూ కలగలిపి గందరగోళంగా రాష్ట్రాలు ఏర్పాటు చేశారు. తామే ఏర్పాటు చేసిన రాష్ట్రాల పునర్వ్యవస్థీకరణ కమిషన్ సిఫారసులను కూడ ఖాతరు చేయలేదు. ఒకే భాష మాట్లాడే ప్రజలు ఏడెనిమిది రాష్ట్రాలలో ఉండగా, ఒకే రాష్ట్రంలో మూడు నాలుగు భాషల ప్రజలను చేర్చిన విచిత్ర స్థితి ఏర్పడింది.

ఈ సంక్షుభిత చరిత్ర నేపథ్యంలో దాదాపు ప్రతి రాష్ట్రంలోనూ ఉపజాతి, ఉపప్రాంతీయ ఆకాంక్షలు ప్రబలమయ్యాయి. ఆ ఆకాంక్షలను పరిష్కరించే ప్రయత్నాలు సక్రమంగా జరగనందువల్ల, పరిష్కరిస్తామని ఇచ్చిన హామీలు నెరవేర్చనందువల్ల, ఆకాంక్షలను అణచివేయడానికి దమననీతి ఉపయోగించినందువల్ల ఆ ఆకాంక్షలు ఇంకా బలపడ్డాయి. ఇవాళ దేశవ్యాప్తంగా కనీసం పది చోట్ల రాష్ట్ర విభజన కోరికలు, ఉద్యమాలు ఏదో ఒక స్థాయిలో ఉన్నాయి. ఆ కోరికలను నెరవేర్చడమంటే నేరుగా చిన్నరాష్ట్రాల డిమాండ్‌ను నెరవేర్చడమే కాకపోవచ్చుగాని, అటువంటి విభజనవల్ల ఏర్పడేవి చిన్న రాష్ట్రాలే. ఆ మాటకొస్తే ఇప్పటికే చిన్న రాష్ట్రంగా ఉన్న పశ్చిమ బెంగాల్‌లో కూడ కనీసం రెండు ప్రాంతాలలో ఈ ఉపప్రాంతీయ ఆకాంక్షలున్నాయి.

ఈ ఉపప్రాంతీయ ఆకాంక్షలకే మరొక కోణం, ఆ ప్రాంతాలు, లేదా ఆ ప్రాంత ప్రజలు మరొక పెద్ద రాష్ట్రంలో ఉండడం వల్ల తమ స్వావలంబన, స్వయం నిర్ణయాధికారం కోల్పోతున్నామని భావించడం. ఈ భావన నిజం కావచ్చు, కాకపోవచ్చు. కాని అది ప్రజల మనసులను ఆకట్టుకోగల అవకాశం ఉంది. అప్పటికే అభివృద్ధిలో వివక్ష సాగుతుండడం, తమ వనరులను వాడుకుని మరొక ప్రాంతం వారు లాభపడుతున్నారనే అభిప్రాయం ఉండడం, తమ స్వతంత్ర అస్తిత్వాన్ని మరొక ప్రాంతం వారు అణచివేస్తున్నారని భావించడం వంటి ఆలోచనలు స్వయం నిర్ణయాధికారం కావాలని కోరుకునే వైపుగా దారితీస్తాయి. జార్ఖండ్‌లో ఇటువంటి ఉపజాతీయ ఆకాంక్షలు ఎలా స్వయం నిర్ణయాధికార దిశగా పయనించాయో సామాజిక శాస్త్రవేత్తలు విశ్లేషించారు. ఒక కొత్త రాష్ట్రం ఏర్పడినంత మాత్రాన ఈ స్వయం నిర్ణయాధికార ఆకాంక్షలన్నీ నెరవేరుతాయా, అవి విస్తృత ప్రజానీకపు స్వయం నిర్ణయాధికారంగా అమలవుతాయా, లేక మళ్లీ ఒక స్థానిక పాలకవర్గమే ఆ అధికారాన్ని హస్తగతం చేసుకుంటుందా వంటి ప్రశ్నలెన్నో వేయవచ్చు. ఒకరకంగా చెప్పాలంటే బ్రిటిష్ వలసవాదులను వెళ్లిపొమ్మని కోరినప్పుడు భారత ప్రజానీకానికి మొత్తంగా స్వయం నిర్ణయాధికారం దక్కుతుందని ఆశించినప్పటికీ, అరవై ఏళ్లు గడిచినా అది జరగలేదనే వాస్తవం కూడ మన కళ్లముందర ఉంది. కనుక భౌగోళికంగా ఒక కొత్త రాష్ట్రం ఏర్పడడమే, కొత్త సరిహద్దులు గీయడమే ప్రజలకు స్వయం నిర్ణయాధికారం రావడం అవుతుందా అనే ప్రశ్న వేయవలసిందే. అయితే, ప్రజల నిరంతర జాగరూకత, నిరంతర పోరాటం కొనసాగుతూ ఉండేట్టయితే ఈ స్వయం నిర్ణయాధికారం ఒక క్రమంలో సాధ్యమవుతుందనీ, ఆ దిశలో రాష్ట్ర ఏర్పాటు ఒక ముందడుగేననీ చెప్పవచ్చు.

ఒక చిన్న రాష్ట్రం ఏర్పడగానే అభివృద్ధి జరుగుతుందా అనే ప్రశ్న కూడ ఇటీవల ఎక్కువగా వినిపిస్తోంది. ఉత్తరాఖండ్, జార్ఖండ్, చత్తీస్‌ఘఢ్‌ల అభివృద్ధి సూచికలను బట్టి, అక్కడి రాష్ట్ర స్థూల ఉత్పత్తి పెరుగుదల రేటు ఎక్కువగా ఉండడాన్ని బట్టి చిన్న రాష్ట్రాలలో ఎక్కువ అభివృద్ధి జరుగుతుందని ఆర్థికశాస్త్రవేత్తలు చెపుతున్నారు. కాని కొత్త రాష్ట్రం ఏర్పడగానే మంత్రదండం ఉపయోగించినట్టుగా అభివృద్ధి జరిగిపోతుందనే నియమమేమీ లేదు. ఈ మూడు రాష్ట్రాలలో, అవి అంతకు ముందు భాగంగా ఉన్న పెద్ద రాష్ట్రాలకన్న పెరుగుదల రేటు ఎక్కువగా ఉండడానికి ఒక కారణం ఉంది. ఎప్పుడైనా ప్రాతిపదిక (బేస్) తక్కువగా ఉంటే పెరుగుదల రేటు ఎక్కువగా ఉంటుంది. అతి తక్కువ పెరుగుదల అయినా ఎక్కువ రేటును నమోదు చేస్తుంది. ఉదాహరణకు ఒకటికి ఒకటి చేరడానికి, పదికి ఒకటి చేరడానికి తేడా ఏమీలేదు, రెండు చోట్లా చేరినది ఒకటే. కాని ఒకటికి ఒకటి చేరితే వందశాతం పెరుగుదల అవుతుంది, పదికి ఒకటి చేరితే పది శాతం పెరుగుదల మాత్రమే అవుతుంది. చిన్న రాష్ట్రాలలో, వెనుకబడిన ప్రాంతాలలో సూచికలు తక్కువ స్థాయిలో ఉంటాయి గనుక అక్కడ ఎంత చిన్నపాటి అభివృద్ధి అయినా విపరీతమైన అభివృద్ధి రేటుగా కనబడుతుంది. ఆ అంకెల వెనుక గుణాత్మక అంశాలేమిటో, ఆ అంకెల

## రాష్ట్రాల ఏర్పాటుపై డా. బి.ఆర్. అంబేద్కర్ అభిప్రాయాలు

భాషా ప్రయుక్త రాష్ట్రాలను రూపొందించడానికి అవసరమైన సూత్రాలను పాఠకుల సౌకర్యార్థం ఈ కింద క్రోడీకరిస్తున్నాను... అవి

1. ఒక రాష్ట్రంలో వేరువేరు భాషల వాళ్లు ఉండవచ్చుననే ఆలోచనను పూర్తిగా ఒదులుకోవాలి.
2. ప్రతి రాష్ట్రం ఒకే ఒక్క భాషా రాష్ట్రం కావాలి. అంటే, ఒక రాష్ట్రం ఒక భాష.
3. అయితే ఒక రాష్ట్రం ఒక భాష అనే సూత్రాన్ని ఒక భాషకు ఒకరాష్ట్రం అనే సూత్రంతో జోడించి గందరగోళం చేయగూడదు.
4. ఒక భాషకు ఒక రాష్ట్రం అనే సూత్రానికి అర్థమేమంటే, ఒకే భాష మాట్లాడే ప్రజలందరిని విస్తీర్ణంతోనూ, జన సంఖ్యతోనూ, ఆ భాష మాట్లాడే ప్రజల మధ్య భిన్నత్వపు పరిస్థితులతోనూ సంబంధం లేకుండా ఒకే ప్రభుత్వం కిందికి తేవడం. బొంబాయితో సహా సంయుక్త మహారాష్ట్ర ఏర్పర్చాలనే ఆందోళన వెనుక ఉన్న భావన ఇదే. ఇది ఒక పిచ్చి సూత్రం. దీనికి ఇంతకు ముందు ఒక్క ఉదాహరణ కూడా లేదు. ఈ సూత్రాన్ని కచ్చితంగా ఒదులుకోవాలి. ఒకే భాష మాట్లాడే ప్రజలను వేరువేరు రాష్ట్రాలలో, పాలనలలో ఉంచవచ్చు. ప్రపంచవ్యాప్తంగా ఎన్నో చోట్ల ఇది జరిగింది.
5. ఒకే భాష మాట్లాడే ప్రజలను ఎన్ని రాష్ట్రాల కింద విభజించవచ్చు అనేది 1) సమర్థవంతమైన పాలనా అవసరాలను బట్టి, 2) విభిన్న ప్రాంతాల అవసరాలను బట్టి, 3) విభిన్న ప్రాంతాల ప్రజల భావోద్వేగాలను బట్టి, 4) ఆ ప్రాంతంలోని అధిక సంఖ్యాకులకూ (మెజారిటీ), అల్ప సంఖ్యాకులకూ (మైనారిటీ) మధ్య ఉండే నిష్పత్తిని బట్టి నిర్ణయించవలసి ఉంటుంది.
6. ఒక రాష్ట్రపు విస్తీర్ణం పెరిగిన కొద్దీ అధిక సంఖ్యాకులకూ, అల్ప సంఖ్యాకులకూ మధ్య నిష్పత్తి తగ్గిపోతూ ఉంటుంది. అంటే, అల్ప సంఖ్యాకుల పరిస్థితి ప్రమాదకరంగా మారుతుంది. అల్ప సంఖ్యాకుల మీద నిరంకుశ పెత్తనం సాగించాలని అధిక సంఖ్యాకులు భావించే అవకాశాలు పెరుగుతాయి. అందువల్ల రాష్ట్రాలు చిన్నవిగా ఉండక తప్పదు.
7. అధిక సంఖ్యాకుల నిరంకుశత్వాన్ని అడ్డుకోవడానికి అల్ప సంఖ్యాకులకు తగిన రక్షణ కల్పించవలసి ఉంటుంది. అందుకొరకు రాజ్యాంగాన్ని సవరించాలి. బహుళ ఓటింగ్, ఇద్దరు, ముగ్గురు సభ్యుల నియోజకవర్గాలు ఉండే పద్ధతి ప్రవేశపెట్టాలి.

(డా. బి.ఆర్. అంబేద్కర్ రాసిన 'థాట్స్ ఆన్ లింగ్విస్టిక్ స్టేట్స్' (1955) లోని అధ్యాయం 8 నుంచి)

పెరుగుదల నిజంగా ప్రజాజీవన ప్రమాణాలలో మెరుగుదలకు దారితీస్తుందో లేదో ఇంకా నిశితంగా చూడవలసి ఉంటుంది.

ఇక వ్యతిరేక వాదనలలో ఒకటి, రాష్ట్రం, పాలనా ప్రాంతం చిన్నదైనకొద్దీ అక్కడ రాజ్యాంగయంత్రపు శక్తి ఇనుమడిస్తుందనేది. ఎప్పుడైనా రాజ్యాంగ యంత్రం విస్తరించడమంటే ప్రజాజీవనం మీద ప్రతికూల ప్రభావం వేయడమనే అర్థం. ప్రజలను ఇంకా ఎక్కువ అదుపులో పెట్టడానికి, ప్రజల మీద ఎక్కువ నిర్బంధాన్ని అమలు చేయడానికి, ప్రజల జీవితాలను అస్తవ్యస్తం చేయడానికి చిన్నరాష్ట్రంలో పాలకవర్గాలకు ఎక్కువ అవకాశం ఉంటుందని ఈ వాదన అంటుంది. నిజంగానే చత్తీస్‌ఘఢ్‌లో ఈ వాదన నిజమయింది కూడ. అక్కడ ప్రజల మీద పోలీసు దమనకాండ అది మధ్యప్రదేశ్‌లో భాగంగా ఉండి, నిర్ణయాలు భోపాల్‌లో జరిగినప్పటికన్న, వేరు రాష్ట్రమై రాయపూర్ నుంచి నిర్ణయాలు జరగడం మొదలయిన తర్వాత పెరిగింది. ఒక్కొక్క రెవెన్యూ జిల్లాను రెండు పోలీసు జిల్లాలుగా మార్చి మొత్తం రాష్ట్రాన్ని నిర్బంధ శిబిరంగా మార్చారు. అయితే ఈ వాదనకు మరొక ప్రతివాదన కూడ ఉంది. పెద్ద రాష్ట్రాలలో కూడ ప్రజల మీద ఘోరమైన నిర్బంధమే అమలవుతున్నప్పుడు, నిర్బంధాన్ని చిన్న రాష్ట్రం, పెద్ద రాష్ట్రం అనే ప్రమాణాలతో చూడడం సరికాదని ఈ ప్రతివాదన అంటుంది. పాలకవర్గాలు ప్రజా ఉద్యమాల మీద దమననీతిని ప్రదర్శించడం అనేది పెద్దరాష్ట్రంలోనైనా, చిన్నరాష్ట్రంలోనైనా ఒకేవిధంగా ఉంటున్నదని ఈ ప్రతివాదన అంటుంది.

మరొక వాదన ప్రకారం రాష్ట్రం చిన్నదయ్యే కొద్దీ అధికార వర్గాలకు బేరసారాలాడే అధికారం, ఇతర బృందాలను, సామాజిక వర్గాలను లొంగదీసుకునే అవకాశం పెరుగుతాయి. తద్వారా రాష్ట్రం చిన్నదయ్యే కొద్దీ పాలనలో నిరంకుశత్వం, కుట్రలు, కుహకాలు, స్వార్థ ప్రయోజనాలు పెరిగిపోతాయి. అందువల్ల రాష్ట్ర ప్రభుత్వ స్థిరత్వానికి దెబ్బ తగులుతుంది. అలాగే మన సమాఖ్య వ్యవస్థలో కేంద్ర ప్రభుత్వ స్థాయిలో రాష్ట్రానికి ఎక్కువ ప్రయోజనాలు చేకూరాలంటే పెద్ద రాష్ట్రానికే వీలవుతుందిగాని చిన్నరాష్ట్రానికి వీలుకాదని కూడ ఈ వాదన అంటుంది. ఈ వాదన నిజమయిన సందర్భాలు కూడ ఉన్నాయి గాని, ప్రతివాదనలు కూడ ఉన్నాయి. రాష్ట్రం చిన్నదయినా స్థిరంగా ఉన్న సందర్భాలూ, పెద్దదయినా అస్థిరంగా ఉన్న సందర్భాలూ ఉన్నాయి. అలాగే పెద్ద రాష్ట్రాలలో కూడ నిరంకుశత్వం, కుట్రలు, స్వార్థ ప్రయోజనాలు రాజ్యం చేసిన ఉదాహరణలు కొల్లలుగా ఉన్నాయి. అలాగే రాష్ట్రం పెద్దదయి, ఎక్కువ మంది పార్లమెంటు సభ్యులు ఉన్నంత మాత్రాన రాష్ట్ర ప్రయోజనాలు నెరవేరుతాయనే హామీ ఏమీ లేదు. విస్తీర్ణంలో మొదటి స్థానంలో ఉన్న రాజస్తాన్‌కూ, పార్లమెంటు సభ్యుల సంఖ్యలో మొదటిస్థానంలో ఉన్న ఉత్తరప్రదేశ్‌కూ గత అరవై సంవత్సరాలలో దక్కిందేమీ లేదు.

చిన్నరాష్ట్రానికి వనరుల కొరత సమస్య ఉంటుందనీ, అందులోనూ అనవసరపు పాలనా వ్యయం వల్ల అది అభివృద్ధి మీద కేంద్రీకరించడం సాధ్యం కాదనీ మరొక వాదన. సహజ వనరులు ఉండడం అనేది రాష్ట్రం చిన్నదా, పెద్దదా అనేదాని మీద ఆధారపడి ఉండదు. వనరులు లేని పెద్దరాష్ట్రాలూ ఉండవచ్చు, విస్తారంగా వనరులు ఉన్న చిన్న రాష్ట్రాలూ ఉండవచ్చు. అలాగే పాలనావ్యయం వృధా కావడమనేది పెద్దరాష్ట్రాలలో కూడ ఎక్కువగానే ఉంది గనుక ఎక్కడయినా దాన్ని సవ్యంగా, హేతుబద్ధంగా, ప్రజాసంక్షేమ దృష్టితో సమీక్షించవలసిందే.

కనుక ఒక రాష్ట్రం చిన్నదా, పెద్దదా అనేది గీటురాయి కాదు. కనీసం ప్రస్తుత భారత రాజకీయాలలో కాదు. ఆ రాష్ట్రం ప్రజా ఆకాంక్షలకు అనుగుణమైనదా కాదా, ప్రజావసరాలను తీర్చగలిగినదా కాదా, చారిత్రక, సామాజిక, సాంస్కృతిక, భౌగోళిక కారణాల రీత్యా సమర్థించదగినదా కాదా అనేదే గీటురాయి అవుతుంది. వీ

*తెలంగాణ ఉద్యమక్రమంలో జరుగుతున్న ఆత్మహత్యలకు సమాజం మొత్తం బాధ్యత వహించవలసి ఉందంటున్నారు* **ఎడ్ల పోచయ్య**

# ఆత్మహత్యలు కావు, మనం చేస్తున్న హత్యలు

ఇది 'ఆంధ్రప్రదేశ్ పరిస్థితి మీద సంప్రదింపులు జరిపే జస్టిస్ బి ఎన్ శ్రీకృష్ణ కమిటీ' గురించి చర్చించడానికి కాదు. ఆ కమిటీ సూచన వెలువడిన జనవరి 5న జరిగిన ఒక ఆత్మహత్య నుంచి ఆ కమిటీని బహిష్కరించమనే పిలుపుతో చలో అసెంబ్లీ సాగిన ఫిబ్రవరి 20న జరిగిన మరొక ఆత్మహత్య దాకా పరిస్థితులను చర్చించడానికి. తెలంగాణలో చెలరేగుతున్న ఉద్రేకాలను ఈ కమిటీ చల్లార్చగలదా అని చర్చించడానికి. ఈ కమిటీ తెలంగాణ ప్రజలలో, విద్యార్థులలో ప్రస్తుత నిరాశను తుడిచేసి, ఆశను మేల్కొల్పగలదా అని చర్చించడానికి. ఆ ఆత్మహత్యలలో, హత్యలలో మన బాధ్యతను గుర్తింపజేయడానికి.

ఆదిలాబాద్ జిల్లా ఖానాపురం మండలం అంకెన గ్రామానికి చెందిన దానావత్ శ్వేత ఇచ్చోడ జూనియర్ కాలేజిలో ఇంటర్ మొదటి సంవత్సరం చదువుతుండేది. ఆ వయసు విద్యార్థులందరిలాగే తెలంగాణ రాష్ట్ర సాధన ఉద్యమంలో పాల్గొంటూ, తెలంగాణ ఏర్పడుతుందనే గట్టి విశ్వాసంతో ఉండేది. రాష్ట్రంలోని రాజకీయపార్టీలతో ఢిల్లీలో అఖిలపక్ష సమావేశం జరిగిన జనవరి 5 రోజంతా టివి చూస్తూ, ఏదో జరుగుతుందని, తెలంగాణ రాష్ట్ర ఏర్పాటును ప్రకటిస్తారని ఆశించింది. ఊళ్లో ఉన్న కిరాణా దుకాణంలో చాక్లెట్లన్నీ తానే కొంటానని, శుభవార్త రాగానే పంచుతానని ముందే చెప్పి పెట్టింది. రాత్రి ఒంటి గంట దాకా చూసినా టివిలో శుభవార్త లేదు సరిగదా, కాలయాపన వంచన ప్రకటనలు వెలువడ్డాయి. అప్పటికి జస్టిస్ శ్రీకృష్ణ పేరు రాలేదు గాని కమిటీని నియమిస్తామనే ప్రకటన వచ్చింది. ఆ కమిటీ ఏమిచేసినా ప్రస్తుతానికైతే తెలంగాణ వెనక్కి పోయిందని శ్వేతకు అనిపించింది. చాక్లెట్లు కొని ఊరంతా పంచుతానన్న చేతులతో పురుగుల మందు తాగి ప్రాణాలు తీసుకుంది.

ఆ తర్వాత నలభై ఐదు రోజులు గడిచాయి. కమిటీకి ఎవరు నాయకత్వం వహిస్తారో, ఎవరు సభ్యులుగా ఉంటారో, ఆ కమిటీ ఏమి విచారిస్తుందో వివరాలు వచ్చాయి గాని, తెలంగాణ ఏర్పాటుపై అనిశ్చితి కొనసాగుతూనే ఉంది. డిసెంబర్ 9 ప్రకటనకు కొనసాగింపు లేదు. తెలంగాణ పరిస్థితిలో పెద్ద మార్పులేదు. తెలంగాణ ప్రజలలో, విద్యార్థులలో ఆందోళన ఏమీ తగ్గలేదు. వారి కళ్లముందర ఒక్క ఆశా సూచన అయినా, ఒక్క వెలుగురేఖ అయినా మిగలలేదు. కుడి ఎడమల దగా దగా, ఎటు చూస్తే అటు దగా. కేంద్ర ప్రభుత్వం మీద ఒత్తిడి పెంచడానికి వేసుకున్న రాజీనామా ప్రణాళికకు కాంగ్రెస్ నాయకులు, వారిని చూపెట్టి తెలుగుదేశం నాయకులు తూట్లు పొడిచారు.

ఈ స్థితిలో మళ్లీ ఒకసారి ఉద్యమాన్ని ఉధృతం చేయదలచిన విద్యార్థులు ఫిబ్రవరి 20న చలో అసెంబ్లీ పిలుపు ఇచ్చారు. 'మేం మా భవిష్యత్తు గురించి ఆందోళన పడుతుంటే, మా ప్రాణాలు బలిపెడుతుంటే మీరు కడుపులో చల్ల కదలకుండా, మీ కుర్చీలు వదిలకుండా బడ్జెట్లు చర్చిస్తారా' అని విద్యార్థులు, యువకులు ఆగ్రహ ప్రకటన చేయదలచారు. వేలాది పోలీసు, పారామిలిటరీ బలగాలను దింపి ఈ కనీస, ప్రజాస్వామిక, శాంతియుత నిరసన ప్రకటనను అణచివేయాలని ప్రభుత్వం ప్రయత్నించింది. 'మామాట వినిపించడానికి కూడ అడ్డం పడతారా' అని విద్యార్థి యువజనులకు దుఃఖం కలిగింది. ఆ ఆగ్రహం వయసు యాభై ఏళ్లనీ నలభై ఏళ్లనీ పది ఏళ్లనీ చాలమంది చెపుతారు గాని, విద్యార్థులు మాత్రం రెండు నెలలుగా తమ కళ్ల ముందు జరుగుతున్న మోసాలను చూసి ఆగ్రహపడ్డారు. రోజులు గడుస్తుంటే ఆ ఆగ్రహం నిస్సహాయం కావడం మొదలయింది. ఆ నిస్సహాయ ఆగ్రహమే సిరిపురం యాదయ్యను ఆత్మహత్యకు ప్రేరేపించింది. ఇంటర్ చదువు మధ్యలో ఆపవలసి వచ్చిన యాదయ్య, ఒక రెస్టారెంట్‌లో పనిచేస్తూ పొట్టపోషించుకుంటున్న అనాథ యాదయ్య తన కోపాన్ని ఎవరి మీద చూపాలో, ఎట్లా చూపాలో తేల్చుకోలేకపోయాడు. తనమీద తానే తీర్చుకున్నాడు. బహిరంగంగా వంటికి నిప్పంటించుకుని మనందరి కళ్లముందు కాలి కూలిపోయాడు.

పదహారేళ్ల ఆదిలాబాద్ లంబాడీ యువతి, ఇరవై ఏళ్లు నిండని రంగారెడ్డి జిల్లా అనాథ బహుజన యువకుడు, నవంబర్ 30న ఆత్మాహుతికి ప్రయత్నించి డిసెంబర్ 4న మరణించిన కాసోజు శ్రీకాంత్ చారి నుంచి ఇప్పటిదాకా ఆగకుండా సాగుతున్న ఆత్మహత్యల పరంపరలో మరణించిన మూడు వందల మంది విద్యార్థి యువజనులు ఏం కావాలని ఆశించారు? ఏం దొరకలేదని నిరాశపడ్డారు?

వారి ఆత్మ బలిదానాలు తప్పే. ఆ చావులను కీర్తిస్తే ఇతరులకు నమూనాలుగా కనబడతాయనే భయం నిజమే. ఆ అమాయకపు పిల్లలు ఇంకే దారీ కనబడక ఈ తప్పుడు దారిని ఎంచుకున్నారు కావచ్చు. ఎప్పుడయినా బతికి సాధించాలి గాని చచ్చిపోవడం మంచిది కాదని నీతులు చెప్పవచ్చు. కాని ఆలోచనాపరులమూ బుద్ధిమంతులమూ ప్రగతి వాదులమూ ఇతరుల తప్పులు ఎంచగల వాళ్లమూ అని మనకు మనం కితాబులు ఇచ్చుకుంటున్న మనం కనీసం ఒక్క నిమిషం ఆగి ఏ కారణాల వల్ల ఈ ఆత్మహత్యల పరంపర సాగుతున్నదో ఆలోచిస్తామా?

'ఆత్మహత్యలు, బలిదానాలు వద్దు' అనే శుష్కమైన ప్రకటనలు, పిలుపులు కాకుండా నిజంగా ఆ ఆత్మహత్యలు ఎందువల్ల జరుగుతున్నాయో, వాటిని ఆపే మార్గం ఏమిటో ఆలోచిస్తామా? ఈ ముక్కుపచ్చలారని పిల్లల మరణాల సాక్షిగానైనా మన బాధ్యతలనూ బాధ్యతారాహిత్యాలనూ గుర్తిస్తామా? ఇక నుంచి అయినా బాధ్యతగా ఉంటామని హామీ పడతామా?

నిజానికి ఈ ఆత్మహత్యలకు మనందరిదీ, మనలో ప్రతి ఒక్కరిదీ బాధ్యత. న్యాయం పక్షం వహించలేని వాళ్లది. న్యాయపక్షాన్ని బలోపేతం చేయడానికి మన శక్తియుక్తులన్నీ ఖర్చుపెట్టాలని అనుకోని వాళ్లది. ఈ సంక్షుభిత సమయంలో కూడ శవదహనాల మీద తమ పేలాలు వేయించుకు తిందామని అనుకుంటున్నవాళ్లది. న్యాయం గెలుస్తుందనే నమ్మకం ఇవ్వలేని వాళ్లది. అన్యాయాన్ని గెలిపించడానికి అర్థబలాన్నీ అంగబలాన్నీ ఆలోచనలనూ వాడుతున్నవాళ్లది. తెలుగు సమాజంలోని ప్రతి ఒక్కరి మనసుల మీద ఈ నెత్తుటి మరక అంటుకునే ఉంటుంది.

ఆ పసిమొగ్గలు రాలిపోకుండా ఉండాలంటే మనం చేసి ఉండగలిగిన పనులు చాల ఉన్నాయి. ఏ ఒక్కటీ మనం చేయలేదు. నిజానికి ఇవి ఆత్మహత్యలు కావు. హత్యలు. మనందరం, సభ్య సమాజం కలిసి చేసిన హత్యలివి.

ఈ హత్యలకు ప్రధాన, ప్రథమ బాధ్యత కేంద్ర ప్రభుత్వానిది. ఫజల్ అలీ కమిషన్ సిఫారసులను తుంగలో తొక్కిన నాటినుంచి, పెద్ద మనుషుల ఒప్పందం అమలు కాకపోతుంటే మౌనంగా ఉన్ననాటినుంచి, 1969 ఉద్యమాన్ని నెత్తురుటేర్లలో అణచివేసిన నాటినుంచి శ్రీకృష్ణ కమిటీ అనే బూటకపు తతంగం దాకా కేంద్ర ప్రభుత్వ నేరాల జబితా చాల పెద్దది. ఈ నేరాల గంజాయి వనం మధ్యలో ఒకే ఒక్క తులసిమొక్క డిసెంబర్ 9 ప్రకటన. ఆ ప్రకటనను కొనసాగించకపోవడం ద్వారా కేంద్ర ప్రభుత్వం వందలాదిగా విద్యార్థి యువజనులను హత్య చేస్తోంది. ఈ హత్యలు ఆగిపోవాలని చిత్తశుద్ధితో కోరుకునే వారెవరయినా డిసెంబర్ 9 ప్రకటనను అమలులో పెట్టమని కేంద్రప్రభుత్వం మీద ఒత్తిడి తేవాలి.

ఈ హత్యలకు బాధ్యత రాష్ట్ర ప్రభుత్వానిది. 1956 నవంబర్ 1న ఏర్పడిన నాటి నుంచీ తెలంగాణ ప్రాంత ప్రజల పట్ల అన్యాయాన్ని, వివక్షను, హామీల ఉల్లంఘనలను సాగిస్తూ వచ్చిన రాష్ట్ర ప్రభుత్వం చిట్టచివరికి నవంబర్ 29 నుంచీ సాగుతున్న ఆందోళన మీద అన్ని వైపుల నుంచీ దాడి సాగిస్తోంది. ఒకవైపు ఉద్యమం మీద అబద్ధాలు ప్రచారంచేయడం, మరోవైపు తెలంగాణ నుంచే కొందరు దళారీలను తయారుచేసి, కొనివేసి వారిని ఉద్యమానికి వ్యతిరేకంగా ఉపయోగించడం, అయినా పట్టుదలగా తెలంగాణ ఆకాంక్షలను ప్రకటిస్తున్న వారి మీద భయంకరమైన నిర్బంధాన్ని ప్రయోగించడం, ఇంత ఉద్యమం నడుస్తున్న రోజులలో కూడ నిస్సిగ్గుగా తెలంగాణ వ్యతిరేక నిర్ణయాలు చేయడం, ప్రకటనలు చేయడం, చివరికి తెలంగాణ విద్యార్థుల మీద అణచివేతను ఆపబోనని సుప్రీంకోర్టుకు వెళ్లడం – రాష్ట్ర ప్రభుత్వం మీద మోపగలిగిన హత్యాభియోగాలకు లెక్కలేదు. రాష్ట్ర ప్రభుత్వం చేస్తున్న ఈ పనులే ప్రత్యక్షంగా విద్యార్థి యువజనులను హత్య చేస్తున్నాయి. ఈ హత్యలు ఆగిపోవాలంటే ఈ హంతక ప్రభుత్వాన్ని తక్షణమే కట్టడి చేయవలసి ఉంది.

మూడో ముద్దాయిగా ఈ హత్యలకు బాధ్యత వహించవలసినది రాష్ట్రంలోని అన్ని రాజకీయ పార్టీలు. తెలంగాణ ప్రజల వోట్ల కోసం ఒక మాట, కోస్తాంధ్ర, రాయలసీమ సంపన్న వర్గాల ప్రయోజనాలకోసం మరొకమాట చెపుతున్న రాజకీయ పార్టీల రెండునాల్కల వైఖరే ప్రస్తుత హత్యలకు కారణం. తెలంగాణ సాధించేవరకు విశ్రమించబోమని, పదవులను, ప్రాణాలను తృణప్రాయంగా త్యజిస్తామని బీరాలు పలికిన కాంగ్రెస్ నాయకులు కేంద్రం మీద ఒత్తిడి చేసేలా రాజీనామా చేయడానికి వెనుకాడుతున్నారు. పదవికి అంటిపెట్టుకుని ఉండడానికి ఏ గడ్డి అయినా కరుస్తున్నారు. ఐక్య కార్యాచరణ సమితి నుంచి కూడ వైదొలిగారు. ఇక తెలుగుదేశం నాయకులు కాంగ్రెస్‌ను సాకుగా చూపి ఉద్యమాన్ని ఉధృతం చేయడానికి వెనుకాడుతున్నారు. ఇప్పటికి మూడుసార్లు రాజీనామా చేసిన అనుభవం ఉన్న తెరాస అధిపతి కొత్త రాజీనామా లేఖను ఆమోదం పొందడానికి వీలులేని పద్ధతిలో రాశారు. గత అరవై ఏళ్ల చరిత్రలో పార్లమెంటరీ రాజకీయ పక్షాలన్నీ కూడ తెలంగాణకు ద్రోహం చేసినవే. ఆ ద్రోహాల కుప్ప పెరిగి పెరిగి ఇవాళ తెలంగాణ విద్యార్థి యువజనులను హత్యలు చేస్తున్నది. ఈ హత్యలు ఆగిపోవాలని కోరుకునే వారెవరయినా ఈ రాజకీయ పార్టీల బండారాన్ని బయట పెట్టవలసి ఉంటుంది. రాజకీయ పక్షాలు ఎంత అవిశ్వసనీయమైనవో ప్రజలకు తెలియజెప్పవలసి ఉంటుంది. రాజకీయ పార్టీలను ఎంత మాత్రం నమ్మనక్కరలేదని, వారి పని కేవలం పార్లమెంటులో తెలంగాణ బిల్లు వచ్చినప్పుడు వోటు వేయడం మాత్రమేననీ, అంతకన్న ఎక్కువ గౌరవం, స్థానం వారికి ఇవ్వనక్కరలేదని ప్రజలకు తెలియజేయవలసి ఉంటుంది.

నాలుగో ముద్దాయిగా ఈ హత్యలకు బాధ్యత వహించవలసినది కోస్తాంధ్ర పెట్టుబడిదారులు, సంపన్నులు, రాజకీయ నాయకులు. సమైక్య ఆంధ్రప్రదేశ్ పేరుతో తెలంగాణ వనరులను తెలంగాణ ప్రజల నుంచి కొల్లగొట్టి వందల, వేల కోట్ల రూపాయలు ఆర్జించిన ఈ పెద్దమనుషులు, తమ దోపిడీ కబంధ హస్తాల నుంచి తెలంగాణను విడుదల చేయదలచు కోలేదు. అందుకే ఢిల్లీలోనూ, ఇతరచోట్లా వందల కోట్ల రూపాయలు ఖర్చు పెడుతూ సమైక్య ఉద్యమం అనేది నడుపుతున్నారు. కోస్తాంధ్ర, రాయలసీమ ప్రజలలోని అమాయకత్వాన్ని ఆసరాగా చేసుకుని, వారికి అబద్ధాలు చెపుతూ, తమ ప్రయోజనాలనే ప్రజల ప్రయోజనాలుగా నమ్మిస్తూ ఉద్యమం నడుపుతున్నారు. ఇలా అధర్మం మీద ఆధారపడిన ఒక చర్యో, ఒక మాటో అటు జరగగానే అది తెలంగాణ విద్యార్థి యువజనులలో నిరాశకు కారణమవుతున్నది. ప్రత్యర్థుల అర్థబలం, అంగబలం ముందు తమ న్యాయమైన ఆకాంక్ష భగ్నమైపోతుందేమోననే భయం ముప్పిరిగొంటున్నది. తమ కళ్లముందరే డిసెంబర్ 9 ప్రకటన నుంచి కేంద్ర ప్రభుత్వం వెనక్కి తగ్గిందంటే కోస్తాంధ్ర, రాయలసీమ సంపన్నుల కుయుక్తులు ఎంత బలమైనవో అర్థమై తెలంగాణ ప్రజలలో నిస్సహాయత పెరుగుతున్నది. ఆ నిస్సహాయతే వారి హత్యలకు కారణమవుతున్నది. ఈ హత్యలు ఆగిపోవాలని కోరుకునేవారెవరయినా వెంటనే కోస్తాంధ్ర, రాయలసీమ సంపన్నుల రహస్య వ్యాపార ఎజెండాలను బయటపెట్టాలి. కోస్తాంధ్ర, రాయలసీమ ప్రజలు తమ నాయకుల ఉచ్చులో చిక్కుకోకుండా కాపాడాలి. ధనబలంతో, అబద్ధాలతో

గెలుపు సాధ్యం కాదనీ, తాత్కాలికంగా గెలుపులాగ కనిపించినది కూడ దీర్ఘకాలికంగా, నైతిక అర్థంలో గెలుపు కాదనీ చెప్పాలి.

ఈ హత్యలకు తెలంగాణ ఉద్యమకారులు కూడ బాధ్యత వహించవలసి ఉంటుంది. తెలంగాణ రాష్ట్రం ఒకానొక పాలనాపరమైన మార్పే తప్ప, దాని ద్వారా స్వర్గం ఏర్పడదని, ఎక్కువలో ఎక్కువ నీళ్లు, నిధులు, నియామకాలు, కేటాయింపులలో జరిగిన అన్యాయాలు సవరించడం మాత్రమే జరుగుతుందనీ, అప్పటికీ అది ప్రజా తెలంగాణ కాకపోవచ్చుననీ తెలియజెప్పడంలో తెలంగాణ ఉద్యమకారులు విఫలమయ్యారు. ఒక శ్వేతకూ, ఒక యాదయ్యకూ, అటువంటి నవయువకులందరికీ తెలంగాణ వస్తే ప్రపంచమే మారిపోతుందనే ఆశను కల్పించారు. ఈ మితిమీరిన ఆశలు ఎదురుదెబ్బ తగిలినప్పుడు నిరాశగా మారడం, ఆత్మహత్యకు పురికొల్పడం సహజమే. అలాగే, అటువంటి ఆశను ప్రోది చేసిన ఉద్యమ నాయకత్వం ఆ ఆశకు తగిన క్రియాశీలమైన, శక్తిమంతమైన పోరాట రూపాలను ప్రజలముందు ఉంచలేదు. ఉద్యమంలో ప్రజల భాగస్వామ్యం పెరిగినకొద్దీ, ఉద్యమం ఉధృతమైనకొద్దీ, పోరాట రూపాలను ఉన్నతదశకు ఎదిగించవలసి ఉంటుందని గుర్తించలేదు. కాలం గడిచినకొద్దీ పాత పోరాటరూపాలే సాగుతూ, ఫలితమేమీ కనబడకపోవడంతో నిరాశ వ్యాపించడం మొదలయింది. దూరదృష్టిని, పోరాటపు ఒడిదుడుకులపట్ల చైతన్య పూరితమైన అవగాహనను కలిగించి ఉంటే ఈ తాత్కాలిక నిరాశను జయించి పోరాటాన్నిముందుకు తీసుకుపోయే అవకాశం ఉండేది. కాని ప్రస్తుత ఉద్యమ నాయకత్వానికి ఆ పని చేయాలనే కోరిక లేకనో, చేసే సామర్థ్యం లేకనో ఆ పని మాత్రం జరగలేదు. కనుక ప్రస్తుత హత్యల పరంపర ఆగాలంటే ఈ రెండున్నరనెలల ఉద్యమం నుంచి పాఠాలు తీసుకుని కొత్త, విస్తృతమైన, శక్తిమంతమైన పోరాటరూపాలు కనిపెట్టడం, ప్రజల భాగస్వామ్యాన్ని పెంచడం, పాల్గొంటున్న ప్రజల చైతన్యాన్ని, అవగాహనను పెంచడం సాగించాలి.

ఈ హత్యలకు కొంత బాధ్యత ప్రచార సాధనాలు కూడ తీసుకోవలసి ఉంటుంది. సంచలనాల ద్వారా తమ ఆర్థిక ప్రయోజనాలు సాధించుకోదలచిన ప్రచార, ప్రసార సాధనాలు ప్రతి ఆత్మహత్యనూ ఒక సంచలన వార్తగా మాత్రమే చూస్తున్నాయి, చూపిస్తున్నాయి. ఒక నమూనాగా చూపిస్తున్నాయి. తద్వారా రాబోయే ఆత్మహత్యలను ప్రేరేపిస్తున్నాయి. ఇటువంటి ఘటనలను తగిన మోతాదులోనే చూపడం, సంచలనాత్మకం చేయకపోవడం, అటువంటి ఘటన చూపెట్టక తప్పనప్పుడు కూడ అది మార్గం కాదనే మాట ఒకటికి పది సార్లు చెప్పడం ప్రచార సాధనాల సామాజిక బాధ్యత. కాని అవి ఆ పని చేయడం లేదు. ఇప్పటికైనా ఆ పని సాగితేనే, ప్రస్తుత ఆత్మహత్యల పరంపర ఆగిపోవడానికి వీలవుతుంది.

ఇక ఈ హత్యలలో మేధావుల బాధ్యత కూడ ఉంది. గత రెండున్నర నెలలుగా పత్రికలలో వ్యాసాలు రాస్తున్న, టివి చర్చలలో తమ అభిప్రాయాలు ప్రకటిస్తున్న మేధావులు చెప్పిన ప్రతి అబద్ధమూ ఒక బలి కోరుతున్నది. తన పొలానికి నీళ్లందక, తన తండ్రికి ఉద్యోగం రాక, తనకు సరయిన చదువు అందక, తన కళ్లముందర తెలంగాణకు ఎటువంటి అన్యాయం జరిగిందో చూసిన తెలంగాణ విద్యార్థి యువజనులు, పత్రికలలోనో, టివిలోనో తెలంగాణకు ఏమీ అన్యాయం జరగలేదని మేధావులు ప్రకటిస్తున్న అబద్ధాలు విని అవమాన పడుతున్నారు, నిరాశపడుతున్నారు. లోకమంతా ఒక్కటయి తనకు అన్యాయం చేస్తోందని, తనమీద జరిగిన అన్యాయాన్ని సమర్థిస్తోందని బాధపడుతున్నారు. అది ఆత్మహత్యలకు దారితీస్తోంది. ఈ నవయువకుల బలిదానాలపట్ల స్పందించే సున్నిత హృదయం, ఇలా జరగగూడదని భావించే మానవత్వం ఇంకా మిగిలి ఉంటే మేధావులు కనీసం తమ అబద్ధాలను మానేయాలి.

ఈ హత్యలకు బాధ్యత ప్రజలందరిదీ కూడ. ఉద్యమంలో ఇంకా ఎక్కువగా పాల్గొని, ఉద్యమాన్ని ఇంకా సమరశీలంగా మార్చి తక్షణ పరిష్కారం దిశగా ఉద్యమాన్ని నడపలేకపోతున్న తెలంగాణ ప్రజలది. కోస్తాంధ్ర, రాయలసీమ ప్రజలకు తమ ఆకాంక్షల న్యాయబద్ధతను వివరించి సంఘీభావం కూడగట్టలేకపోతున్న తెలంగాణ ప్రజలది. తెలంగాణ ప్రజల ఆందోళనలో న్యాయం ఉన్నదని గుర్తించి, ఆ ఆందోళనను సమర్థించి, సంఘీభావం ప్రకటించే బదులు, తమ నాయకుల ఉచ్చులలో పడి, తాము మోసపోతూ తెలంగాణ విద్యార్థి యువజనులను ఆందోళన పరుస్తున్న కోస్తాంధ్ర, రాయలసీమ ప్రజలది. పిడికెడు మంది ఆందోళనకారులు సమైక్యాంధ్ర అంటూ ఉంటే, ఆ భావాలేమీ లేకపోయినా వారిని ఖండించకుండా మౌనంగా ఉండిపోతున్న విశాల కోస్తాంధ్ర, రాయలసీమ ప్రజారాశులది.

ఈ హత్యలకు బాధ్యత మనలో ప్రతి ఒక్కరిదీ. ప్రజా న్యాయస్థానం ముందర మన మీద మోపుతున్న ఈ హత్యా అభియోగాలకి జవాబు చెప్పుకోవలసిన బాధ్యత మనదే. వీ

**మేలైన, ఆరోగ్యకరమైన సస్య రక్షణ పద్ధతులు రైతులకు తెలుసుననీ, పత్తి, వంకాయ మాత్రమే కాకుండా ఇంకా అనేక ఇతర పంటలలోకి చొచ్చుకు రాబోతున్న ప్రమాదకర జన్యు మార్పిడి పంటల అవసరం లేదనీ అంటున్నారు రాంకి**

# బి.టి. వంకాయ వద్దే వద్దు!

మనిషి సాధించిన అభివృద్ధి అంతా ఎక్కడో ఓ చోట శాస్త్రీయతకూ, ప్రకృతికీ లోబడకుండా సాగితే ఎదురయ్యే అనర్థాలు ఈ రోజు పర్యావరణ విధ్వంసంలో మనం చూస్తూనే ఉన్నాం. దాని పర్యవసానాలు అనుభవిస్తూనే ఉన్నాం. హరిత విప్లవం వ్యవసాయంలోకి తెచ్చిన పురుగు మందులు, ఎరువులు చేసిన మేలుకన్నా, జరిగిన కీడు మనకు అర్థమయ్యే లోపులోనే గత పదిహేనేళ్లలో రెండు లక్షలకు పైగా రైతాంగం ఆత్మహత్యల పాలయ్యారు. అయినా మరోపక్క కొత్త కొత్త పరిశోధనల పేరిట మానవాళి, పర్యావరణాలపై ప్రభావాలు ఏమిటో తెలియకుండానే లాభాపేక్ష విధానాలతో ప్రమాదకర సాంకేతికతకు ప్రభుత్వం అనుమతులు ఇవ్వడం వ్యవసాయరంగంలో, పారిశ్రామికరంగంలో చూస్తూనే ఉన్నాం.

బిటి అంటే బాసిల్లస్ థురింజెనిసిస్ అనే ఒక బ్యాక్టీరియా. ఆ బ్యాక్టీరియా నుంచి థురింజెన్ అనే రసాయనం ఉత్పత్తి అవుతుంది. ఇది పంటపై వచ్చే పురుగుల నివారణకు ఉపయోగపడుతుంది. ఈ బ్యాక్టీరియా నుంచి సేకరించిన జన్యువును పత్తిలో ప్రవేశపెట్టి బిటి పత్తిగా గతంలో విడుదల చేశారు. అంటే, ఈ థురింజెన్ అనే విషం పత్తిలోనే ఉత్పత్తి అవడం వల్ల, ఆ పత్తి రకం పత్తిని తినే పురుగులను నివారించే లక్షణం కలిగి ఉంటుంది. దీని ప్రభావం మానవాళిపై, పశువులపై, పర్యావరణంపై ఎలా ఉంటుందో మనకు తెలియదు. అయితే ఇటువంటి బిటి పత్తి ఆకులు తిన్న మేకలు చనిపోయినట్లు ఇప్పటికే ఆధారాలు ఉన్నాయి.

ఉత్తర భారతదేశంలో, ఇంకా కొన్ని ప్రాంతాల్లో పత్తిగింజల నుంచి తీసిన నూనెను (హృద్రోగులు) తినడానికి ఉపయోగిస్తారు. బిటి పత్తిగింజల నుంచి తీసిన నూనె తిన్నవారిపై కలిగే దీర్ఘకాలిక ప్రభావాలేమిటో ఇంతవరకు శాస్త్రీయ అధ్యయనాలు లేవు. ఇటువంటి ఆందోళనలు అనేకం ఉండగానే గతంలో బిటి పత్తికి భారత ప్రభుత్వం అనుమతించింది.

బిటి పత్తి వివాదం ఉండగానే ఇప్పుడు అదే బిటి జన్యువును వంకాయలోనూ కాయతొలుచు పురుగు నివారణ కోసం ప్రవేశపెట్టడానికి భారత ప్రభుత్వం అనుమతి ఇవ్వడానికి సిద్ధపడింది. అయితే సర్వత్రా ఆందోళనలు వ్యక్తం కావడంతో ప్రస్తుతానికి వెనక్కి తగ్గింది. బిటి వంకాయ మనకు అవసరం లేదని, పురుగులు తినగా మిగిలిన వంకాయలు మన దేశ అవసరాలకు సరిపోతాయని ఒక శాస్త్రవేత్త అనడం గమనార్హం. కొన్ని అభివృద్ధి చెందిన దేశాలలో పురుగుకొట్టిన కాయలను, పండ్లను ప్రత్యేకించి ఏరుకుంటారు. పురుగు కొట్టింది అంటే ఆ కాయ లేక పండుపై పురుగు మందు సరిగా పడలేదనీ, అవి తినడానికి చాలా మంచివని వారి ఉద్దేశం.

వంకాయ (సొలానమ్ మెలాన్‌జెనా) మనదేశంలో పుట్టి నాలుగు వేల సంవత్సరాలుగా సాగవుతోంది. భారత దేశ కూరగాయల ఉత్పత్తిలో బంగాళదుంపది ప్రథమస్థానం అయితే, వంకాయది రెండవస్థానం. దేశంలో ఉత్పత్తి అయ్యే కూరగాయలలో వంకాయ తొమ్మిది శాతంగా ఉంది. విస్తీర్ణంలో వంకాయ పంట 8.14 శాతం ఉంది.

భారతదేశంలో దాదాపు 2500 రకాల వంగజాతులు ఉన్నాయి. వంకాయ తక్కువ కెలరీలు, తక్కువ కొవ్వు పదార్థాలు కలిగి ఎక్కువ నీరు, కొద్దిమొత్తంలో మాంసకృత్తులు, పీచు పదార్థాలు, పిండి పదార్థాలు కలిగి ఉంటుంది. ఖనిజ లవణాలు, విటమిన్ ఎ బి లు దీని నుంచి లభిస్తాయి.

భూమిలో నివసించే బాసిల్లస్ థురింజెనిసిస్ బ్యాక్టీరీయాలోని క్రై1ఎసి అనే జన్యువును వంగలో చొప్పించి జన్యుపరమైన మార్పు చేసి రూపొందించిన వంగనే బిటి వంగ అంటారు. దీనివల్ల తరచుగా వంగను ఆశించే కాయ, కాండం తొలిచే పురుగులను తట్టుకొనే శక్తి వస్తుంది. అయితే మనదేశంలో బిటి వంగ చాలా చర్చలకు తెరలేపింది. ఈ రకాన్ని ప్రోత్సహించే వాళ్లు బిటి వంగ పురుగును తట్టుకొని, అధిక దిగుబడులను ఇచ్చి, ఉత్పత్తి వ్యయాన్ని తగ్గించి, పర్యావరణంపై తక్కువ ప్రభావంతో సన్న, చిన్నకారు రైతులకు మేలు చేకూరుతుందని వాదిస్తున్నారు. కాని వాస్తవానికి బిటివంగ ప్రభావంవల్ల మానవజాతి ఆరోగ్యం దెబ్బతింటుందనీ, మానవాళి భద్రతకు ప్రమాదకరమనీ, జీవన విధానంలో మార్పులు వచ్చి, జీవజాతుల్లో సమతుల్యత లోపిస్తుందనీ కొందరు ఆందోళన వ్యక్తం చేస్తున్నారు.

మరో కోణం ఏమంటే ఇటువంటి బిటి వంకాయను విస్తారంగా పండిస్తే ఇక బిటి బంగాళదుంప, బిటి టమాట ప్రవేశపెట్టే అవసరం లేదనీ, రెండు దశాబ్దాలలో బంగాళదుంప, టమాట, మిరప సహజంగానే బిటి జన్యువును సొంతం చేసుకుంటాయనీ, జన్యు మార్పిడి పంటలుగా మారిపోతాయనీ శాస్త్రవేత్తలు అభిప్రాయపడుతున్నారు. అప్పుడు సాధారణ పంటను సాగుచేయలేరు. కేవలం బిటి పంటను మాత్రమే పండించాలి.

సమర్థవంతమైన జీవ నియంత్రణ పద్ధతులు, సమగ్ర సస్య రక్షణా పద్ధతులను ఇప్పటికే రైతులు ఉపయోగించుకుంటున్నారు. బిటి వంగలోని చొప్పించిన విషపూరిత జన్యు ప్రభావంతో తినేవారి ఆరోగ్యానికి హానికరం. పురుగులను సాధారణ పద్ధతులలోనే మనం నివారించగలం. పత్తి ఉదాహరణను చూస్తే, బిటి పత్తిలో క్రిమిసంహారక మందులు వినియోగించడం క్రమేణా ఎక్కువైనట్లు రైతులకు అనుభవంలో ఉంది.

బిటి జన్యువును సాధారణ రకాలలో, హైబ్రిడ్స్‌లో చొప్పించడం వలన మన దేశంలోని ప్రకృతి సిద్ధమైన వంగ రకాలకు నష్టం చేకూరుతుంది. మామూలుగానే వంగ తినడం వల్ల కొన్ని అలర్జీలు వచ్చే అవకాశం ఉంది. ఇది బిటి వంగ వల్ల మరింత ఎక్కువయ్యే అవకాశాలు లేకపోలేదు.

పురుగు మందులు మనిషి ఆరోగ్యానికి సురక్షితం అని చెప్పే విడుదల

*ప్రపంచవ్యాప్తంగా సంభవించిన ఆర్థిక సంక్షోభాలను ప్రస్తావిస్తూ, ముఖ్యంగా ఇవి పెట్టుబడిదారీ దేశాలలోనే సంభవించాయనీ, వీటిని సమగ్రంగా అధ్యయనం చేసి అట్టడుగు మనిషి కేంద్రంగా అభివృద్ధి సాగాలనీ అంటున్నారు* **గుమ్మడి నరేష్**

# ఆర్థిక వ్యవస్థలలో సంక్షోభం

ప్రపంచంలో గల దేశాలు మూడు రకాల ఆర్థిక వ్యూహాలను తమ అభివృద్ధి కోసం అనుసరిస్తూ ఉంటాయి. అవి పెట్టుబడిదారీ ఆర్థిక వ్యవస్థ, సామ్యవాద ఆర్థిక వ్యవస్థ, మిశ్రమ ఆర్థిక వ్యవస్థ. అయితే ఇలా ఏ ఆర్థిక వ్యవస్థను అనుసరించినా కూడా ఆయా దేశ ఆర్థిక వ్యవస్థలు క్లిష్ట పరిస్థితులకు, సంక్షోభాలకు గురవుతూనే ఉంటాయి. 1929 ఆర్థిక మాంద్యం నుంచి 2008 అమెరికా ఫైనాన్షియల్ సంక్షోభం వరకూ ఎన్నో రకాలైన సంక్షోభాలను ప్రపంచం చవిచూసింది. ఈ సంక్షోభాలలో అగ్రభాగం పెట్టుబడిదారీ దేశాలలో సంభవించినవే. అయితే నిపుణుల అభిప్రాయం ప్రకారం ఆర్థిక కార్యకలాపాలలో సంక్షోభం అనేది ఈనాటిది కాదు. ఆర్థిక చలాంశాలు ఆదాయం, వినియోగం, ఉత్పత్తి, ఉద్యోగితా, పెట్టుబడి, వడ్డీ, పొదుపు, తలసరి ఆదాయం, జాతీయాదాయం, వినియోగం మొదలైనవన్నీ కూడా స్థిరమైన చలాంశాలు కాదు. ఇవి మానవుని ఆర్థిక వ్యవహారాలతో పాటు కాలానుగుణంగా మారుతుంటాయి. ఈ చలాంశాలన్నీ కూడా ఒకదానిపై ఒకటి ఆధారపడి ఉండడం వల్ల, నిరంతరం ఒక ప్రవాహం లాగా కదులుతుండడం వల్ల వీటిలో ఏ ఒక్క చలాంశం అయినా స్థిరత్వానికి గురైనా లేదా ఎక్కువగా కదిలినా దాని ప్రభావం మిగతా చలాంశా లన్నింటిపై పడుతుంది. తత్ఫలితంగా ఆర్థిక ప్రవాహంలో అలజడి జరిగి క్లిష్టంగా మారి సంక్షోభంగా తయారవుతుంది అని తెలియజేస్తున్నారు.

19వ శతాబ్దంకు ముందు యుద్ధాలు, భూకంపాలు, వరదలు కరువుకాటకాలు లాంటి బహిర్గత ప్రకృతి వైపరీత్యాలు సంభవించినప్పుడు ఆర్థికవ్యవస్థ సంక్షోభంలో చిక్కుకుంది అని తెలియజేసేవారు. అనగా ఆర్థిక సంక్షోభాన్ని తెలియజేయడానికి స్పష్టమైన గణాంకాలు, అంచనాలు అందుబాటులో లేవు. 19వ శతాబ్దం నుంచి ఆర్థిక వ్యవస్థలలో క్లిష్ట పరిస్థితులను, సంక్షోభాలను గుర్తించడానికి కొన్ని సంస్థలు వెలిశాయి. ఉదాహరణకు నేషనల్ బ్యూరో ఆఫ్ ఎకనమిక్ రీసెర్చ్ (ఎన్.బి.ఇ.ఆర్.). ఇది అమెరికా ఆర్థికవ్యవస్థలో సంభవించే సంక్షోభాలను, క్లిష్ట పరిస్థితులను ఆరంభం దగ్గర నుంచి ముగింపు వరకు అధికారికంగా గణాంకాల ఆధారంగా తెలియజేస్తుంది. అయితే ఎన్.బి.ఇ.ఆర్. ప్రకారం నిజ స్థూల దేశీయోత్పత్తి, నిజ ఆదాయం, ఉద్యోగితా, పరిశ్రమల ఉత్పత్తి, హోల్‌సేల్ రిటైల్ ధరలు నెలలుగా పడిపోతుండడంను ఆర్థిక సంక్షోభంగా తెలియజేయవచ్చు అని నిర్వచించింది. అంతేకాక వరుసగా రెండూ లేదా అంతకంటె ఎక్కువ త్రైమాసికాలు ఆ దేశ స్థూల జాతీయోత్పత్తి (జి.డి.పి.) తగ్గుతూ ఉన్నట్లయితే ఆర్థిక కార్యకలాపాలు క్లిష్టపరిస్థితిలో ఉన్నట్లుగా నిపుణులు భావిస్తున్నారు.

1929లో ఆర్థిక మాంద్యానికి ముందు సంప్రదాయ ఆర్థిక వేత్తలు ఆర్థిక వ్యవస్థలో ఎల్లప్పుడూ సంపూర్ణ ఉద్యోగితా ఉంటుంది. అంతేకాక సప్లై తన డిమాండ్ తానే సృష్టించుకుంటుంది అనే భావనను ఉపయోగించి తెలిపారు. అయితే ఈ సంక్షోభంతో ఈ రకమైన భావనకు ముగింపు పడింది అని నిపుణులు తెలియజేస్తున్నారు. ఈ ఆర్థిక సంక్షోభం అమెరికా వాల్‌స్ట్రీట్ స్టాక్ మార్కెట్ 1929 అక్టోబర్ 27న పతనం జరగడంతో ఆరంభం అయ్యింది. ఈ పతనాన్ని వారు 'బ్లాక్ థర్స్‌డే'గా పిలిచారు అని మేధావుల అభిప్రాయం. ఈ సంక్షోభ కాలంలో అమెరికా స్థూలదేశీయోత్పత్తి 1930లో 8.6 శాతం కాగా, 1931లో 6.4 శాతానికి, 1932లో 13 శాతానికి, 1933లో 1.3 శాతానికి పడిపోయింది. నిరుద్యోగం 25 శాతం పెరిగింది. వేతనాలు 42 శాతం పడిపోయాయి. ఉత్పత్తి 103 బిలియన్ డాలర్ల నుంచి 55 బిలియన్ డాలర్లకు పడిపోయింది. అమెరికా ఎగుమతులు 1929లో 5.2 బిలియన్ డాలర్లు ఉంటే 1933 నాటికి 1.7 బిలియన్ డాలర్లకు తగ్గింది. జర్మనీ అత్యధిక నిరుద్యోగాన్ని ఎదుర్కొన్నది. అంతేకాక ప్రజలు ఆకలి బాధ భరించలేక ఆత్మహత్యలకు పాల్పడ్డారని ఎన్నో నివేదికలు తెలియజేస్తున్నాయి.

ప్రపంచంలో చాలా ధనవంతమైన దేశం అమెరికా దాని ఆర్థిక వ్యవస్థ సంక్షోభాలను పరిశీలించినట్లయితే అది అనుసరిస్తున్న పెట్టుబడిదారీ ఆర్థిక వ్యవస్థ విధానంలో ఉన్న లోపాలు వెలుగు చూస్తాయి. దానికి గల కారణం అమెరికా ఆర్థిక వ్యవస్థ చరిత్రలో గల సంక్షోభాలు.

---

చేశారు. కాని కాలక్రమేణా వాటి విష ప్రభావాన్ని గుర్తించారు. జెనిటిక్ ఇంజనీరింగ్ వల్ల మనిషి ఆరోగ్యం పైన ప్రభావాల్ని ఇంకా గమనించాల్సే ఉంది. ఈ భూమ్మీద మనిషి కన్నా ఇరవై కోట్ల సంవత్సరాల ముందే పుట్టి, జంతు జాలంలో 75 శాతంగా ఉండి మనుగడ సాగిస్తున్న పురుగులను ప్రకృతిలో భాగంగా చూడడమే కాదు, ప్రకృతికి లోబడి మనం నివారణ చర్యలు చేపట్టాలి.

దేశవ్యాప్తంగా ఎదురయిన వ్యతిరేకతతో ప్రభుత్వం ఎట్టకేలకు బిటి వంగపై తాత్కాలికంగా వెనక్కి తగ్గింది. వ్యాపారాత్మకంగా బిటి వంగ సాగును ప్రస్తుతానికి అంగీకరించకూడదని ప్రభుత్వం నిర్ణయించింది. శాస్త్రవేత్తలు, రైతులలో దీనిపై ఏకాభిప్రాయం కుదరకపోవడంతో మరిన్ని పరీక్షలు చేయాలని నిర్ణయించినట్లు కేంద్ర పర్యావరణ, అటవి శాఖ మంత్రి జైరాం రమేష్ ఫిబ్రవరి 9న ఒక ప్రకటనలో తెలియజేశారు. ప్రస్తుత ఈ నిర్ణయం వంకాయకే పరిమితం అని, భవిష్యత్తులో బెండకాయ, క్యాబేజి, బియ్యం వంటి ఉత్పత్తుల్లో జన్యు పరివర్తిత పంటలపై ఈ నిషేధం ఉండబోదని, భవిష్యత్తు వ్యూహాన్ని బయటపెట్టారు.

ప్రభావాలూ, ఫలితాలూ, జరగబోయే నష్టాలూ, జరిగే మేలూ(?) ఏమైనా రైతులకు శాస్త్రీయంగా అవగతమయ్యే దాకా ఇలాంటి సాంకేతిక పరిజ్ఞానాన్ని రైతులు ఆమోదించరు. రైతుల తీవ్ర ప్రతిఘటనకు, ఆందోళనకు ప్రభుత్వాలు ఇంత వరకూ తీసుకువచ్చిన విధానాలు, వాటి ఫలితాలే కారణం. వీ

- ఫ్రెంచ్ విప్లవం జరగడం, ఇంగ్లాండ్ ఆర్థికరంగం దీని ప్రభావానికే గురి కావడం బ్యాంక్ ఆఫ్ ఇంగ్లాండ్ చెలామణిలో గల ద్రవ్యాన్ని తగ్గించడం లాంటి కారణాలతో 1777లో ఆర్థికరంగంలో అలజడి సంభవించింది.
- అమెరికా అధ్యక్షుడు జాఫర్‌సన్ ఎగుమతి - దిగుమతి వ్యాపార సౌకర్యాల నిషేధ చట్టం ఎంబార్గో యాక్ట్ 1807లో చేయడం ద్వారా 1807లో అమెరికా ఆర్థిక వ్యవస్థ సంక్షోభంలో పడింది.
- 1812లో యుద్ధం జరగడం, మొదటి ఫైనాన్షియల్ సంక్షోభంగా చెప్పవచ్చు. 1819లో అమెరికా ఆర్థికరంగంలో అలజడి జరిగింది.
- అమెరికా బ్యాంకులు తమ లావాదేవీలన్నీ కూడా గోల్డ్, సిల్వర్ నాణాలను ఆపివేయడంతో 1837లో ఆర్థికరంగంలో, అలజడి సంభవించింది.
- యూరప్‌లోగల అంచనా వ్యాపారం అనే బుడగ పగిలి పోవడంతో 1857లో మళ్లీ ఆర్థికరంగంలో అలజడి సంభవించింది.
- యూరప్‌లో గల ఆర్థిక సమస్యలతో అమెరికా అతి పెద్ద బ్యాంక్ అయిన జాయ్‌కుక్ అండ్ కంపెనీ వైఫల్యంతో 1873లో ఈ అలజడి జరిగింది.
- ఆస్ట్రియా రాజధాని వియన్నాలో స్టాక్ ఎక్స్ఛేంజ్ పడిపోవడంతో 1873లో దీర్ఘకాల సంక్షోభం ఎదుర్కొంది.
- రైల్‌రోడ్ సంస్థల వైఫల్యం, స్టాక్ మార్కెట్ నుంచి యూరప్ పెట్టుబడులు ఉపసంహరించుకోవడం లాంటి సమస్యలతో 1893లో మళ్లీ సంక్షోభం మొదలయింది.
- క్నికర్ బొకర్ ట్రస్ట్ కంపెనీ అక్టోబర్ 22న వైఫల్యంతో 1907లో ఆర్థికరంగంలో అలజడి జరిగింది.
- 1918లో మొదటి ప్రపంచ యుద్ధం తరువాత క్లిష్ట పరిస్థితి.
- ప్రపంచవ్యాప్తంగా స్టాక్ మార్కెట్లు కుప్పకూలడం, బ్యాంకింగ్ రంగం దెబ్బతినడంతో 1929-30లో గొప్ప సంక్షోభం తలెత్తింది.
- 1937లో ఆర్థికరంగంలో మళ్లీ క్లిష్ట పరిస్థితులు రావడం.
- రెండవ ప్రపంచయుద్ధం, అమెరికా ప్రభుత్వం వ్యయాన్ని తగ్గించడంతో 1945లో మళ్లీ సంక్షోభ పరిస్థితులు తలెత్తాయి.
- 1953లో కొరియా యుద్ధం, విపరీత ద్రవ్యోల్బణం మొదలయిన కారణాలతో 1953లో క్లిష్టపరిస్థితులు ఎదుర్కొంది.
- 1958లో కఠిన ద్రవ్యోల్బణాన్ని అనుసరించడం, బడ్జెట్ సమతౌల్యంలో మార్పులు మొదలయిన కారణాలు సంక్షోభాన్ని తెచ్చాయి.
- 1960-61లో కూడా ఆర్థిక వ్యవస్థలో క్లిష్ట పరిస్థితులు రావడం జరిగింది.
- 1973లో ఒపెక్ దేశాలు ఆయిల్ ధరలు పెంచడం, వియత్నాం యుద్ధంతో ప్రభుత్వ వ్యయం పెరగడంతో ఆయిల్ సంక్షోభం తలెత్తింది.
- 1980లో ఇరాక్ విప్లవం, 1979లో ప్రపంచవ్యాప్తంగా ధరలు పెరగడంతో సంక్షోభ ఛాయలు కనిపించాయి.
- 2000 ప్రారంభంలో డాట్ కామ్ బుడగ పగిలిపోవడం, సెప్టెంబర్ 11, 2001 దాడి మొదలయిన కారణాలతో ఆర్థిక కార్యకలాపాలలో క్లిష్ట పరిస్థితి తలెత్తింది.
- 2000 తరువాత అమెరికాలో ఇళ్ల ధరలు పడిపోవడం, ఆయిల్ ధరలు, ఆహార ధరలు పెరగడం, బ్యాంకింగ్ రంగం వైఫల్యం మొదలయిన కారణాలతో సంక్షోభం అలముకుంది.

పెట్టుబడిదారీ విధానంలో గల స్వేచ్ఛాపూరితమైన వాతావరణం, నియంత్రణా కార్యక్రమాలు తక్కువగా ఉండడం చేత ప్రపంచ ధనవంతమైన దేశం ఎన్నో రకాలయిన సంక్షోభాలను చవిచూస్తూనే ఉంది. ఇవి మాత్రమే కాక ప్రపంచ వ్యాప్తంగా 20వ శతాబ్దంలో సంభవించిన కొన్ని పెద్ద సంక్షోభాలను పరిశీలిస్తే పెట్టుబడిదారీ సమాజంలో గల లోపాలు బయల్పడతాయి.

- 1910 షాంగై రబ్బర్‌స్టాక్ మార్కెట్ సంక్షోభం.
- 20వ శతాబ్దంలో సంభవించిన అతి పెద్ద ఆర్థిక మాంద్యం 1930లో సంభవించింది.
- 1973 ఆయిల్ ధరల సంక్షోభం.
- 1973-74 స్టాక్ మార్కెట్ పతనం.
- 1980 లాటిన్ అమెరికా అప్పుల సంక్షోభం. ఇది మెక్సికోలో ఆరంభమయ్యింది.
- 1987 ఒక్క రోజులో లావాదేవీలన్ని పడిపోవడంతో స్టాక్ మార్కెట్‌లో దీనినే 'బ్లాక్ మండే' అన్నారు.
- 1989-91 అమెరికాలో పొదుపు, రుణాల సంక్షోభం.
- 1990 జపాన్‌లో ఆస్తుల ధరల బుడగ పగిలిపోవడం జరిగింది.
- 1992-93 యూరప్ మారకపు రేటు వల్ల అంచనా వ్యాపారం పెరిగి బ్లాక్ 'వెడ్‌నస్‌డేగా' తయారయ్యింది.
- 1994-95 మెక్సికో ఆర్థిక సంక్షోభం.
- 1997-98 ఆసియా ఫైనాన్షియల్ సంక్షోభం.
- 2007-09 అమెరికా ఫైనాన్షియల్ సంక్షోభం.

పై విధంగా ఎన్ని రకాలయిన సంక్షోభాలను పెట్టుబడిదారీ ఆర్థిక వ్యవస్థ సంక్షోభాలను చూసినది. అయితే పెట్టుబడిదారీ దేశాలలో ఆర్థిక చక్రీయతత్వం ద్వారా సంక్షోభాలు సాధారణంగానే సంభవిస్తుంటాయి అని నిపుణుల అభిప్రాయం. మరికొంత మంది మేధావులు కేవలం పెట్టుబడిదారీ సమాజంలోనే కాదు సామ్యవాద, మిశ్రమ ఆర్థిక సమాజాలలో కూడా సంక్షోభాలు సంభవిస్తుంటాయి అని తెలియ జేస్తున్నారు. అయితే ఏ ఆర్థిక వ్యవస్థలోనైనా ఆర్థిక చలాంశాలలో స్థిరత్వం జరిగినా లేక అతిగా పెరిగినా ఆర్థిక కార్యకలాపాలన్నింటిన్ని క్లిష్టతరం చేస్తుంది అని మరికొంత మంది అభిప్రాయం.

పెట్టుబడిదారీ సమాజం, సామ్యవాద సమాజం, మిశ్రమ సమాజం లాంటి భేదాలు లేకుండా ఆర్థిక కార్యకలాపాలలో సంక్షోభాలు తలెత్తుతున్నాయి. అయితే పెట్టుబడిదారీ సమాజంలో నియంత్రణా చర్యలు తక్కువగా ఉండడం, స్వేచ్ఛాపూరిత వాతావరణం, పోటీతత్వం ద్వారా ఎక్కువ సంక్షోభాలు తలెత్తుతున్నాయి అని నిపుణులు పేర్కొంటున్నారు. అయితే ఆర్థికశాస్త్రంలో కీన్సియన్ ఆర్థికవేత్తలు ఆర్థిక వ్యవస్థలో లోటు ద్రవ్యాన్ని ప్రవేశపెట్టి ఆర్థిక వ్యవస్థ అభివృద్ధికి తోడ్పడాలని తెలియజేశారు. సప్లై సైడు నిపుణులు పన్నులు తగ్గించి, పెట్టుబడులు పెంచి ప్రోత్సహించాలన్నారు. స్వేచ్ఛా వ్యాపార విధానాన్ని సమర్థించేవారు ప్రభుత్వం జోక్యం చేసుకోవాల్సిన అవసరం లేదు, మార్కెట్ శక్తులు సమస్యను పరిష్కరిస్తాయని తెలియజేశారు.

ముఖ్యంగా దేశాలు ఆర్థిక పునాదులు పటిష్టంగా నిర్మించుకుంటూ అభివృద్ధి చెందే క్రమంలో అన్ని రంగాలకూ ప్రాధాన్యత ఇవ్వాలి. ఏదయినా ఒక రంగంపై ఆధారపడరాదు, అలా ఆధారపడడం వల్ల మిగిలిన రంగాలు నిర్లక్ష్యానికి గురికాబడతాయి అందువల్ల అసమతౌల్యంతో అభివృద్ధి జరిగి అది సంక్షోభాలకు దారితీస్తుంది అని వృద్ధిరంగ నిపుణులు హెచ్చరిస్తున్నారు. సమాజంలో ఉండే ఆదాయ - అసమానతలే అసలు సంక్షోభాలకు ప్రధాన కారణం అని మరి కొంతమంది తెలియజేస్తున్నారు. అభివృద్ధి క్రమంలో ఏ వ్యూహాన్ని అనుసరించినా కూడా సమాజంలో అట్టడుగున గల ప్రజలందరికి వృద్ధి ఫలాలు అందే విధంగా, వారి అవసరాలు తీరే విధంగా ప్రభుత్వాలు పథకాలను రూపొందించుకున్నప్పుడు సంక్షోభాలను నివారించి బలమైన ఆర్థిక వ్యవస్థను నిర్మించగలుగుతుంది. వీ

*ప్రాజెక్ట్‌లకు అనుమతులివ్వడంలో పరిమిత, అశాస్త్రీయ ప్రమాణాలను ఆధారం చేసుకుంటున్నారనీ, సామాజిక, ఆర్థిక, రాజకీయ, పర్యావరణ నష్టాలను గమనంలోకి తీసుకోవడంలేదనీ అంటున్నారు* **నక్కా హేమా వెంకట్రావ్**

# పర్యావరణానికి ముప్పు - మంగుళూరు సెజ్

చిన్నపాటి తేడాలున్నప్పటికీ అచ్చంగా కాకినాడ సెజ్ లాగానే కర్ణాటక రాష్ట్రంలో ఈ మంగుళూరు సెజ్! ఎక్కడైనా ప్రజల బాధలు ఒక్కటేనన్నట్లుగా అక్కడి సెజ్ బాధితులు, వారి పక్షాన నిలబడి పోరాడుతున్న 'కృషి భూమి సంరక్షణ సమితి' ప్రతినిధులతో కలిసి మాట్లాడినపుడు, వారి పోరాటం, ప్రతిఘటన విషయాలన్నీ దాదాపుగా కాకినాడ సెజ్ వ్యతిరేక పోరాటంలో మనం ఎదుర్కొన్నవే అనిపించాయి. ఒకరి అనుభవాలు మరొకరికి ఉపయోగపడవచ్చనిపించింది. ఆ విధంగా పోరాడే ప్రజల మధ్య ఒక అవగాహన, ఐక్యత రూపుదిద్దుకునే అవకాశాలు ఉన్నాయి. అందుకే దూరభారాన్ని లెక్క చేయకుండా తూర్పు తీరంలోని కాకినాడ సెజ్ నుంచి సుమారు 1500 కిలోమీటర్ల దూరంలో పశ్చిమ కనుమల్లో ఉన్న మంగుళూరు సెజ్ ప్రతిపాదిత ప్రాంతానికి వెళ్లి వారితో కలసి మాట్లాడి పంచుకున్న బాధలు, తెలుసుకున్న కొన్ని నమ్మలేని విషయాల్ని మీతో పంచుకోవాలనే ఈ వ్యాసం. 'ఇది' వారికిచ్చిన మాట కూడా! అయితే వారి పోరాటానికి మనందరి మద్దతు కోసం వారు చూపిన ఆతృత కూడా వెంటాడుతూనే ఉంది.

పశ్చిమ కనుమలు మహారాష్ట్రలో దూలే జిల్లా నుండి తీరం వెంబడి గోవా, కర్ణాటక, కేరళ, తమిళనాడులో కన్యాకుమారి వరకు 1600 కిలోమీటర్ల మేర వ్యాపించి ఉన్నాయి. హిమాలయాల కంటే పురాతనమైన ఈ కనుమలు దక్షిణాది రాష్ట్రాలకు రుతుపవనాలను మోసుకొని వచ్చే ముఖద్వారంగా పని చేస్తున్నాయి. ఎక్కడా లేని విధంగా, విభిన్న వృక్ష, జంతు జాతులకు ఈ ప్రాంతం నెలవై ఉంది. ఈ కనుమలు ప్రపంచంలోనే పేరెన్నికగన్న పద్దెనిమిది 'బయో డైవర్సిటీ' ప్రాంతాలలో ఒకటిగా గుర్తించబడ్డాయి.

ఉత్తరప్రదేశ్‌లో సుందర్‌లాల్ బహుగుణ 'చిప్‌కో' తరహాలోనే ఇక్కడ కూడా చెట్లను 'హత్తుకోమనే' 'అప్పికో' అనే ఉద్యమం 1980లలోనే మొదలయ్యింది. ఆ తర్వాత కర్ణాటక రాష్ట్రం, చిక్‌మగ్లూరు జిల్లాలో కుద్రముఖ్ జాతీయ పార్క్‌లో విస్తారంగా ఇనుప ఖనిజాన్ని వెలికి తీసే మైనింగ్ ప్రాజెక్టును అడ్డుకోవడానికి కూడా పెద్ద ఎత్తున పర్యావరణ పరిరక్షణ ఉద్యమం ప్రారంభమైంది. 1972 ప్రాంతంలో 'బిర్లా' వారి మంగుళూరు రిఫైనరీ స్థాపించబడింది. దాని వల్ల అనేక పర్యావరణ సమస్యలు తలెత్తాయి. వాటిని ఎప్పటికపుడు వ్యతిరేకిస్తూ మంగుళూరు 'సిటిజన్స్ ఫోరం' పోరాడుతోంది. ఇప్పుడు తాజాగా 'మంగుళూరు సెజ్' పై కూడా బాధిత రైతులతో కలిసి ఉద్యమిస్తుంది.

'సిటిజన్స్ ఫోరం' సభ్యులైన ప్రొఫెసర్ భట్ విద్యా నటేశన్‌లతో కలిసి 'సెజ్' ఏరియాకి వెళ్లి 'గ్రిగరీ' అనే రైతు, ఇతరులతో మాట్లాడిన తరువాత ఇక్కడ సెజ్ వ్యతిరేక పోరాటం, జీవించే హక్కు కోసం పర్యావరణ ఉద్యమంగా రూపుదిద్దుకుంటుందనే అభిప్రాయం కలిగింది.

తరతరాలుగా వ్యవసాయం అయినా, చేపల వేట అయినా ప్రకృతి సమతుల్యాన్ని కాపాడే విధంగానే కొనసాగింది. తనకెంత అవసరమో అంతమేరకే తీసుకుంటూ, ప్రకృతిని కన్నతల్లిలా ఆరాధిస్తూ, ఆ విధమైన సమాజ నిర్మాణాలు చేస్తూ మనిషి ప్రస్థానం జరిగింది. ఎప్పుడైతే యంత్ర నాగరికత వచ్చిందో ప్రపంచ యుద్ధాలు మొదలయ్యాయి. ప్రకృతి విధ్వంసం ప్రారంభమయ్యింది. పెట్టుబడీదారి వ్యవస్థలో ఆర్థికసంక్షోభం ముదిరి నపుడల్లా ఆ విధ్వంసం మరింత తీవ్రతరం కావడం మామూలే అయింది. 'సెజ్' (ప్రత్యేక ఆర్థిక మండళ్లు) అందులో భాగంగానే తెరపైకి వచ్చాయి.

అనాదిగా గ్రామ ప్రాంతాలలో వ్యవసాయం 'లాభసాటి'ది కాకపోయినా రైతులు భూమినెపుడూ వదిలిపెట్టలేదు. అడవిని పోడు చేసుకున్నా, బంజర్లను సాగుచేసుకున్నా ప్రకృతి సంరక్షకులుగానే ఉన్నారు. కాని గత కొన్ని సంవత్సరాలుగా జరుగుతున్న 'అభివృద్ధి' కొండల్ని పిండేస్తూ, అడవుల్ని మింగేస్తూ, వాతావరణంలోకి అనేక విషవాయువుల్ని వదిలేస్తూ, విచక్షణా రహితంగా పారిశ్రామిక వ్యర్థాలను జలవనరుల్లో కలిపేస్తూ పెద్ద ఎత్తున పర్యావరణ వినాశనానికి పాల్పడుతోంది. మనిషి ప్రాథమిక అవసరాల్ని తీర్చే వ్యవసాయాన్ని, వృత్తుల్ని విధ్వంసం చేస్తూ సాగే ఏ అభివృద్ధైనా మానవజాతి ఉనికినే ప్రశ్నార్థకం చేస్తుంది.

మంగుళూరు సెజ్ ఏర్పాటుకు కేంద్ర ప్రభుత్వం ఫిబ్రవరి 2006లో అనుమతిని ఇచ్చింది. ఈ సెజ్‌లలో ఒ.ఎన్.జి.సి.కు 26 శాతం, కర్ణాటక ఏరియా ఇండస్ట్రియల్ డెవలప్‌మెంట్ బోర్డుకు 23 శాతం, ఇన్‌ఫ్రాస్ట్రక్చర్ లీజింగ్ అండ్ ఫైనాన్షియల్ సర్వీసెస్‌కు 49 శాతం, కర్ణాటక ఛాంబర్ ఆఫ్ కామర్స్ అండ్ ఇండస్ట్రీస్‌కు 2 శాతం వాటా ఉంది. కర్ణాటక పారిశ్రామిక అభివృద్ధి సంస్థ (కె.ఐ.టి.సి.) ద్వారా 3,985 ఎకరాల భూసేకరణకు 'పూనుకొన్నారు'. నేషనల్ ఎన్విరాన్ మెంటల్ ఇంజనీరింగ్ రీసెర్చ్ ఇన్‌స్టిట్యూట్ – నీరి (ఎన్ఇఇఆర్ఐ) అనే ప్రభుత్వ సంస్థ పర్యావరణ ప్రభావంపై అధ్యయనం చేసి మొదట సేకరించిన భూమిలో పరిశ్రమల ఏర్పాటుకు పచ్చజెండా ఊపింది. రెండోదశలో 2,128 ఎకరాలకు నోటిఫికేషన్ ఇచ్చారు. కానీ రైతుల నుంచి ప్రతిఘటన ఎదురయ్యింది. దాంతో 'నీరి' ఇక్కడకు రానే లేదు.

మంగుళూరు సెజ్ వలన కేవలం భూమిని కోల్పోవడం మాత్రమే అయితే పర్యావరణ వేత్తలు, ప్రకృతి ప్రేమికులు ఇంతగా కదలక పోయేవారేమో! 1972లో ఏర్పడిన మంగుళూరు పెట్రోలియం రిఫైనరీ వలన కలుగుతున్న కాలుష్యం ఇంకా వారిని భయపెడుతూనే ఉంది. వ్యవసాయంతో పాటు నీటి వనరులు కూడా వీరి జీవనోపాధికి ఆధారలయ్యాయి. సెజ్ ఏర్పాటు చేస్తే రసాయన వ్యర్థాల ద్వారా మత్స్య సంపద ఉత్పత్తి గణనీయంగా తగ్గుతుంది. ఇప్పటికే విద్యుత్, ఎరువులు, రసాయన పరిశ్రమలతో 2000లో 69,412 టన్నులు ఉన్న మత్స్య సంపద

2008 నాటికి 39,937టన్నులకు పడిపోయింది. అలాగే ఇతర జీవజాతుల ఉత్పత్తి వినాశనం కూడా జరుగుతుంది.

కర్ణాటకలో 300 కిలోమీటర్ల తీరం వెంబడి 25,000 చేపలు పట్టే యూనిట్లు ఉన్నాయి. చేపల ఎగుమతి పరిశ్రమలలో వేలకొద్దీ మహిళలు కాంట్రాక్టు పద్ధతిలో పని చేస్తున్నారు. వీటి ద్వారా లక్షలాది రూపాయల వ్యాపారం జరుగుతోంది. దక్షిణ కన్నడ జిల్లాలోని మంగుళూరు కర్ణాటక ప్రధానమైన రేవు పట్టణం. ఆదాయాభివృద్ధిలోనైనా మానవాభివృద్ధిలోనైనా ఈ జిల్లా అభివృద్ధి చెందిన జిల్లాల్లో ఒకటి.

మంగుళూరును ఆనుకుని ఉన్న నేత్రావతి నది 5 కిలోమీటర్ల పొడవునా జరిగే చేపల వేటలో 350 కుటుంబాలకు సాలీనా 7800 లక్షల రూపాయల ఆదాయం లభిస్తుంది. ఒక మత్స్యకార పరిశ్రమ 1,48,200 పనిదినాలు కల్పిస్తుంది. చేపలు పట్టే కార్యక్రమానికి ముందు తరువాత పనిదినాలను లెక్కిస్తే ఈ మొత్తం రెట్టింపవుతుంది. అంతేకాక ఒక్కొక్క యూనిట్‌కు 35,000 నుంచి 40,000 పెట్టుబడితో ఈ మత్స్యకారులు 14-15 వేల కేజీల చేపల ఉత్పత్తిని చేస్తున్నారు. సెజ్ నిర్వహణ కోసం నీటిని, విద్యుత్‌ని సరఫరా చేస్తామని కర్ణాటక ప్రభుత్వం హామీ కూడా ఇచ్చింది. నేత్రావతి, గురుపూర్ నదులలో ఉండే నీరు 98 శాతం వరకు వృథా అవుతోందని కాబట్టి దానిని వినియోగించుకోవచ్చని తెలియచేసింది. నదీ ప్రవాహం దృష్ట్యా చూసినా 2-3 శాతం కంటే నీటిని ఎక్కువగా వినియోగించుకోలేం. ఇది మత్స్య సంపదకు, ఆహార భద్రతకు పెనుముప్పే. వాస్తవానికి ఇప్పటికే 4,16,262 మంది జనాభా కలిగిన మంగుళూరు వాసులకు పెనుఘాతం.

అంచేత సెజ్ కంపెనీలు నదిలోకి కాలుష్యం వదిలివేయడం లేదా ఆ నీటి నాణ్యతకు కీడు కలిగించేలా ఏ చర్య తీసుకున్నా పేద మత్స్యకారుల కుటుంబాల ఆదాయానికి గండి పడుతుంది. వారు ఇంత ఆదాయాన్ని చేకూర్చే వేరే ఏ ఇతర పనులను చేపట్టలేరు. నది 8 కిలోమీటర్ల ప్రాంతంలో ఆనకట్టలతో నీటి ప్రవాహాన్ని దారి మళ్లించడం వలన కలిగే నష్టం అంతా ఇంతా కాదు. ప్రధానంగా చేపల వేట లేకుండా పోతుంది.

రైతులు అనువంశికంగా వారికి సంక్రమించిన భూమి ప్రకృతి వనరులపై హక్కులతో పాటు పర్యావరణాన్ని భవిష్యత్ తరాలకు అందించాలని తాపత్రయపడతారు. అలాంటి వారి నుండి అన్నీ లాక్కొని సెజ్ యాజమాన్యం తిరిగి వారికిచ్చేదేంటి? పునరావాస పథకాలని చెప్పి వారిని, రాబోయే తరాలను దగా చేయడం తప్ప! మెట్టభూమికి ఎకరానికి ఎనిమిది లక్షలు, నీటి వసతి కలిగిన భూమికి ఎనిమిదన్నర లక్షలు ధర నిర్ణయించారు. నిర్వాసితుల ఇంటి స్థలానికి కనిష్టంగా 2.5 సెంట్లు, గరిష్టంగా 12.5 సెంట్లు ఇంటి స్థలాన్ని కేటాయించారు.

భూమితో పాటు చెట్లకు, బావులకు, ఇళ్లకు వెలకట్టడంతో పాటు రవాణా తదితర ఖర్చులు కూడా భరిస్తామన్నారు. గ్రామీణ వృత్తిదారులకు, చిన్న వ్యాపారులకు వృత్తి శిక్షణ, ఆర్థిక సహాయాన్ని ప్రకటించారు. నిర్వాసితులకు నష్టపరిహారంతో పాటు కుటుంబానికి ఒక ఉద్యోగ అవకాశాన్ని లేదా మూడున్నర లక్షలు ఇస్తామన్నారు. మందిరాలను నిర్మిస్తామని వాగ్దానం చేశారు. ఇంటి ఆవరణలో కట్టబడ్డ విగ్రహాలకు పదివేల రూపాయలు (మంగుళూరులో దాదాపు ప్రతి ఇంటి ఆవరణలో దేవతా విగ్రహాలని ప్రతిష్టించుకుంటారు). గృహప్రవేశ ఖర్చుగా 20 వేల రూపాయలు ప్రకటించారు. ఇపుడు నివసిస్తున్న ఇంటికి అడుగుకి రు.575లు చొప్పున వెలకడుతున్నారు. పునరావాస కాలనీలో కొత్త ఇంటిని కట్టించి ఇచ్చే వరకు సంవత్సరానికి 36వేల రూపాయలు అద్దె కింద చెల్లిస్తామన్నారు. రవాణా ఖర్చుగా పదివేల రూపాయలు, ఉపాధికి నష్టపరిహారంగా 75వేల రూపాయలు చెల్లిస్తామని ప్రకటించారు. రోడ్లు, డ్రైనేజి, నీటి సరఫరా, స్కూళ్లు, పార్కింగ్ తదితర సౌకర్యాలన్నీ కల్పిస్తామని ఆశ చూపారు. కానీ ఇప్పటి వరకు వ్యవసాయ భూమిని వ్యవసాయేతర పనులకు ఉపయోగించడం వలన రైతులు ఎంతగా నష్టపోతారో బాధితుల మీద ఎలాంటి ప్రభావం చూపిస్తుందో ఒక అధ్యయనం కూడా జరగలేదు.

ఈ సెజ్ ద్వారా నాలుగు వేల మందికి ప్రత్యక్షంగాను, మరొక నాలుగు వేల మందికి పరోక్షంగాను ఉపాధి కల్పిస్తామని చెపుతున్నారు. ఇంతేకాకుండా ఐటి సెక్టర్, ఇతర శాఖలలో మరెన్నో ఉద్యోగాలనీ ఊరిస్తున్నారు. కానీ అన్నీ కంప్యూటరీకరణ ప్రాజెక్టులే కాబట్టి కొద్ది మందికే ఉపాధి దొరుకుతుంది. దక్షిణ కన్నడ జిల్లాలో కుటుంబ తలసరి వార్షిక ఆదాయం రు.22,000. 9 శాతం మంది మాత్రమే పేదరికంలో బతుకుతున్నారు. 84.35 శాతం పెంకుటింట్లో, 4.76 శాతం రేకుల ఇళ్లలో, మిగిలిన 10.7 శాతం గుడిసెలలో బతుకుతున్నారు. 9.65శాతం పురుషులు, 17 శాతం స్త్రీలు మాత్రమే డిగ్రీ వరకు చదువుకున్నారు. కాబట్టి వారికి మాత్రమే గౌరవప్రదమైన ఉద్యోగాలు దొరకవచ్చు. మిగిలిన వారు కాంట్రాక్టు కూలీలుగానో నైపుణ్యత లేని ఉద్యోగాలలోనో స్థిరపడవలసి వస్తుంది. సెజ్ చూపిస్తున్న ఆదాయం కంటే మూడు నాల్గురెట్లు ఎక్కువే సామాన్యులు సంపాదించగల్గు తున్నారు. ఇపుడు రైతులు ఎకరానికి సాలీనా 40 వేల రూపాయలు సంపాదిస్తున్నారు.

సెజ్ రిపోర్టులో కేవలం కుటుంబాల సంఖ్య మాత్రమే ఉంది. సామాజిక, ఆర్థిక, సాంస్కృతిక పర్యావరణ నష్టాల గురించి అసలు ప్రస్తావనే లేదు. పైగా ప్రజలు స్వచ్ఛందంగా భూమిని ఇచ్చేస్తున్నారని కంపెనీ వాదిస్తున్నది. నిజానికి మంగుళూరు రిఫైనరీ వదులుతున్న కాలుష్యానికి భయపడి ప్రజలు వెళ్లిపోతున్నారే తప్ప తమ భూముల్ని వదలడానికి ఇష్టపడి మాత్రం కాదు. ఒక్కసారి నిర్వాసితులైతే ఉమ్మడి కుటుంబ వ్యవస్థ నాశనం అయిపోవడం, స్పర్థలు, నష్టపరిహారం దుర్వినియోగం జరుగుతాయి.

ప్రకృతిపై ఆధారపడి బతుకుతున్న స్త్రీలు ఉపాధి కోల్పోతారు. బలవంతంగా కుటుంబ పోషణకై బయటకు వస్తే వారు దోపిడికి గురవుతారన్నది వాస్తవం. క్రమేణా వారి సామాజిక స్థాయి కూడా పడిపోతుంది. ఇది స్త్రీలపై మరింత భారాన్ని పెంచుతుంది. ఇదొక సామాజిక వైపరీత్యం. కాలం చెల్లిపోయిన పునరావాస పథకాలు ఇపుడు వారికి ఉపయోగపడకపోగా వారి జీవన విధానంలో చిచ్చురేపుతున్నాయి. ఆశ్చర్యకరమైన విషయం ఏమిటంటే సెజ్ పొందిన పన్ను మినహాయింపులో పునరావాసానికి ఉపయోగిస్తునది కేవలం 0.5 శాతం (725 కోట్లు) మాత్రమే. పునరావాస ప్యాకేజిలో కౌలుదారు, వ్యవసాయ కూలీల హక్కులను గుర్తించలేదు. నిజానికి నష్టపోయే వారిలో వీరి శాతమే ఎక్కువ. భూమికి ధర కట్టారే తప్ప, వాటి సహజ వనరులకు, భూగర్భ జలాలకు వెలకట్టలేదు. భవిష్యత్తులో సంభవించే పర్యావరణ ముప్పును సెజ్ ప్రతిపాదిత ప్రాంతాలకే కాక బయట ప్రాంతాలకు కూడా లెక్క కట్టాలి. కాని అలా జరగలేదు.

మంగుళూరు పట్టణం వివిధ సంస్కృతులకు నిలయం. వారందరినీ పర్యావరణం ఇప్పటివరకు ఒక్కటిగా కలిపి ఉంచింది. ఇంటి పెరటి గోడ మీద, పైకప్పులపైనా మొలచిన మొక్కలు సిమెంటు పొరలను కూడా దాచేస్తు మనల్ని ముగ్ధుల్ని చేయడమే కాక ప్రకృతి ప్రియులుగా కూడా మార్చేస్తాయి. మంగుళూరు దగ్గరగా ప్రతిపాదించిన పెట్రో రసాయన పరిశ్రమల సెజ్ పారిశ్రామిక వాడలకు చేరువగా ఉండటం వలన జన జీవనానికి, పర్యావరణానికి ముప్పు. ఈ పట్టణానికి సంబంధించి 2021 వరకు ఉద్దేశించబడిన మాస్టర్ ప్లాన్‌లో సెజ్ ఏర్పాటును పొందుపరచలేదు. సెజ్ ఏర్పాటు భూవినియోగం, వాతావరణం, సామాజిక పరిస్థితులపై

గణనీయమైన దుష్ఫలితాలను చూపుతుంది. మంగుళూరు సెజ్‌కు ఇచ్చిన అనుమతి ప్రభుత్వ అవగాహన రాహిత్యానికి నిదర్శనం.

మంగుళూరు పట్టణం భూకంపాలు ఎక్కువగా వచ్చే అవకాశం ఉన్న సెస్మిక్ జోన్‌గా గుర్తించబడింది. కనుక ఇక్కడ పెట్రో రసాయనాల పరిశ్రమలు స్థాపించదల్చుకుంటే అది మన వినాశనాన్ని కొని తెచ్చుకున్నట్టు అవుతుంది. ఈ ప్రతిపాదిత పరిశ్రమలు జాతీయ రహదారికి, మంగుళూరు (బాజ్‌పే) విమానాశ్రయానికి దగ్గర కాబట్టి బెంజిన్ లాంటి రసాయనాల ప్రాజెక్టు ఏర్పడితే ప్రమాదం మన పెరట్లో ఉన్నట్లే లెక్క.

బయోడీజిల్ ఉత్పత్తి కోసం పెట్రో రసాయనాలకు సంబంధించిన మొక్కల పెంపకం వలన ఈ వృత్తి మీద ఆధారపడి జీవించే కార్మికుల ఆరోగ్యం గణనీయంగా క్షీణిస్తుంది. ఇది వారికే కాక 10-15 కిలోమీటర్ల వైశాల్యంలో ఉన్న సాధారణ ప్రజలకు కూడా ప్రమాదకరమని అంచనా వేయబడింది. చదరపు కిలోమీటర్‌కు 1500 జనాభా కలిగిన మంగుళూరు పట్టణంలో పెద్దమొత్తంలో బెంజిన్ లాంటి రసాయన పదార్థాలు నిల్వ చేసినపుడు ఎలాంటి అవాంఛనీయ సంఘటన జరిగినా మరణాలు కొన్ని వేలల్లో ఉంటాయి. క్లోరిన్, ఫారాక్సిలిన్ రసాయనాల దుష్ఫలితాల గురించి సమగ్రమైన పరిశోధన జరగవలసి ఉండగా దాని గురించి ప్రాజెక్టు రిపోర్టులో చర్చించలేదు.

నిజానికి కర్నాటక రాష్ట్ర వ్యవసాయ విధానం, 2006 ప్రకారం రాబోయే దశాబ్దంలో వ్యవసాయోత్పత్తిని రెట్టింపు చేసి సాలీనా 4.5 శాతం వృద్ధిరేటు సాధించాలి. అలాగే రైతు నికరాదాయం పెంచాలి. రాష్ట్ర వ్యవసాయం విధానానికి లోబడి సమగ్ర జిల్లా వ్యవసాయ విధానం రూపొందించబడి ప్రభుత్వ ఆమోదానికి ఎదురుచూస్తుంది. జాతీయ ఫల, పుష్ప సేద్య సంస్థ 2011-12 నాటికి ఫలపుష్పోత్పత్తి రెట్టింపు చేయాలని చెబుతుంది. ఈ రంగంలో కృషిచేయడానికి ఉద్దేశించబడిన 17 జిల్లాల్లో దక్షిణ కన్నడ జిల్లా ఒకటి. ఇలాంటి వ్యవసాయ భూమిని వ్యవసాయేతర పనుల కొరకు కేటాయించడం, సెజ్‌ల వలన కాలుష్యాన్ని పెంచడం, ప్రకటించిన ప్రభుత్వ విధానాలకే వ్యతిరేకం. పరిశ్రమలు మంత్రిత్వశాఖచే జారీ చేయబడి పి.సి.ఐ.ఆర్ విధానపత్రం వ్యవసాయ భూమిని పరిశ్రమలకు తీసుకోవద్దని చెబుతుంది. ఒకవేళ భూసేకరణ అవసరం అయితే అందుకు బంజరు లేదా పడావు భూములను తీసుకోవాలంటుంది

ఏ సెజ్ చరిత్ర చూసినా ఏమున్నది గర్వకారణం అన్నట్టుగా రాష్ట్రాలు వేరైనా అదే మోసం, అదే దగా! అది కాకినాడ కావచ్చు, లేదా మంగుళూరు కావచ్చు. అధికార యంత్రాంగం పోలీసు వ్యవస్థ మోసపూరితంగా రైతులనుంచి భూముల్ని లాక్కొంటుంది. ఎప్పుడైతే రైతుల ప్రతిఘటన మొదలయ్యిందో సెజ్ యాజమాన్యం మొదటి దశ భూసేకరణకు సహకరించిన పెద్ద రైతులతో బినామీ సంఘం పెట్టించి, పోరాటానికి అడ్డంగా నిలబెట్టింది. లోపాయికారితనంగా సెజ్ యాజమాన్యం సంఘ సభ్యులకు కాంట్రాక్టులు, కమీషన్లు ఇస్తుంది. వారి మధ్య అంత:కలహాలు సృష్టించి పోరాడుతున్న రైతులను అభివృద్ధి నిరోధకులుగా ప్రచారం చేస్తుంది. అయినా సరే ఉద్యమబాటలో నడుస్తున్న రైతులు ప్రకృతి విధ్వంసానికి, భూమిపై వారసత్వ హక్కులకు భంగం కలిగేలా నిర్ణయాలు తీసుకోవడం లేదు. తమ పోరాటాన్ని కొనసాగిస్తూ చారెడు నేలను కూడా సెజ్‌కు అప్పగించలేదు. ఎటువంటి పునరావాస ప్యాకేజిలను ఆమోదించటం లేదు.

ఇప్పుడు పెద్ద ప్రాజెక్టులకు, సెజ్‌లకు పర్యావరణ శాఖ అనుమతులు, అటవీశాఖ అనుమతులు తప్పనిసరి అయినవి, కానీ అవి మొక్కుబడిగా జరుగుతున్నాయనేది ఒక వాస్తవం. ఇటీవల గుజరాత్‌లోని ముంద్రా సెజ్‌లోని పర్యావరణ రిపోర్టు గురించి గ్రామస్తుల సమక్షంలో పబ్లిక్ హియరింగ్ జరిగింది. వాళ్లంతా తమ బాధలు, సమస్యలు చెప్పుకొచ్చారు. అక్కడి ప్రజలు తమ భూముల్ని సెజ్‌లు తీసుకోకూడదని తెగేసి చెప్పారు. ఇక్కడే కాదు భారతదేశంలో ఎక్కడైనా వనరుల్ని, భూమిని పోగొట్టుకుంటున్న బాధితులు బహిరంగ విచారణను (పబ్లిక్ హియరింగ్) తిరస్కరించారే తప్ప ఒప్పుకోలేదు. 2008 నవంబరు 29న ప్రభుత్వం తలపెట్టిన బహిరంగ విచారణను ప్రజలు పెద్దఎత్తున నిరసన తెలియజేసి తిప్పి కొట్టారు.

నూతన ఆర్థిక విధానాలలో భాగంగానే భారత ప్రభుత్వం 1991లో తీరప్రాంత పరిశ్రమల స్థాపన, విస్తరణ సంబంధిత ప్రక్రియలకు సంబంధించిన నియంత్రణ పేరిట 'కోస్తా తీర క్రమబద్ధీకరణ' మండలి(కోస్టల్ రెగ్యులేషన్ జోన్)ని ప్రకటించింది. దాని తరువాత సామ్రాజ్యవాద ప్రపంచీకరణకు అనుగుణంగా వనరులన్నిటినీ గుత్త పెట్టుబడిదారులకు కారుచౌకగా అప్పగించడం కోసం 'కోస్టల్ రెగ్యులేషన్ జోన్'ను 'కోస్టల్ మేనేజ్‌మెంట్ జోన్'గా మార్చింది.

మంగుళూరు సెజ్‌లో దీని పరిణామాలు మత్స్యకారుల జీవనో పాధిని పెద్దఎత్తున దెబ్బతీసింది. ఉప్పెనలాంటి ప్రకృతి వైపరీత్యాలను అడ్డుకోగలిగి, చేపలు, రొయ్యలు, పీతల ఉత్పత్తికి అనుకూలమైన మడ అడవులను, కోస్తా తీరప్రాంత రక్షణ చర్యలను చేపట్టే బదులు కాలుష్యం చిమ్మే సెజ్‌లను ప్రోత్సహిస్తున్నారు. అందులో మంగుళూరు సెజ్ ఒకటి. ఈ 'సి.ఎం.జడ్.' ప్రకటన మేరకు గ్రీన్‌ఫీల్డ్ విమానాశ్రయాల నిర్మాణం, విస్తరణ, ఆధునీకరణలో భాగంగా బాజ్‌పే (మంగుళూరు) విమానాశ్రయాన్ని విస్తరించారు. గ్రీన్‌ఫీల్డ్ (పచ్చని భూమి) అని చెపుతూ ప్రకృతి విధ్వంసానికి పూనుకుంటున్నారు. అందుకే పెద్దఎత్తున పర్యావరణ ఉద్యమకారులు మంగుళూరు సెజ్‌ను వ్యతిరేకిస్తున్నారు.

మంగుళూరు సెజ్ వ్యతిరేక పోరాటం ధర్నాలు, రాస్తారోకోలు వంటి ప్రజాస్వామిక రూపాల వరకే పరిమితం అయ్యింది తప్ప ఉధృతమైన ప్రతిఘటనా రూపం తీసుకోలేదు. సెజ్ వ్యతిరేక పోరాట కమిటీ, 'కృషి భూమి సంరక్షణ' సభ్యులకు, వారికి మద్దతునిస్తున్న విద్యా నటేష్‌కు అరెస్టులు, వారెంట్లు సర్వసాధారణమయ్యాయి. అయినప్పటికీ ఆంధ్రప్రదేశ్ సెజ్ వ్యతిరేక పోరాట కార్యకర్తల మీద ఉన్న నిర్బంధంతో పోలిస్తే అణచివేత తక్కువే. ఇక్కడలా కార్యకర్తలను నక్సలైట్లుగా ముద్రవేసే సంస్కృతి అక్కడి పోలీసులకు ఇంకా అబ్బినట్లుగా లేదు.

మేము సెజ్ ప్రతిపాదిత ప్రాంతాలకు వెళ్లినపుడు (అక్టోబరు 2009) కొండలను పగలగొట్టి గుట్టలుగా పడున్న రాళ్లు, అభివృద్ధి పేరిట జరుగుతున్న ప్రకృతి విధ్వంసాలను ఎలుగెత్తి చాటుతూ ఉన్నాయి. ఈ దాష్టికాలను ఆపడానికి మంగుళూరు పట్టణానికి చెందిన 'సిటిజన్ ఫోరం' ప్రజా సంఘాలు, పర్యావరణ వేత్తలు ప్రయత్నించారు. రెండవ దశలో తీసుకొన్న భూములను, కుడిబి ఆదివాసుల మాన్యాన్ని తిరిగి వారికి అప్పగించాలని లేకపోతే ఫిబ్రవరి 4, 2010 నుండి ఆమరణ నిరాహార దీక్షకు పూనుకొంటామని రామచంద్ర మఠానికి చెందిన విశ్వతీర్థ తేజోవర స్వామిజీ ప్రకటించారు.

ఈ సందర్భంలో సామ్రాజ్యవాద ప్రపంచీకరణ నేపథ్యాన్ని మనం విస్మరించలేం. పారిశ్రామిక అభివృద్ధి పేరుతో పాలక వర్గాలు మైదాన ప్రాంతాన్ని, సముద్ర తీరాన్ని బహుళజాతి కంపెనీలకు అప్పగించడం కోసం, ఆర్థిక స్వావలంబన కలిగిన ప్రాంతాలను కూడా వదిలిపెట్టడం లేదన్న వాస్తవాన్ని గుర్తించాలి. ప్రభుత్వం రెండు నాల్కల ధోరణి అవలంబిస్తోంది. ఒకవైపు పర్యావరణానికి చేటుతెచ్చే సెజ్‌లను అనుమతిస్తూ, మరోవైపు పర్యావరణ రక్షణకు వివిధ చట్టాలను చేస్తున్నామని బుకాయిస్తూ అదే చట్టం ద్వారా, కోర్టుల ద్వారా మన కన్నుని మన వేలుతోనే పొడుస్తోంది.

అందుకు ఉదాహరణగా ఇపుడు పార్లమెంట్‌లో సుప్రీంకోర్టు సలహాల మేరకు రాబోయే పార్లమెంట్ సమావేశంలో నేషనల్ గ్రీన్‌ట్రిబ్యునల్ బిల్ ప్రవేశపెట్టబోతున్నారు. 1997లో నేషనల్ ఎన్విరాన్‌మెంట్ అప్లేట్ ఆధారిత (ఎన్.ఇ.ఎ.ఎం.) చట్టం బదులుగా ఈ చట్టం పనిచేస్తుంది. ఈ ట్రిబ్యునల్స్ పర్యావరణ సంబంధిత, సివిల్ వివాదాల కేసుల్ని స్వీకరిస్తాయి. ఈ ట్రిబ్యునల్‌లో జడ్జీలతో పాటు శాస్త్రవేత్తలు, జీవ శాస్త్రవేత్తలు, సాంకేతిక నిపుణులు ఉంటారే కానీ ప్రజా ఆరోగ్యవేత్తలు, పర్యావరణ వేత్తలు

ఉండకపోవడం లోపమే కాక చట్టం లక్ష్యానికే విరుద్ధం. ఇవి జాతీయ స్థాయిలోనే కాకుండా ప్రాంతీయ స్థాయిలో కూడా నెలకొల్పుతారు. అయితే ఈ చట్టాలేవి బడా పెట్టుబడిదారులకు, సామ్రాజ్యవాద బహుళజాతి సంస్థలకు, వాటి తొత్తులయిన పాలకవర్గాల దుర్మార్గాలకి అడ్డుకట్ట వేసే నిబద్ధత కలిగిన శక్తివంతమైనవి కావు.

నర్మదా బచావో ఆందోళనకారుల పిటిషన్‌కు స్పందించిన సుప్రీం కోర్టు పరిమిత నష్టంతో డ్యాం కట్టమని ఆదేశించినా పాలకవర్గాలు మాత్రం తమ ఇష్టానుసారమే చేసారు. డ్యాం నిర్మాణం పూర్తవుతున్నా, కొన్ని వేల మంది బాధితులకు ఇప్పటివరకు పునరావాసం అందలేదు. మరి సుప్రీంకోర్టు ఆదేశాలనే తుంగలో తొక్కిన పాలక వర్గాలు, పెట్టుబడిదారులు ఈ ట్రిబ్యునల్ ఆదేశాలని పాటిస్తారా అన్నది ప్రశ్నే. ప్రకృతి కోసం, జీవించే హక్కు కోసం పోరాడుతున్న రైతాంగం, ఆదివాసులు, దళితులు, కౌలుదారులు, కూలీలు తమ ఉద్యమానికి మద్దతు కోరుతున్నారు.

పశ్చిమ కనుమల్లో కార్చిచ్చును ఆర్పడం కేవలం బాధిత రైతాంగానికి, స్థానిక పర్యావరణ వేత్తలకు, ప్రజాస్వామ్య వాదులకు సాధ్యపడకపోవచ్చు. మన అందరి మద్దతు తప్పని సరి అవసరం. ప్రతిఘటన మరింత బలోపేతంగా మారి, మరింతగా విస్తరించాలి. ప్రపంచ దేశాలన్ని అంతర్జాతీయ సదస్సుల వేదికలపై వాతావరణంలో కార్బన్ వాయువుల శాతం పెరుగుదల, గ్రీన్ హౌస్ ఎఫెక్ట్ మొదలైన అంశాల పట్ల ఆందోళన చెందుతున్నాయి. ఈ భూగోళంపై కార్బన్ పాదముద్రలను ప్రకృతినీ, పర్యావరణాన్ని కాపాడాలని కోరుతున్నారు. కోపెన్‌హాగెన్‌లో డిసెంబరు 2009లో పర్యావరణం పై సదస్సు ఎలాంటి చర్య తీసుకోకుండానే ముగిసింది.

ప్రతీ సంవత్సరం డిసెంబర్ 3న 'భోపాల్'లో యూనియన్ కార్బైడ్ దురాగతానికి బలయిపోయిన వేలాదిమందిని స్మరించుకుంటున్నట్లుగానే, ఇప్పటికీ నష్టపరిహారం అందక, నయం కాని భయంకర వ్యాధులతో బాధపడుతున్న వేలాది మంది కోసం పోరాడవలసిన ఆవశ్యకతను కూడా మర్చిపోకూడదు. భోపాల్ దురంతానికి 25 ఏళ్లు నిండినా, అంతర్జాతీయ స్థాయిలో కానీ, జాతీయ స్థాయిలో కానీ న్యాయం జరిగిన దాఖలాలు లేవు. ఇప్పటికీ ఇంకా సెజ్‌ల రూపంలో దేశమంతటా 'భోపాల్'లు విస్తరిస్తున్నాయి. చివరికి దేశం పేరు కూడా భారతదేశం బదులుగా 'భోపాల్'గా స్థిరపడిపోతుందేమో!. ఆ విధంగా మన దేశం ప్రపంచంలోని అతి పెద్ద స్మశానంగా చరిత్రకెక్కుతుందేమో. దానికి ఈ దేశవాసులుగా మనందరం సిద్ధంగా లేమని నినదిద్దాం. వీ

---

*(...7వ పేజీ తరువాయి)*

తెలంగాణపై కె. ప్రభాకర్, రాఘవాచారి రాసిన రెండు వ్యాసాల్లోనూ నెహ్రూని ప్రస్తావించారు (వీక్షణం జనవరి 2010). 'కాంగ్రెస్‌దంతా మోసాల చరిత్రే' అన్నారు రాఘవాచారి. వారి నిర్ధారణ కరెక్టే గానీ విశ్లేషణల్లో లోపాలున్నాయి. తెలంగాణను 1948లో 'నెత్తురుటేరుల్లో ముంచి సైనిక చర్య ద్వారా ఆక్రమించుకున్నది కేంద్రం' అని ప్రభాకర్ రాసింది ప్రత్యక్షర సత్యం. 'వేలాదిగా తెలంగాణ యోధులను బలితీసుకుని, దొరలను గ్రామాలలో తిరిగి ప్రతిష్ఠించడానికి' నెహ్రూ ప్రభుత్వం ఎలా పనిచేసిందో రాఘవాచారి గుర్తు చేసారు. నేటి యువతరం బాగా తెల్సుకోవాల్సిన మాట ఇది. నాటి ప్రజాపోరాటంలో నేలరాలిన వేలాది యోధుల్లో వందలాది మంది కోస్తా కమ్యూనిస్టు కార్యకర్తలు కూడా ఉన్నారన్నది చారిత్రక సత్యం. అలాగే లక్షలాది తెలంగాణ ప్రజలూ, వారి నాయకులూ కోస్తా ఆంధ్రలో ఏళ్ల తరబడి తలదాచుకొన్నారు. ఈ పోరాట ఐక్యతా క్రమంలోనే 1946లో కమ్యూనిస్టు పార్టీ 'విశాలాంధ్రలో ప్రజారాజ్యం' అన్న పిలుపునిచ్చింది. ఆ పిలుపునే 1956 దాకా కొనసాగించింది. తెలంగాణ పోరాటకారుల్లో అత్యధిక భాగం - పార్టీ వెలుపల వారు కూడా - దాన్ని బలపరిచారు (చూడండి వట్టికోట ఆళ్వారుస్వామి 'తెలంగాణం' వ్యాసాల సంకలనం, 1956). ఈ పరిణామాన్ని నేటి దృష్టితో ప్రజాభిమతానికి వ్యతిరేకంగా తీసుకున్న చర్యగా చెప్పడం చరిత్ర వక్రీకరణే కాగలదు. నిజానికి విశాలాంధ్ర ఐక్యత ఆనాటి పోరాటంలో ఒక అడుగు ముందుకేనని అత్యధికులు భావించారు. అయితే దానితోనే ప్రజారాజ్యం సాధ్యంకాదు, అది సంస్కరణవాదం అన్నారు ఆ పోరాట నాయకుడు దేవులపల్లి వెంకటేశ్వర రావు. చరిత్ర ఇదీ. నేటి వ్యవస్థలో ప్రజా (స్వామిక) తెలంగాణ కూడా అంతే అసాధ్యం.

కాగా ఆంధ్ర 'తుంటరివాడితో తెలంగాణ అమాయకపు పిల్ల పెండ్లి' అని నెహ్రూ అన్నారని సానుకూలంగా పేర్కొన్నారు రాఘవాచారి. 'తెలంగాణ ప్రజలు నవాబు పాలన అనే భూస్వామ్య పాలన నుండి ఆంధ్ర పాలన అనే సామ్రాజ్యవాద పాలన కిందికొచ్చారు' అని రాసారు. కేంద్ర నిరంకుశత్వపు చారిత్రక వాస్తవాలను మరిచిపోయి ఈ వాక్యాలను పదే పదే ఉటంకిస్తున్నారు తెలంగాణ వాదులు, విప్లవకారులతో సహా! తెలంగాణ వధువును 1947 స్వాతంత్ర్యం పారాణి కూడా ఆరకముందే 1948లోనే దురాక్రమించి, తెలంగాణపైకి యాభై వేల సైన్యాన్ని పంపి, నాలుగు వేల మందిని కాల్చి చంపి, లక్ష మందిని జైళ్ల పాలు చేసి దారుణంగా రేప్ చేసిన వలస వారసుడైన 'రంగు రంగులమారి' నెహ్రూని, ఆయనగారి విడాకుల సూచనలనూ ఆ వధువు పట్ల సానుభూతి కలవాడిగా సానుకూలంగా కోట్ చేయడం ఈనాటి విడ్డూరం. ఆనాటి తోటి పోరాటకారులని సామ్రాజ్యవాదులనడం చారిత్రక విషాదం. సామ్రాజ్యవాదం అన్న పదానికి ఉన్న శాస్త్రీయ అర్థాన్ని విస్మరించి, ఇలాంటి విశ్లేషణను ప్రచారం చేయడం చారిత్రక అపచారం. బైట చాలామంది చేస్తున్న ఈ కువ్యాఖ్యాన్ని వీక్షణం వంటి పత్రికలో కూడా - సంపాదకుల కామెంట్ కూడా లేకుండా - చూడాల్సి రావడం దురంతం. యువ పాఠకులకు మీరు నేర్పేది ఇదేనా? తెలంగాణ వాదంలో పడి ఇలాంటి ఒళ్లు తెలియని వ్యాఖ్యలు చేయడం ప్రజానుకూల శక్తులకు తగదు.

నిజానికి నెహ్రూ ఆ తర్వాతైనా విడి తెలంగాణను - ఆ ఐడెంటిటీని - బలపర్చలేదు. ఆయనది ఏకజాతి సిద్ధాంతం. భిన్నత్వంలో ఏకత్వం పేరిట, భిన్న సంస్కృతుల సమ్మేళనం పేరిట పాత హైదరాబాద్‌నే కొనసాగించాలనుకున్నారు. ఆనాడు స్వతంత్ర రాజ్యంగా హైదరాబాద్ అన్న సమస్య ఐక్యరాజ్య సమితికి వెళ్లింది. పాకిస్తాన్, మరికొందరూ దాన్ని బలపరచడానికి సిద్ధంగా ఉండిరి. ఆ పూర్వరంగంలో కేంద్ర మిలిటరీ వ్యూహ నిపుణులూ, హోంమంత్రి పంత్ వంటి వారూ ఇతరేతర కారణాలతో విశాలాంధ్ర ఏర్పాటుకు అయిష్టంగానే సమ్మతించారని ఆనాటి పెద్దలకు తెలుసు. అందుకే పెద్దలు సంతకాలు చేయడం, 1961-62 దాకా ఆగకుండా 1956లోనే విశాలాంధ్రను ఏర్పాటు చేయడం చకచకా జరిగిపోయాయి. ఈ చరిత్రను దేవులపల్లి తన 'తెలంగాణ ప్రజల సాయుధ పోరాట చరిత్ర' గ్రంథంలో క్లుప్తంగా ప్రస్తావించారు (పేజీ 623). కాంగ్రెస్ దంతా మోసాల చరిత్రేనని రాసిన రాఘవాచారి, ప్రభాకర్ కూడా ఆ మోసాన్ని పూర్తిగా బైటపెట్టే బదులు, దానిపైనా ఆధారపడి రాశారు. ఈ వ్యాఖ్యను ప్రచురించి వీక్షణం పాఠకులకు ఈ చరిత్ర కోణం గురించి కూడా తెలియజేస్తారని ఆశిస్తున్నాను.

**- ఎం. జయలక్ష్మి**
హైదరాబాద్

## ప్రభాకర్ మందారకు కేంద్ర సాహిత్య అకాడమీ అనువాదక అవార్డ్

కేంద్ర సాహిత్య అకాడమీ 2009 సంవత్సరానికి గాను ప్రభాకర్ మందారను ఉత్తమ అనువాదకుడి అవార్డ్‌కు ఎంపిక చేశారు. ఫిబ్రవరి 15న అకాడమీ చైర్మన్ సునీల్ గంగోపాధ్యాయ అధ్యక్షతన జరిగిన ఎగ్జిక్యూటివ్ బోర్డ్ సమావేశంలో ఈ నిర్ణయం తీసుకున్నారు. డా. యాగాటి చిన్నారావు పరిశోధనా గ్రంథం 'దళిత్ స్ట్రగుల్ ఫర్ ఐడెంటిటీ'ని 'ఆంధ్రప్రదేశ్ దళిత ఉద్యమ చరిత్ర' పేరిట చేసిన అనువాదానికి ఈ అవార్డ్ లభించింది. ప్రభాకర్ మందార హైదరాబాద్‌లోని రాష్ట్ర రోడ్డు రవాణా సంస్థ కేంద్ర కార్యాలయంలో ఇటీవలే పదవీ విరమణ చేశారు. ముప్పైకి పైగా కథలు, ఇరవై వరకు రేడియో, టివి నాటికలు రచించారు. యాభైకి పైగా పుస్తకాలను తెలుగులోకి అనువదించారు. అపరాజిత, విముక్తి, డాడీ నాకో పిస్తోల్ కావాలి వంటి రేడియో నాటికలు, సృష్టి, సజీవ చిత్రం, చెమ్మగిల్లిన కళ్లు వంటి కథలు, తిరగబడ్డ తెలంగాణ, బుద్ధుడి రాజకీయతత్వం తదితర థీసిస్‌లు, వైద్య, ఆరోగ్య గ్రంథాల అనువాదాలు చేశారు.

***ఇటీవల మరణించిన అమెరికన్ రచయిత, రాజనీతి శాస్త్ర అధ్యాపకుడు, చరిత్రకారుడు హోవార్డ్ జిన్ స్మృతిలో ఆయన 1969లో రాసిన వ్యాసం వీక్షణం పాఠకుల కోసం ...***

# మేధావిత్వం ఎందుకోసం?

*(అమెరికన్ చరిత్రకారుడూ, రచయితా, నాటక రచయితా, సామాజిక కార్యకర్తా, రాజనీతి శాస్త్ర అధ్యాపకుడూ హోవార్డ్ జిన్ జనవరి 27న కాలిఫోర్నియాలోని శాంటామోనికాలో మరణించారు. ఆ రోజు ఆయన శాంటామోనికా మ్యూజియం ఆఫ్ ఆర్ట్ ఉపన్యాసం ఇవ్వవలసి ఉండింది. 1922లో ఒక యూదు శరణార్థుల కుటుంబంలో పుట్టిన హోవార్డ్ న్యూయార్క్ విశ్వవిద్యాలయంలోనూ, కొలంబియా విశ్వవిద్యాలయంలోనూ చదువుకున్నారు. బొగ్గు గని కార్మికుల సమ్మెల మీద, 1920లలో అమెరికన్ రాజకీయాలలో సంపద పునః పంపిణీని ప్రతిపాదించిన రాజకీయ బృందం మీద పరిశోధనలు సాగించారు. 1950ల నుంచి అమెరికాలో పౌరహక్కుల ఉద్యమంలోనూ, ఆ తరువాత వియత్నాం యుద్ధ వ్యతిరేక ఉద్యమంలోనూ పాల్గొన్న హోవార్డ్ చివరి క్షణం వరకు అమెరికా విదేశాంగ విధానాన్ని, స్వదేశీ విధానాలను తీవ్రంగా విమర్శిస్తూ, రచిస్తూ ఉన్నారు. 1980లో ఆయన ప్రచురించిన ఉద్గ్రంథం 'ఎ పీపుల్స్ హిస్టరీ ఆఫ్ ది యునైటెడ్ స్టేట్స్' లక్షలాది ప్రతులతో, కోట్లాది మందిని ఆకర్షించింది. మార్క్స్ జీవితం మీద ఆయన రాసిన నాటకం 'మార్క్స్ ఇన్ సొహో' గత పది సంవత్సరాలుగా అమెరికాలోనూ, యూరప్‌లోనూ వందలాది ప్రదర్శనలు జరిగింది. 1960లలోని అమెరికన్ విద్యార్థి, నల్లజాతి, పౌరహక్కుల ఉద్యమాల నేపథ్యంలో మేధావుల బాధ్యత గురించి రాసిన ఈ వ్యాసం 1969 అక్టోబర్ 18న 'సాటర్‌డే రివ్యూ' పత్రికలో అచ్చయి, ఆ తరువాత అనేక సార్లు పునర్ముద్రణ పొందింది.)*

మేధావులం, ఆలోచనాపరులం, పండితులం అయిన మనం ఈ ప్రపంచంలో చేయవలసిన పని ఏమిటో గుర్తించవలసిన సమయం వచ్చింది. మన చుట్టూ ఉన్న జనం అమాయకులు గనుక మనను గౌరవిస్తున్నారు. ప్రశంసిస్తున్నారు. నాగరికతా చరిత్రలో ఎందుకూ పనికిరాని అధ్యయనాలను లెక్కకు మిక్కిలిగా తయారు చేస్తున్నందుకు మనకు తిండి పెడుతున్నారు. వేలాది వ్యాసాలు, పుస్తకాలు, నివేదికలు, లక్షల కొద్దీ అధ్యయన పత్రాలు, దేవతలకు కూడా చెవులు చిల్లులు పడగొట్టే ఉపన్యాసాలు – వీటికి మనకు ప్రతిఫలం దొరుకుతోంది. సరిగ్గా రాజకీయ నాయకుల లాగానే మనం కూడా ప్రజల అమాయకత్వం మీద పొట్టపోసుకుంటున్నాం. అయితే వాళ్లకూ మనకూ ఒకటే తేడా. రాజకీయ నాయకులు తమను కాపాడుతారని ప్రజలు వాళ్లను పోషిస్తున్నారు. వాళ్లు ఆ పని చేయడం లేదు. మనం కాపాడక పోయినా మనను పోషిస్తున్నారు. మనం నిజంగానే కాపాడడం లేదు.

ఎప్పుడో ఒకసారి మనం మన గ్రంథాలయాల పుస్తకాల కుప్పలలో నుంచి బయటికి వచ్చి ఒక ప్రకటన మీద సంతకం చేస్తాం. లేదా, ఒక ఉపన్యాసం ఇస్తాం. అంతే. మళ్లీ వెనక్కి వెళ్లి మన పనికిమాలిన ఉత్పత్తి కొనసాగించడంలో పడిపోతాం. ఎప్పుడన్నా మనం మన సామాజిక బాధ్యతను గుర్తించినట్టయితే అది మన విద్యా కార్యక్రమానికి బయటనే ఉంటోంది. మన విద్యా కృషి మాత్రం సురక్షితంగా తటస్థంగా ఉంటోంది. ఈ భూమి మీద ప్రజలు వేదనను అనుభవిస్తూ ఉండగా, పట్టించుకోకుండా రోదసిలోకి ఎగిరిపోయిన వాళ్లకే ఆశ్చర్యమూ, గౌరవమూ దక్కుతాయని మొట్టమొదట గుర్తించింది మనమే.

నా ఆరోపణలు మీకు కటువుగా అనిపిస్తే గత ఇరవై సంవత్సరాలలో అచ్చయిన పి.ఎచ్‌డి. సిద్ధాంత పత్రాల శీర్షికలు చదవండి. అదే కాలంలో ప్రఖ్యాత మేధో పత్రికల పుటలు తిరగేయండి. అలాగే యుద్ధాలలో చనిపోయిన వారి జాబితాలు తీయండి. లాటిన్ అమెరికాలో తలసరి ఆదాయపు అంకెలు చూడండి. మాల్కం ఎక్స్ ఆత్మకథ చదవండి. లోకమంతా చచ్చిపోతూ ఉంటే, మనం మన రచనలు అచ్చువేసుకుంటున్నాం.

మన విద్యా సంబంధ ఉత్పత్తులకు, సంక్షుభిత ప్రపంచపు అవసరాలకు మధ్య అఖాతం చాలా పెద్దది. ఆ సమస్యలను ప్రభుత్వాలు గనుక పరిష్కరిస్తూ ఉన్నట్టయితే ఈ అఖాతాన్ని చూసీచూడనట్టు వదిలేయవచ్చు. మనకు తెలిసిన చరిత్రంతా ప్రభుత్వాలు ఆ సమస్యలను పరిష్కరిస్తున్నట్టే కనబడుతుంది. మన దగ్గర జాతి వివక్ష సమస్య ఉండేది. మనం దాన్ని పరిష్కరించాం. బానిసత్వం మీద యుద్ధం ప్రకటించి పరిష్కరించాం. చట్టాలు చేసి, వాగాడంబరపు ఉపన్యాసాలు చేసి నల్లజాతి ప్రజల దుర్భర జీవితాన్ని కనబడకుండా చేశాం. సంపద పంపిణీ సమానంగా జరగలేదనే సమస్య ఉండేది. అనేక సంక్షేమ విధానాల ద్వారా, యుద్ధాల ద్వారా ఈ సమస్యను అదుపులోకి తెచ్చాం. లేదా, కంటికి కనబడకుండా చేశాం. ప్రపంచంలో ఎన్నో చోట్ల సంక్షోభాలు తలెత్తాయి. మనం మాత్రం ఎల్లప్పుడూ అంచులలో ఉండిపోయాం. యురపియన్ సామ్రాజ్యవాద శక్తులు దుర్మార్గాలు సాగిస్తుంటే, మనం మిగిలిపోయిన ఎంగిలి మెతుకులు ఏరుకున్నాం. ఒక్క లాటిన్ అమెరికాలో మాత్రం మనమే ప్రధాన బాధ్యత వహించాం. కాని అది వేరే కథ.

అయితే, ఇప్పుడు ఈ పరిష్కారాలేవీ పనిచేయడం లేదు. నల్లజాతి ప్రజల తిరుగుబాటు, నగరాలలో మన అదుపు దాటిపోయిన ఆందోళనలు, వియత్నాం యుద్ధానికి వ్యతిరేకంగా, సైనిక సమీకరణకు

వ్యతిరేకంగా విద్యార్థులు సాగిస్తున్న తిరుగుబాటు – ఇవన్నీ ఇక అమెరికా పని అయిపోయిందని చూపుతున్నాయి. మన కాలం చెల్లిపోయింది. మనకింక స్థలం లేదు. మన వాగాడంబరానికి స్థానం లేదు. పాత పద్ధతులన్నీ మార్చుకొని మన సామాజిక విధానంలో విప్లవాత్మక మార్పులు తేవలసి ఉంది.

అయితే సమస్య ఏమంటే ఆ విప్లవం ఎలా తేవాలో మనకు తెలియదు. అధికారం, సంపద అతి ఎక్కువగా ప్రభుత్వం దగ్గర, కార్పొరేషన్‌ల దగ్గర, సైన్యం దగ్గర పోగుబడిన, అభివృద్ధి చెందిన పారిశ్రామిక సమాజంలో విప్లవం ఎలా సాగుతుందో గత ఉదాహరణలు లేవు. నిజానికి ఈ పోగుబడిన అధికారం, సంపద మనందరికీ కూడ ఎంతో కొంత అందుతోంది. దాన్నే రాజనీతి శాస్త్రవేత్తలు బహుళత్వం అని ఆకర్షణీయంగా పిలుస్తారు. మనందరికి గొంతులున్నాయి, ఓట్లు కూడా ఉన్నాయి. కాని, మన దేశీయ, విదేశాంగ విధానాలను కొత్త దారికి మళ్లించడానికి అవసరమైన సాధనాలు గానీ, అధికారం గానీ లేవు.

అందుకే, జ్ఞాన పరిశ్రమ అనేది చాలా ముఖ్యం. జ్ఞాన పరిశ్రమ అంటే, ప్రతి సంవత్సరం జాతీయ స్థాయిలో 6500 కోట్ల డాలర్లు ఖర్చు పెట్టే విశ్వవిద్యాలయాలు, కళాశాలలు, పాఠశాలలు. జ్ఞానం కూడా ఒకరకమైన అధికారమే. అధికారానికి ప్రత్యక్ష రూపం బలప్రయోగం అనేమాట, దాని మీద ప్రభుత్వానికే గుత్తాధికారం ఉన్నదనే మాట నిజమే. కాని, ఆధునిక సమాజాలలో, పాలితుల అనుమతి మీదనే పాలకుల సామాజిక అదుపు కొనసాగే రోజులలో బల ప్రయోగం అనేది కాసేపు పక్కకు పెట్టబడుతుంది. దాన్ని కేవలం అత్యవసర పరిస్థితులలోనే వాడుతారు. రోజువారీ నియంత్రణను మాత్రం కొన్ని సూత్రాల ద్వారా, కొన్ని విలువల ద్వారా అమలు చేస్తారు. ఆ సూత్రాలను, ఆ విలువలను సమాజంలోని బోధకులు, ఉపాధ్యాయులు ఒకతరం నుంచి మరో తరానికి అందజేస్తూ ఉంటారు. ప్రపంచ వ్యాప్తంగా ప్రజాస్వామ్య వికాసం అని మనం చెప్పేదంతా సమాజాన్ని యథాతథంగా ఉంచడానికి బల ప్రయోగం స్థానంలో మోసాన్ని వాడడమే. ఈ ప్రధాన రూపమైన మోసాన్ని ఇంకా స్పష్టంగా చెప్పాలంటే విద్య అని పిలవాలి.

అందువల్లనే జ్ఞానం చాలా ముఖ్యం. అది నేరుగా బలప్రయోగాన్ని ఎదుర్కోజాలదు. కాని, ప్రభుత్వ బల ప్రయోగాన్ని సాధికారం చేసే మోసాన్ని జ్ఞానం ఎదుర్కోగలుగుతుంది. అందుకే, ఇవాళ మన కళాశాలలో, విశ్వవిద్యాలయాలలో 70 లక్షల మంది యువకులను ప్రభావితం చేస్తున్న జ్ఞాన పరిశ్రమే అధికారానికి ముఖ్యమైన, సున్నితమైన కేంద్రమైంది. ఈ జ్ఞాన అధికారాన్ని సాంప్రదాయికంగా యథాస్థితిని కొనసాగించడానికి వాడుకున్నారు. లేదా ఇవాళ విద్యార్థి తిరుగుబాటు దారులు కోరుతున్నట్టు యథాస్థితిని మార్చడానికి వాడుకోవచ్చు.

రాజకీయాధికారం, సంపద లాంటి ప్రత్యక్ష అధికార రూపాలను తమ చేతుల్లో పెట్టుకున్న వాళ్లే జ్ఞానాన్ని కూడా అదుపు చేయడానికి ప్రయత్నిస్తారు. పారిశ్రామికవేత్తలు కొంతమంది ప్రజ్ఞావంతులను తమ వ్యాపారాలలో అధికార స్థానాలలోకి ఆకర్షిస్తారు. ప్రభుత్వం మరి కొందరిని ఆకర్షణీయమైన ప్రత్యేక ఉద్యోగాలలోకి తీసుకుంటుంది. భౌతిక శాస్త్రవేత్తలను హైడ్రోజన్ బాంబులు తయారు చేయడానికి నియమిస్తారు. జీవశాస్త్రవేత్తలను అంటువ్యాధులను పెచ్చరిల్లజేయడం ఎలా అనే పరిశోధనలోకి తీసుకుంటారు. మనుషులను చంపే నర్వ్‌గ్యాస్ తయారు చేయడానికి రసాయన శాస్త్రవేత్తలను ఉపయోగించుకుంటారు. తిరుగుబాటుదారులను అణచివేసే రణతంత్రాన్ని కనిపెట్టడానికి రాజనీతి శాస్త్రవేత్తలకు ఉద్యోగాలు ఇస్తారు. చరిత్రకారులను వైట్‌హౌస్‌లో కూర్చోబెట్టి యుద్ధం మొదలుకాగానే చరిత్ర నిర్మాణం మొదలవుతుందని, అప్పుడది రాయవలసి ఉంటుందని చెపుతారు. ఒక్కోసారి వాళ్లు ఏ శాస్త్రం చదువుకున్నారనే దానితో కూడా సంబంధం లేదు. యుద్ధం అన్ని శాస్త్రాలకు సంబంధించినది.

అయితే, మొత్తం జ్ఞానాన్ని నేరుగా కొనడం కూడా సాధ్యం కాదు. దాన్ని చిల్లర విషయాలలోకి మళ్లించడం ద్వారా కూడా సామాజిక భద్రతను సాధించవచ్చు. అలా విశ్వవిద్యాలయం అనేది ఒక ఆట స్థలంగా మారిపోతుంది. ఆ ఆటస్థలంలోకి సమాజం తన ముద్దు బిడ్డలను ప్రవేశపెట్టి, వాళ్లతో ఆటలాడించి, వారికి బొమ్మలు, బహుమతులు ఇస్తుంది. వారు బయట గొడవ చేయకుండా ఉంటే చాలు. అందుకే, విశ్వవిద్యాలయాలలో పరిశోధన ఎందుకూ పనికిరాని విషయాల మీద జరుగుతూంటుంది. ఇటీవలే కొంతమంది సామాజిక మనస్తత్వ శాస్త్రవేత్తలు పెద్దఎత్తున ప్రభుత్వ నిధులతో నల్లజాతి నివసించే మురికివాడల మీద పరిశోధన చేశారు. విస్తృతమైన, అత్యంత సాంకేతికమైన పరిశోధన తర్వాత వారు రెండు మహత్తర విషయాలు కనిపెట్టారు. ఒకటి, మురికివాడలలోని నల్లజాతి ప్రజలు పేదరికంలో ఉన్నారు. రెండు, వారికి కుటుంబ సమస్యలున్నాయి.

విశ్వవిద్యాలయాలలో జరిగే విషయాల మీద నేను అతిగా మాట్లాడుతున్నాననిపిస్తుందా? తక్షణమే పనికిరాని పాండిత్యాన్నంతా కొట్టివేస్తున్నాననిపిస్తుందా? లేదు, నేను మాట్లాడుతున్నది ప్రాధాన్యతల గురించి. వందల అంతస్తుల ఆకాశహర్మ్యాలు నిర్మించడం దానికదిగా తప్పు కాదు. కాని, నేలకు అంటుకుపోయిన మురికివాడల గుడిసెల పక్కనే ఆ భవనాలు లేచి నిలవడం విచారకరం. ఈ మధ్యే జరిగిన ఒక ఆసియా అధ్యయనాల వార్షిక సదస్సులో శతాబ్దాల కిందటి మింగ్ రాజవంశపు సమస్యల గురించిన చర్చ జరిగింది. మంచిదే. కాని, అక్కడ జరిగిన డజన్ల కొద్దీ సదస్సులలో వియత్నాం విషాదం గురించి ఒక్క ముక్క కూడా లేదు. అదీ విచారం.

సామాజిక శాస్త్రాలలో ఇలాంటి చిల్లర, పనికిరాని పరిశోధనలతో పాటు మరొక పద్ధతి కూడా ఉంది. ఆడంబరంగా పలికే సాధారణీ కరణలతో జ్ఞానాన్ని పలచబారుస్తారు. ఏదో మాట పట్టుకొని అంతూ పొంతూ లేని నిరర్థకమైన చర్చలు సాగిస్తారు. ఎడతెగని ఆ చర్చలకు వాస్తవ ప్రపంచంతో ఏ సంబంధమూ ఉండదు. ఆ చర్చ చేసే పండితులు గుడి గుడి గుంచెంలో తిరుగుతుంటారు. సంవిధానాలు, నమూనాలు, వ్యవస్థలు ఎప్పటికప్పుడు చాలా లోతుగా సృష్టిస్తున్నట్టు కనబడుతూ వాటి ద్వారా ఉద్యోగాలు, పదవులు, జీతభత్యాలు పెంచుకుంటారు తప్ప ప్రపంచానికి ఏమీ ఉపయోగం ఉండదు.

అందువల్లనే ఇటీవల విద్యాలయాలలోనూ, విద్యా సంబంధమైన సమావేశాలలోనూ, ఆయా శాస్త్ర అధ్యాపకుల వార్షిక సమావేశాలలోనూ చాలా ప్రశ్నలు, చర్చలు రేగడం ఆశ్చర్యకరం కాదు. అయితే ఇక్కడ కూడ ఒక సమస్య ఉంది. మనమేమో మన ఆలోచనలను మంచి

ప్రయోజనాల కోసం ఉపయోగపెట్టుకోవాలనే ఉత్సుకతతో ఉన్నాం. కాని, మన మెదళ్లు ఇప్పటికే కొన్ని నమ్మకాల బురదలో చిక్కుకుపోయి ఉన్నాయి. మనలోని అత్యంత క్రియాశీలమైన కార్యకర్త కూడా ఆ బురదలో నుంచి బయటపడడం కష్టంగా ఉంది. ఆ నమ్మకాలను 'నిష్పాక్షికమైన మేధావిత్వం', 'నిర్మమకారమైన అధ్యయనం', 'తటస్థమైన పరిశోధన', 'శాస్త్రీయ సంవిధానం' అనే పేర్లతో పిలుస్తుంటారు. ఈ మాటలన్నిటికీ అర్థం ఒక్కటే – మన జ్ఞానాన్ని మన నైతిక లక్ష్యాల కొరకు ఉపయోగించడం అసమంజసం అని. ఈ మాటలతో మనం ఎల్లప్పుడూ మన వృత్తీ, మన సంస్థలూ ఇచ్చే నమ్మకాలకు బానిసలుగా ఉంటూ ఉండాలి. ఆ నమ్మకాలు మనుషులుగా మన అనుభూతులను, మన విలువలను అవమానించినప్పటికీ, విద్యావేత్త తటస్థంగా ఉండడం అనేది మనం చరిత్రగా చెప్పే ఆదర్శాలకు భంగకరమైనప్పటికీ, తటస్థంగా లేని ప్రపంచపు బాధితుల పట్ల ద్రోహమే అయినప్పటికీ అలా ఉండడాన్నే మనకు నేర్పుతున్నారు.

అందువల్ల ఈ 'నిష్పాక్షికమైన, తటస్థమైన, శాస్త్రీయమైన, నిర్మమకారమైన' మేధావిత్వం వాదనలను పరిశీలించవలసి ఉంది. సమాజంలో జరగవలసిన విప్లవంతోపాటుగా జ్ఞాన ప్రయోజనాలలో జరగవలసిన విప్లవం కూడా ఉంది. ఆ విప్లవం జ్ఞానాన్ని వృథా చేసే సూత్రాలను సవాలు చేయవలసి ఉంటుంది. ఆ వాదనలను, వాటికి భిన్నమైన దృక్పథాలను ఇక్కడ మీముందుంచుతాను.

మొదటి సూత్రం : నిష్పాక్షికమైన మేధావిత్వం కొనసాగించండి అనే పిలుపు అమాయకమైనది. ఎందుకంటే విద్యాలయంలో అప్పటికే శక్తిమంతమైన ప్రయోజనాలు గల శక్తులున్నాయి. ఆ ప్రయోజనాల గురించి గుర్తింపు ఉండవచ్చు, ఉండకపోవచ్చు. కాని, అప్పటికే పాక్షికంగా ఉన్న చోటనే మన మేధావిత్వం మొదలవుతుంది.

రాజకీయ అధికారం, కార్పొరేట్ సంపదలతో కూడిన వ్యవస్థకు కొన్ని ప్రయోజనాలున్నాయి. ఆ ప్రయోజనాల ప్రకారం సామాజిక నిర్మాణంలో ఇప్పటికే ఉన్న స్థలాలలో పనిచేసే వాళ్లనే విశ్వవిద్యాలయాలు తయారు చేయాలని, మొత్తం నిర్మాణాన్ని మార్చదలచుకున్న వాళ్లను తయారు చేయకూడదని ఆ వ్యవస్థలు కోరుకుంటాయి. వ్యక్తులను సామాజికులుగా తీర్చిదిద్దడంలో విద్యా విధానానికి పాత్ర ఉందని మనకు తెలుసు. కాని, దాని గురించి మనమెప్పుడూ ఆందోళన చెందలేదు. ఎందుకంటే కొనసాగుతున్న సామాజిక నియమాలు అలాగే ఉండాలని మనం అనుకున్నాం. ఇప్పుడిప్పుడే వాటిని ప్రశ్నించాలనే చైతన్యం మనకు అబ్బుతోంది. విద్యా వ్యవస్థలలో కూడా ఒక పెత్తందారీవర్గం ఇప్పటికే తయారయింది. అది తనను తాను కొనసాగించుకోవాలని, దాని ఆదాయాలు, దాని భవనాలు, దాని హోదాలు, కీర్తులు, భౌతిక లాభాలు అన్నీ పాత పద్ధతిలోనే కొనసాగుతూ, పెరుగుతూ పోవాలని అది అనుకుంటుంది. విద్యా వ్యవస్థకు ఉన్న ఈ విశాల ప్రయోజనాలు ఒక మేధావిలో అంతర్గత ప్రేరణలుగా మారి పదోన్నతి, ఉద్యోగ కాలం, ఉద్యోగ భద్రత, ఎక్కువ జీతం, హోదా అనే విలువలుగా మారుతాయి. అధికారులు చెప్పిన పద్ధతిలో నడవడమే వీటన్నిటికీ హామీ అని అనిపిస్తుంది.

ఈ ప్రయోజనాలన్నీ ఏదో కుట్రపూరిత నిర్ణయాల ద్వారా అమలు కావు. అవన్నీ అమలు కావడానికి ఒక అదృశ్య యంత్రం నిరంతరం పనిచేస్తూ ఉంటుంది. ఆర్థిక వ్యవస్థ ఎంత హేతు రహితంగా ఉన్నా, అది లాభాకాంక్ష, మార్కెట్ అనే యంత్రాంగం ద్వారా ఎలా కొనసాగుతూ ఉంటుందో, చట్ట సభలలో ఏయేడాదికా ఏడాది రాజకీయ నిర్ణయాలు ఎలా పునరుత్పత్తి అవుతాయో ఇది కూడా అలాగే.

ఏమి జరగాలో ఏ ఒక్కరూ ఉద్దేశపూర్వకంగా ప్రణాళిక వేయరు. ప్రతి ఒక్కరూ సాధారణ సూత్రాలను పాటిస్తూ ఉంటారు. విద్యలో కూడా అంతే. ఆ సూత్రాలను పాటించడం ద్వారానే విద్యావేత్త చిల్లర విషయాలలోకి, ఆడంబరత్వంలోకి, అనవసర విషయాలలోకి, పుస్తకాలూ, డిగ్రీలూ, భవనాలూ, పరిశోధనా పథకాలూ, మృతజ్ఞానం అనే ఉత్పత్తులలోకి వెళుతూ ఉంటాడు. ఆ సూత్రాలనే ప్రశ్నించవలసిన అవసరం ఉంది.

ఏ ప్రయోజనాలూ లేని విశ్వవిద్యాలయం అనేదేమీ లేదు. ఎటువంటి ప్రయోజనాలను విశ్వవిద్యాలయం ఆశిస్తున్నదనే ప్రశ్న. ఏ ప్రత్యేక వర్గానికీ, పార్టీకీ, జాతికీ, భావజాలానికీ చెందని మౌలిక, మానవీయ ప్రయోజనాలనే విశ్వవిద్యాలయం చైతన్యయుతంగా నెరవేర్చాలని నేననుకుంటాను. విద్యలో విలువలను పెంచి పోషించాలని అన్నప్పుడు మన అర్థం అదే.

అందువల్ల విశ్వవిద్యాలయాలు నిర్మొహమాటంగా తమ ప్రయోజనం యుద్ధాన్ని, దారిద్ర్యాన్ని, జాతి ద్వేషాన్ని రద్దు చేయడమేనని, వ్యక్తి స్వేచ్ఛ మీద ప్రభుత్వ ఆంక్షలను వ్యతిరేకించడమని, రాబోయే తరంలో సహకార, సహజీవన స్ఫూర్తిని పెంపొందించడమని చెప్పుకోవలసి ఉంది. విశ్వవిద్యాలయం ఏ జాతుల, పార్టీల, మతాల, రాజకీయ విశ్వాసాల ప్రయోజనాలకు సేవ చేయకూడదు.

రెండో సూత్రం : తటస్థంగా ఉండు. విద్యా బోధనలో, పాండిత్యంలో తటస్థత అనే మిథ్య ఒక సాధారణ గందరగోళం మీద రూపొందింది. తటస్థంగా ఉండడమంటే ఒకరు చూసిన దానిని కచ్చితంగా నివేదించడంలో జాగ్రత్తగా ఉండడమనే అర్థం చెప్పుకుంటే అది చాలా సరైనదే. కాని, కచ్చితత్వమనేది ఒకానొక షరతు మాత్రమే. ఒక కమ్మరి మంచి పనిచేయాలంటే నమ్మదగిన కొలత సాధనాలు ఉండాలనడం ఒకానొక షరతు మాత్రమే. కీలక సమస్యకు అది జవాబు చెప్పజాలదు. ఆ సరైన సాధనాలతో ఆ కమ్మరి కత్తి తయారు చేస్తాడా? నాగలి కర్రు తయారు చేస్తాడా? నాగలి తయారు చేయాలని ముందే నిర్ణయించుకున్నంత మాత్రాన అతని కొలత సాధనాలను తారుమారు చేయనక్కరలేదు. అలాగే ఒక విద్యావేత్త యుద్ధం కన్న శాంతి మంచిది అని ముందే నిర్ణయించుకుంటే తన వాస్తవాలను తారుమారు చేయవలసిన అవసరమేమీ లేదు.

చాలామంది విద్యావేత్తలు మొట్టమొదటనే విలువల చట్రాన్ని కలిగి ఉండడమనేది తప్పు అని భావిస్తారు. ఎందుకంటే ఒక అంతిమ విలువల చట్రం ఉండడానికి, వాటిని చేరే సాధనాలు వాడడానికి మధ్య వారు సరైన విభజన చేసుకోలేరు. అంతిమ విలువలనేవి స్వీయ మానసికమే కావచ్చు. మానవ అవసరాల నుంచి రూపొందినవే కావచ్చు. కాని, సాధనాలు మటుకు తటస్థమైనవీ, కచ్చితమైనవీ కావు. మన విలువలు మన మేధో పరిశోధనల్లో వేయవలసిన ప్రశ్నలను నిర్ణయించాలి గాని, జవాబులు నిర్ణయించగూడదు.

మూడో సూత్రం : మీ శాస్త్రానికే మీరు కట్టుబడి ఉండండి. ప్రస్తుత విద్యా ప్రపంచంలో ప్రత్యేక నైపుణ్యం అనేది వైద్య ప్రపంచంలో లాగ అత్యంత మూర్ఖంగా మారిపోయింది. ప్రస్తుతం అమెరికా ప్రభుత్వం అనే విషయంలో ప్రత్యేక నైపుణ్యం ఉన్న వాళ్లు కూడా లేరు. దాన్ని కూడా ముక్కలు చేసి కాంగ్రెస్‌లో నైపుణ్యం ఉన్నవాళ్లు, అధ్యక్ష పదవిలో నైపుణ్యం ఉన్నవాళ్లు, ఒత్తిడి బృందాలలో నైపుణ్యం ఉన్నవాళ్లు తయారయ్యారు. చరిత్రకారులలో వలసకాలపు చరిత్రకారులు వేరే, తొలి జాతీయ దశ చరిత్రకారులు వేరే. విద్యా విధానం మౌలిక విలువలను పెంపొందించే కర్తవ్యం నుంచి దూరమైనప్పుడు ఇటువంటి విభజన సహజమే. ప్రతి సంవత్సరం 80 వేల కోట్ల డాలర్ల సంపదను సృష్టించే దేశంలో పేదరికాన్ని తొలగించడం ఎలా అనే నిజమయిన సమస్య మీద పని చేయాలంటే ఎవరైనా ఆ సమస్యనూ అనేక శాస్త్రాల పరిధి లోపల మాత్రమే పరిశీలించగలరు. చారిత్రక ఆధారాలు, ఆర్థిక సిద్ధాంతాలు, రాజకీయ సమస్యలు కలిపి చూసినప్పుడు మాత్రమే ఆ పరిశోధన సాధ్యమవుతుంది. కాని, ప్రత్యేకత వల్ల ఏ సమస్యను మొదటి నుంచి చివరి దాకా సమగ్రంగా పరిశోధించడం సాధ్యం కాదు. వ్యవస్థకు సాధారణంగా ఉండే విభజించి పాలించు అనే సూత్రం విద్యా వ్యవస్థలో ఈ విధంగానే అమలవుతుంది.

విశ్వవిద్యాలయాలలో మరొకరకమైన విద్యా విభజన ఉంది. అది తక్షణ సామాజిక సమస్యలను పరిశీలించడం నుంచి పక్కకు తప్పిస్తుంది. అది వాస్తవానికీ, సిద్ధాంతానికీ మధ్య విభజన రేఖను గీస్తుంది. మన విద్యా విధానంలో తత్వవేత్తలూ, కవులూ ప్రకటించిన ఆదర్శాలను ఒకచోట నేర్చుకుంటాం. మరొక చోట వాస్తవికమైన ప్రపంచంలో ఏ వృత్తిలో ఉండాలో ఆ స్థానానికి మనను మనం సరిపెట్టుకోవడం నేర్చుకుంటాం. ఉదాహరణకు, రాజనీతి శాస్త్రంలో ఒక రాజనీతి సిద్ధాంత వేత్త ఆదర్శ సమాజం అనే ఉదాత్త విలువల గురించి చెప్పిన మాటలను ఒకచోట అధ్యయనం చేస్తాం. మరొకచోట మరొకరు ప్రస్తుత ప్రభుత్వాలు వాస్తవికంగా ఎలా పనిచేస్తున్నాయో వివరిస్తారు. కాని, ఏ ఒక్కరూ ఎలా ఉంది, ఎలా ఉండాలి అని ఒకే చోట చెప్పరు. అలా చెప్పినట్టయితే వారే ఇక్కడి నుంచి అక్కడికి ఎలా వెళ్లాలో చెప్పాల్సి వస్తుంది. వర్తమాన వాస్తవం నుంచి కవితా ఆదర్శంలోకి ఎలా పయనించాలో చెప్పవలసి వస్తుంది. రాజనీతి శాస్త్రంలో సామాజిక మార్పు వ్యూహాల గురించి ఎంత తక్కువ కృషి జరిగిందో ఒక్కసారి చూడండి. ఉపాధ్యాయుడు, విద్యార్థి కూడా సిద్ధాంతాన్నీ, వాస్తవాన్నీ వేరువేరు పాఠాలలో చదువుతారు. ఈ ముక్కలు చేసిన పాఠాలు వాళ్లను తటస్థులుగా మార్చేస్తాయి.

ఇక్కడ రూసో అన్న మాట నాకు గుర్తొస్తోంది. 'మనకు భౌతిక శాస్త్రవేత్తలు ఉన్నారు. రేఖా గణితజ్ఞులు ఉన్నారు. రసాయన శాస్త్రవేత్తలు ఉన్నారు. ఖగోళ శాస్త్రవేత్తలు, కవులు, సంగీతకారులు, చిత్రకారులు లెక్కలేనంత మంది ఉన్నారు. కాని మనలో ఒక్క పౌరుడు కూడా ఉన్నట్టు లేదు'.

నాలుగో సూత్రం : శాస్త్రీయంగా ఉండడమంటే తటస్థంగా ఉండడమే. విజ్ఞాన శాస్త్రం అనేది వాస్తవాల విషయంలోనూ, లక్ష్యాల విషయంలోనూ ఎలా పనిచేస్తుందనే తప్పుడు అవగాహన ఇది. విజ్ఞాన శాస్త్రవేత్తలకు కూడా విలువలు ఉంటాయి. కాకపోతే వాళ్లు ఆ విలువల గురించి చాలా కాలం కిందనే నిర్ణయించుకుని ఇప్పుడు ఆ విషయమే మరచిపోయారు. మానవ జీవితాన్ని కాపాడడం, మనుషుల సంతోషం కోసం పర్యావరణం మీద మనిషి అదుపును విస్తరించడం వాళ్ల లక్ష్యాలు. విజ్ఞాన శాస్త్రం చేసే ఏ కృషిలోనయినా అంతర్గతంగా ఉన్న విలువ అది. అందుకే ఒక వైద్యుడిని బతుకుకూ చావుకూ మధ్య, ఆరోగ్యానికీ అనారోగ్యానికీ మధ్య తటస్థంగా ఉండి పనిచేయమని అడిగితే ఆశ్చర్యపోతాడు. మరి సామాజిక శాస్త్రవేత్తలు మాత్రం ప్రజలను సజీవంగా ఉంచడం, భూగోళపు వనరులను సమానంగా పంచడం, మానవ స్వాతంత్ర్యపు పరిధిని విస్తరించడం అనే లక్ష్యాలను తమ లక్ష్యాలుగా బహిరంగంగా చెప్పుకోలేకపోతున్నారు. తమ కృషిని ఆ లక్ష్యాల కోసం వెచ్చించకుండా తటస్థంగా ఉంటామంటున్నారు.

సామాజిక శాస్త్ర పనిముట్లకు స్వీయమానసిక దృష్టి అనే మురికి అంటుకొని ఉంటుందని, అందువల్ల సామాజిక శాస్త్రం భిన్నమైనదని ఒక మాట వినబడుతుంది. ఇలా వాదించేవారు భౌతిక శాస్త్రాలలోని కొత్త అన్వేషణల గురించి తెలుసుకుంటున్నట్టు లేరు. భౌతిక శాస్త్రవేత్త కొలుస్తున్న అంశాన్ని పరిశీలన అనేదే వక్రీకరిస్తుందని ఇప్పుడు భౌతిక శాస్త్రం చెబుతోంది. అలాగే ఏమి చూస్తున్నామనేది ఎక్కడ నిలబడి చూస్తున్నామనే దాని మీద ఆధారపడి ఉంటుందని ఖగోళ శాస్త్రం చెబుతుంది. ఇప్పుడు భౌతిక విజ్ఞాన శాస్త్రాలే దేన్నీ కచ్చితంగా చెప్పలేమని అంటున్నాయి. 'సంభావ్యత' గురించి మాత్రమే మాట్లాడుతున్నాయి. ఈ సంభవించే అవకాశాలు భౌతిక శాస్త్రాలలో హెచ్చుగా ఉండవచ్చు. సామాజిక శాస్త్రాలలో తక్కువగా ఉండవచ్చు. అంతే గాని రెండు శాస్త్రాలలోనూ పరిశీలనాంశాల కచ్చితత్వం గురించి చెప్పలేం.

ఐదో సూత్రం : మేధావులు 'హేతుబద్ధంగా' ఉండాలంటే 'ఉద్వేగాలను' పక్కన పెట్టాలి. ఇటీవలే ఆసియా అధ్యయనాల పరిశోధకులు ఒకరు వియత్నాం వెళ్లి వచ్చి రాసిన వ్యాసాలు ఉద్వేగ పూరితంగా ఉన్నాయని విశ్వవిద్యాలయ అధికారులు మందలించారు. నిజమే, ఉద్వేగం వక్రీకరణకు దారితీస్తుంది. కాని ఒక విషయం ఉద్వేగం వల్లనే గాఢంగా కూడా ఉండవచ్చు. ఒక మేధావి కర్తవ్యం కచ్చితంగా వర్ణించడమే అనుకుంటే ఒక యుద్ధాన్ని వర్ణించేటప్పుడు ఉద్వేగరహితంగా ఉండి కచ్చితంగా వర్ణించడం అసాధ్యం. మనిషి మనసుకు ఉన్న ప్రత్యేక సామర్థ్యం ఏమంటే మన పరిమిత అనుభవానికి బయట ఉన్న వాస్తవాన్ని గ్రహించడమే. ఆ సామర్థ్యం పెరగడానికి, ఆ అనుభూతి పదునెక్కడానికి ఉద్వేగమే కారణమవుతుంది. ఒక శ్వేత జాతీయుడైన విద్యార్థికి నల్లజాతి మనిషి అనుభవించే బానిసత్వపు వేదన అర్థం కావాలంటే ఆ బానిసత్వం గురించి ఉద్వేగభరితమైన వివరణ ఇవ్వక తప్పదు.

అంటే, మన మేధస్సు మనకు ఏమి అందిస్తుంది అనే విషయాన్ని పరిశీలించినప్పుడు, మన అవగాహన పరిధులను పెంచాలనుకున్నప్పుడు 'నెమ్మదైన, హేతుబద్ధమైన, ఉద్వేగరహితమైన' వైఖరి ఆ పని చేయజాలదు. అటువంటి నెమ్మదైన చారిత్రక వివరణ వల్లనే ఈ దేశంలో నల్లజాతి ప్రజలు ఎటువంటి వేదనను అనుభవిస్తున్నారో శ్వేతజాతి అమెరికన్లు గ్రహించలేకపోయారు. అచ్చయిన కాగితం మీద నాణ్యమైన వచనంలో క్రూరత్వాన్నంతా తొలగించి యుద్ధం గురించి, హింస గురించి ఎంత రాసినా అవి చదివే యువకులకు అదంతా సహించదగినదే అనిపించింది. కాకపోతే ఇంగ్లిష్ సాహిత్యం పాఠాలలో చదివిన

కవిత్వంలోనూ, నవలలోనూ ఆ క్రౌర్యం ఉండవచ్చు గాని దానికీ, చరిత్రకూ, రాజనీతికీ ఏమీ సంబంధం లేకుండా పోయింది. హేతుబద్ధత కచ్చితంగా ఉండాలంటే తప్పనిసరిగా దానికి ఉద్వేగం జోడించవలసిందే.

ఇక నిష్పాక్షికత, తటస్థత, శాస్త్రీయ సంవిధానం, హేతుబద్ధత వంటి సాంప్రదాయిక భావనల బంధనాల నుంచి బయటపడి మన మేధావులు ఏమి చేయగలరు? ఈ ప్రపంచాన్ని మరింత మెరుగ్గా జీవించగల ప్రపంచంగా మార్చే పాక్షికమైన కర్తవ్యాన్ని ఎలా నెరవేర్చగలరు. మేధో సంబంధమైన కార్యకలాపాలన్నిటినీ నియంత్రణలో పెట్టాలని నేను సూచిస్తున్నానా? ఎంత మాత్రం కాదు. దానికి బదులుగా నేను సూచించేదేమంటే, మేధావులు, విద్యావేత్తలు తాము ఏ సూత్రాల మీద పనిచేస్తున్నారో వాటిని పునరాలోచించుకోవాలి. మన కాలపు తక్షణ సమస్యల మీదికి తమ మేధోశక్తిని ఉపయోగించాలి.

ప్రత్యేకంగా చెప్పాలంటే ప్రతి సమాజం తన గురించిన కొన్ని వాస్తవాలను దాచిపెట్టాలని కోరుకుంటుంది. ఈ సమాజం గురించి సంతృప్తిచెందే వాళ్లు వాటిని నమ్ముతుంటారు. మనం మన మేధో సమయాన్ని, కృషిని ఆ నమ్మకాల గుట్టు విప్పేందుకు ఉపయోగించాలి. సంపద గురించి, పేదరికం గురించి, కమ్యూనిస్టు దేశాలలోనూ, పెట్టుబడిదారీ దేశాలలోనూ ఉన్న నిరంకుశత్వం గురించి, రాజకీయ వేత్తలు, ప్రచార సాధనాలు, చర్చ్, సామాజిక నాయకులు చెప్పే అబద్ధాల గురించి వాస్తవాలు మనం విప్పి చెప్పవలసి ఉంది. తప్పుడు తర్కాలను, అసమంజసమైన ఉదాహరణలను, మోసపూరితమైన నినాదాలను, మనుషులను తోటి మనుషులు హత్య చేసేందుకు పురిగొల్పే జెండా, కమ్యూనిజం, పెట్టుబడిదారీ విధానం, స్వేచ్ఛ వంటి మత్తెక్కించే చిహ్నాలను మనం బహిర్గతం చేయవలసి ఉంది. సాధారణీకరణల కింద దాగిన వాస్తవాలను తవ్వితీసి, రాజకీయ వాగాడంబరం వెనుక దాగిన ప్రత్యేక వాస్తవికతల గురించి మన తోటి పౌరులు తమంతట తాము నిర్ణయాలు తీసుకునేలా మనం ప్రోత్సహించవలసి ఉంది. వక్ర భాష్యాలను, ద్వంద్వ ప్రమాణాలను మనం బహిర్గతం చేయవలసి ఉంది. ఒక్క మాటలో చెప్పాలంటే మనం సంస్కృతీ విమర్శకులం కావలసి ఉంది. ఆ సంస్కృతి సమర్థకులు గానూ, నిర్వాహకులు గానూ మనం ఉండకూడదు.

ఈ కర్తవ్యాన్ని నిర్వహించే శక్తి ప్రత్యేకంగా విశ్వవిద్యాలయానికే ఉంది. విశ్వవిద్యాలయం మీద వ్యాపారులూ, సైన్యం, రాజకీయవాదులూ ఒత్తిడి తెచ్చే మాట నిజమే. కాని దానికి కొంత అవకాశం కూడా ఉంది. దానికి ఒక సత్యభాషణా సంప్రదాయం ఉంది. అందువల్ల అది మార్పుకు వ్యాఖ్యాత కాగలిగిన శక్తి ఉంది.

ఆ పని చేయాలంటే సమాజం మరిచిపోయిన ఆదర్శాలను, కోల్పోయిన స్వప్నాలను, అసంపూర్ణ లక్ష్యాలను సమాజానికి చూపెట్టవలసి ఉంది. ఇవాళ్టి నిరాశమయ లోకంలో ఇది అత్యవసరం. విశ్వవిద్యాలయాల బయట మార్పు కోసం ప్రయత్నిస్తున్న వారి మీద నిరాశ కల్పిస్తున్న ఆటంకాలు ఉన్నాయి. కాసింత చారిత్రక అవగాహన, ఇతర కాలాలలో, ఇతర స్థలాలలో సాగిన సామాజిక ఉద్యమాల అనుభవాల గురించి పునరుక్తి మొత్తంగా మనలో ఆశను నెలకొల్పక పోవచ్చు. కాని, మనముందర ఉన్న అవకాశాలు ఏమిటో సూచించగలుగుతుంది. అటువంటి ప్రేరణాత్మకమైన ఆదర్శాలతో పాటు, ముఖ్యమైన ప్రయోజనాలు సాధించగల ప్రత్యేక పథకాలను కూడా మనం సూచించవలసి ఉంది. కార్యకర్తల బృందాల ముందర మనం వాటిని ప్రతిపాదించవలసి ఉంది. అర్థశాస్త్రవేత్తలు ఫెడరల్ రిజర్వ్ బోర్డుకు వడ్డీ రేట్ల గురించి సలహాలిచ్చే బదులు, ఉచిత భోజనం ఎలా ఇవ్వవచ్చునో ప్రణాళిక తయారు చేయవచ్చు. రాజనీతి శాస్త్రవేత్తలు ప్రభుత్వ బలగాలకు తిరుగుబాటును అణచివేసే రణనీతిని నేర్పే బదులు, పేద ప్రజానీకానికి తిరుగుబాటు పాఠాలు చెప్పవచ్చు. చరిత్రకారులు మనను వినోదపరిచే బదులు, విసుగెత్తించే బదులు, మోసం చేసే బదులు గత కాలపు అనుభవాల నుంచి గుణపాఠాలు చెప్పవచ్చు. ప్రేరణను ఇవ్వవచ్చు. విజ్ఞాన శాస్త్రవేత్తలు ప్రజల ముందుకు వచ్చి బహిరంగంగా మన వాహనాలను సురక్షితం చేయడం ఎలా, మన నగరాలను సుందరం చేయడం ఎలా, మన గాలిని పరిశుభ్రం చేయడం ఎలా అని పథకాలు సూచించవచ్చు. సామాజిక శాస్త్రవేత్తలందరూ కేవలం ప్రపంచం ఎలా ఉన్నదో వర్ణిస్తూ కూర్చునే బదులు ఈ ప్రపంచాన్ని మార్చే పద్ధతులు ఏమిటో చెప్పవచ్చు. అప్పుడు అతి తక్కువ గందరగోళంతో మనం అవసరమైన విప్లవ పరివర్తనలను సాధించగలుగుతాం.

విశ్వవిద్యాలయంలో విప్లవం ఎలా ఉంటుందో నాకు కచ్చితంగా తెలియదు. ఆమాటకొస్తే సమాజంలో విప్లవం ఎలా ఉంటుందో కూడా నాకు తెలియదు. అది ఒక మహత్తర ఉత్పాతం లాంటి రూపంలో రాదేమోనని నా అనుమానం. బహుశా అది ఒక క్రమంలో వస్తుంది. దానిలో తలకిందులయిపోయే పరిస్థితులూ ఉంటాయి. ప్రశాంతతా ఉంటుంది. దానిలో ఇక్కడా అక్కడా ఒకరమూ, ఇద్దరమూ, పదిమందిమి పాత వ్యవస్థల లోపలే ప్రభావ కేంద్రాలు ఏర్పాటు చేస్తాం. వాటిని లోలోపల నుంచే మారుస్తూ ఉంటాం. ఆ పని ఏదో ఒక మంచి ముహూర్తం చూసుకుని మొదలుపెట్టనక్కరలేదు. ఇప్పటికిప్పుడు మొదలు పెట్టవచ్చు. మనమెక్కడ నిలబడి ఉన్నామో ఆ ప్రాంతాన్ని విముక్తి చేయవచ్చు. కొత్త ప్రపంచం కొరకు మన ఓటు వేయవచ్చు. మనమెప్పుడు పని చేయాలో అతి జాగ్రత్తగా ఇతరులు నిర్ణయించిన సమయంలో కాక, ఇప్పటికిప్పుడే మనం మొత్తంగా ఆ పని చేయవచ్చు.

అంటే, మనం మనుషులుగా ఏ ఆదర్శాలతో లోలోపలి నుంచి కదిలిపోయామో వాటి కోసం పనిచేస్తామన్నమాట. అది చేయాలంటే మనను సంప్రదాయపు గాడికి కట్టేసిన, మన చుట్టూ ఉన్న క్రౌర్యాన్ని చూడకుండా కళ్లకు గంతలు కట్టిన మేధావిత్వపు మిథ్యా లోకాన్ని మనం ఎదిరించవలసి ఉంది. మనమింత కాలమూ ఏ మహాకవులనూ, తత్వవేత్తలనూ ఉటంకిస్తున్నామో, ఎవరి మాటలను మనం ఆచరణలో పెట్టడానికి సందేహిస్తున్నామో ఆ మాటలను మొట్టమొదటి సారి అనుసరిస్తున్నామన్నమాట. మనమీ పని చేయడం సంపన్నుల, శక్తిమంతుల ప్రయోజనాల కొరకు కాదు, మన పదవుల కోసం, ప్రతిఫలాల కోసం కాదు. ఆ కవిత్వాన్నీ, ఆ తత్వశాస్త్రాన్నీ చదవడానికి ఇంతవరకూ అవకాశం దొరకని వాళ్ల కోసం. ఎవరయితే ఇంతకాలం చలికాలం వెచ్చగా ఉండడానికీ, యుద్ధాలలో పాల్గొని సజీవంగా ఉండడానికీ నానా కడగండ్లకు లోనయ్యారో వారికోసం మనం ఈ పని చేయవలసి ఉంది. వీ

**ప్రకృతిలో పరిణామాల వెనుక అదృశ్య శక్తి ఉందనుకోవడం, జ్ఞానమూ, విజ్ఞానమూ లోపించిన ప్రతిచోటునూ మత విశ్వాసాలు ఆక్రమించడం ఇంకా కొనసాగుతున్నాయంటున్నారు డా. కొడవటిగంటి రోహిణీప్రసాద్**

# అతీంద్రియ శక్తులూ, ఆటవిక మనస్తత్వం

అతీంద్రియశక్తుల గురించిన భావనల్లో ప్రతివారికీ భౌతిక శరీరంతోబాటుగా, దానికి భిన్నమైన ఒక ఆత్మవంటిది ఉంటుందన్న నమ్మకం ప్రధానమైనది. శరీరం భౌతికంగా నశించిపోయిన తరవాతకూడా ఆత్మకు అస్తిత్వం ఉంటుందని చాలామంది నమ్ముతారు. మానవచరిత్రను పరిశీలిస్తే ఇటువంటి నమ్మకాలు ఆటవిక దశలోనే రూపొందినట్టు తెలుస్తుంది. నిద్రలో కలలు కంటున్నప్పుడు ఆత్మ శరీరం నుంచి వేరయి, లోకమంతా కలయదిరుగుతున్నట్టు అనిపిస్తుంది. చావుకూ, నిద్రకూ పోలికలున్నట్టు ఆదిమానవులు భావించారంటే విడ్డూరం లేదు. 'దీర్ఘనిద్ర' తరవాత కూడా ఆత్మ స్వేచ్ఛగా తిరుగుతూనే ఉండాలి. దానికి చావు ఉండదు.

నిరూపణ అవసరంలేని ఇలాంటి 'నిరపాయకరమైన' నమ్మకాలు ఎవరినీ బాధించవు సరికదా, కొంత ఊరటనుకూడా ఇస్తాయి. అభ్యంతరమేదీ లేకపోవడంతో ఆనాటి ప్రజలు తమ శరీరాల్లో నశించలేనిదేదో ఉందనీ, అది భౌతికశరీరంతో సంబంధంలేని పదార్థమనీ నమ్మసాగారు. ఈ ఆత్మ అనేది శరీరాన్ని శాసించి, నియంత్రించగలదు. నిద్రలోనూ, మెలకువగా ఉన్నప్పుడూకూడా అద్భుతాలు సాధించగలదు. మన తెలివితేటలకూ, జ్ఞానానికీ అదే కారణం. అందుచేతనే కాటికి కాళ్లు చాచుకున్న వృద్ధులుకూడా వివేకంతో మాట్లాడతారు. మరికొద్ది రోజుల్లోనే వారు చనిపోతారన్నమాటే గాని, మరి వారి అనుభవమూ, జ్ఞానసంపదా 'ఎక్కడికి పోతాయి'? ఎక్కడికీ పోవు. వారి తరవాత కూడా ఆత్మరూపంలో కొనసాగుతాయి. వడిలి, జబ్బులతోనూ, వయస్సుతోనూ కృశించి, శిథిలమైపోయిన వారి శరీరాలు మిగలవుకాని ఆత్మ సంగతి వేరు. దానికి వయస్సుతోనూ, చావు తోనూ నిమిత్తంలేదు.

మనుషులు ఒక చోటు నుంచి మరొక చోటికి వలసపోవడం ఆదిమానవులకు తెలుసు కనక ఎన్నో ఏళ్లుగా 'అలవాటుపడ్డ' శరీరాన్ని వదిలి వెళ్లవలసిన అవసరం ఆత్మకుకూడా ఏదో ఒకనాడు కలుగుతుందనేది వారికి సహజంగానే అనిపించి ఉంటుంది. అదొక మహాప్రస్థానం. బాల్యం, యవ్వనం, వార్ధక్యం వగైరాలలాగే జీవితంలో అది మరొకదశ. ఎటొచ్చీ అది 'ఇహలోకానికి' సంబంధించినది కాదు. ముసలితనంలో పోనుపోను ఆప్యాయతలూ, అనురాగాలూ తగ్గుతాయి. జీవితంలో రకరకాల అనుభవాలు పొందినవారికి ఇలా తమవారికి దూరమవడం తెలిసిన విషయమే. ఈనాటికీ మత బోధకులూ, ప్రవచనాలు చేసేవారూ ఇదేరకం ఇమేజరీ ఉపయోగించి ఆధ్యాత్మిక భావాలను ప్రచారం చేస్తారు. వారికి మరణానంతర అనుభవమేదీ లేకపోయినా 'అన్ని బంధనాలూ తెంచుకున్న' ఆత్మను గురించి నమ్మబలుకుతూ వారు నెలల తరబడి ఉపన్యాసాలిస్తారు. వినేవాడెవడూ 'నీకిదంతా ఎలా తెలుసు నాయనా' అని అడిగిన పాపానపోడు.

నిద్ర అనేది ఏమిటో, నిద్రలోనూ, మెలకువగా ఉన్నప్పుడూ మన మెదడు ఎలా పనిచేస్తుందో, ఆలోచనలకూ, ఊహలకూ, భావాలకూ, కలలకూ ఎటువంటి సంబంధం ఉంటుందో ఈనాటికీ చాలా మందికి తెలియదు కనక ఇవన్నీ కలగలిసిపోయి ఆత్మ, ప్రేతాత్మ వగైరాల గురించిన అమాయకమైన అపోహలు అందరిలోనూ కనబడతాయి. బాహ్య ప్రపంచంతో ఏమాత్రమూ సంబంధం లేనట్టు అనిపించే కలల ప్రపంచం మనలో 'మరేదో' లోకంలో భ్రమిస్తున్న భావనను కలిగిస్తుంది. మన దేవుళ్లందరూ సామాన్యంగా మనకు కలల్లోనే 'సాక్షాత్కరిస్తూ' ఉంటారు. పరలోకాన్ని దాదాపు కళ్లారా చూస్తున్నట్టే మనకనిపిస్తుంది. ఇది శ్రుతిమించి రాగాన పడ్డప్పుడు నిజంగా కనబడుతున్నదంతా మాయ అనీ, కలల ప్రపంచమే నిజమైనదనీ ప్రతిపాదనలు మొదలవుతాయి.

ఆదిమయుగంలో మనుషులు ఇంతగా అనుకోలేదు కాని ప్రేతాలనూ, భూతాలనూ నమ్మారు. వీటికి ఉనికి అంటూ ఉండదు. విచ్చలవిడిగా సంచరిస్తూ బతికున్నవారిని ఇబ్బందిపెడతాయి. వీటికి 'శాంతులు' చేయించటానికి పెద్ద తతంగం అవసరమయింది. తరవాతి కాలంలో మతాలకు దారితీసిన పూజలకూ, తంతులకూ అదే మూలకారణం. ఈ ప్రేతాత్మలను 'ప్రార్థిస్తే' కొంత ఉపయోగం ఉంటుందని భావించేవారు. గణాచారులూ, పూజారులూ, కులపెద్దలూ నాయకత్వం వహించి ఆటవికులకు 'దారి' చూపిన ఆ కాలంలో మతమన్నా, గారడీ అన్నా, చేతబడి అన్నా, సైన్స్ అన్నా అంతా ఒక్కటిగానే ఉండేది. ఇందులో వ్యక్తిపరమైన స్వార్థంకన్నా తమ తెగకు మొత్తంగా మంచి జరగాలనే కోరికే ఎక్కువగా ఉండేది.

తమ పరిసరాలమీదా, వాతావరణంమీదా ఆధారపడి, వాటి 'అనుగ్రహానికి' లోబడి జీవిస్తున్న ఆనాటి ప్రజలకు వానలూ, వరదలూ, వాటంతటవే తగలబడే అడవులూ ఒక్కొక్కప్పుడు ప్రాణాంతకంగా ఉండేవి. అందుచేత 'మేజిక్'వంటి తాంత్రిక శక్తులద్వారా 'గారడీ' చేసి, ప్రకృతితో సంబంధం నెరిపి, దాన్ని లోబరుచుకునేందుకు ఆదిమానవ సముదాయాలు ప్రయత్నించాయి. ఈ తంతులన్నీ రోజువారీ జీవితాలకి



పనికొస్తాయనే వారు భావించారు. ఇందులో అప్పటికి 'ఆధ్యాత్మికత' ఏమీ ఉండేదికాదు. చేసిన కర్మకాండకు ఫలితం ఉంటుందని నమ్మి అందరూ పాల్గొనేవారు. సామూహికంగా అందరూ 'గట్టిగా' కలిసి కోరుకుంటే ఏదైనా జరుగుతుందని నమ్మేవారు. వానలు పడక క్షామం వచ్చినప్పుడు అమెరికాలోని ఆటవికులు 'వానాట' ఆడేవారు. తామంతా కుండపోతగా కురుస్తున్న వర్షంలో తడిసి ముద్దవుతున్నట్టు తలమీద కప్పుకుని పరిగెత్తి ప్రకృతిని 'ఫూల్' చేసేవారు. అంత మంది నమ్మకంగా వానొచ్చినట్టు పరిగెత్తుతూ ఉంటే నిజంగానే వర్షం పడకపోతుందా అని వారి ఉద్దేశమేమో. అలాగే తమకు తెలిసిన జంతువుల రూపాల్లోనూ, మనుషుల రూపాల్లోనూ బొమ్మలు చేసి వాటికి పూజలు చేసేవారు. తమకు కావలసినవి జరిగేదాకా వాటిని ప్రార్థించి, అవసరమైతే తిట్టి, కొట్టి, బతిమాలి ఎలాగో అలా అవస్థలుపడుతూ ఉండేవారు.

గుహల్లో నివసిస్తూ ఏ అడవిదున్ననో వేటాడి పొట్టపోసుకునే దశలో అడవి దున్న దొరకక పోవడం వారికీ, వారి తెగకూ చావుబతుకుల సమస్యగా పరిణమించేది. అలాంటి పరిస్థితుల్లో అడవి దున్న తమపై 'కరుణించి' తమకు ఆహారం అయిందన్న కృతజ్ఞతాభావంతో వారు దున్నకు పూజలు చేసేవారు. చచ్చిన దున్న తోలు కప్పుకుని ఒకడు నృత్యం చేస్తే తక్కినవారు మళ్లీ దాన్ని వేటాడినట్టు అభినయించేవారు. తామూ, తమ పశుసంపదా కలకాలం పచ్చగా ఉండాలని కోరుకునే సామాన్యమైన కోరికలు రుగ్వేదం ప్రారంభంలో ఉన్నాయట.

ఇలా అడుగడుగునా కష్టాలుపడి బతికేరోజుల్లో వారి కళ్లకి ప్రకృతిశక్తుల వెనక ఏదో 'అదృశ్య హస్తం' కనబడేది. ప్రతి చెట్టులోనూ, సెలయేరులోనూ ఏవేవో శక్తులూ, భూతాలూ ఉండి తమ జీవితాలకు మంచినీ, చెడునీ చేస్తున్నాయని వారు భావించారు. వాటిని తమకు అనుకూలం చేసుకోవడానికి ఎంతో శ్రమపడి మంత్రతంత్రాల వ్యవస్థను ఏర్పాటు చేసుకున్నారు. ఇదంతా చేసినప్పటికీ ప్రకృతిశక్తులు అనుకూలించనప్పుడూ, అవి తమకు అర్థంకాక, తమ చెప్పుచేతలలో లేనట్టుగా అనిపించినప్పుడూ మతపరమైన వివరణలు ఇవ్వ ప్రయత్నించేవారు. దేవతలకు మనుషుల మీద 'కోపం' వచ్చిందని చెప్పేవారు. ఇదేమీ ఆధునికయుగంలో హాస్యాస్పదంగా అనుకోనక్కర్లేదు. ప్రకృతిని 'ఏదో పవరు' నడిపిస్తుందనీ, 'అహంభావాన్ని' విడనాడి 'ఆ సర్వేశ్వరుడికి' తలవంచాలనీ చెప్పే ఆధునిక ప్రవక్తలు ఏ ఉద్దేశంతో చెప్పినప్పటికీ ఆదిమయుగందాటి ముందుకు వచ్చినట్టుగా అనిపించరు. మనకి తెలియని విషయాలకు 'అదృశ్యహస్తమే' కారణమని అనుకోవడంలో వీరంతా ఆటవికులే. జ్ఞానమూ, విజ్ఞానమూ లోపించిన ప్రతి చోటునూ మతవిశ్వాసాలు ఆక్రమించడానికి ప్రయత్నిస్తూనే ఉంటాయి.

ఇదంతా నమ్మకాలున్నవారిని వెక్కిరించడానికో, కించపరచడానికో రాసిన విషయంకాదు. మానవజాతి శైశవదశలో ఉన్నప్పుడు వారి బుద్ధీ, ఆలోచనలూకూడా శైశవదశలోనే ఉండేవని కొందరు శాస్త్రవేత్తల ఉద్దేశం. కాలికి బల్ల తగిలి బాధ కలిగితే చిన్నపిల్లలు బల్ల సజీవమైనదయినట్టూ, తమను బుద్ధిపూర్వకంగా బాధించినట్టూ ఊహించుకుంటారు. పెద్దవాళ్లుకూడా అందుకు అనుకూలంగా బల్లను తిరిగి కొట్టి దానికి 'బుద్ధి' చెప్పినప్పుడే పిల్లలకు ఉపశమనం కలుగుతుంది. అడవుల్లో రేగిన కార్చిచ్చులూ, కష్టాలపాలు చేసే తుపానులూ అన్నీ ఎవరో తమను బాధించడానికే చేస్తున్న పనులనీ, తమకు ఆహారం అయిన దున్న తమను 'కరుణించిందనీ' భావించిన ఆదిమానవుల భావనలే మతాలకు పునాదులు అయాయి. ఈ రోజుల్లో చాలా ఉదాత్త స్థాయిలో మతబోధ చేస్తున్నా మనుకుంటున్నవారి మనస్తత్వం, అవన్నీ నిజమనుకునేవారి వైఖరీ ఆనాటి ఆదిమ లక్షణాలని అధిగమించనేలేదు. అసమానతలు పెచ్చుపెరిగిన సమాజ పరిస్థితుల వల్లనూ, తమ మెదళ్లలో శారీరకంగా తలెత్తే గందరగోళంవల్లనూ అయోమయానికి గురయ్యే కోట్లాది సామాన్యులను ప్రపంచ వ్యాప్తంగా తప్పుదారులు పట్టించే మతాలన్నీ ఇటువంటివే. వీ

## బిరుదురాజు రామరాజు

ప్రఖ్యాత జానపద సాహిత్య పరిశోధకులు, తెలుగు జానపద పరిశోధనకు ఆద్యులు, స్వాతంత్ర్య సమరయోధులు ఆచార్య డా. బిరుదురాజు రామరాజు (84) ఫిబ్రవరి 8న ఒక ప్రైవేట్ ఆసుపత్రిలో చికిత్స పొందుతూ మరణించారు. ఆచార్య బిరుదురాజు రామరాజు 16 అక్టోబర్ 1925న (పదవ తరగతి సర్టిఫికెట్ ఆధారంగా పుట్టిన తేదీ 9 డిసెంబర్, 1923) వరంగల్ తాలూకా దేవునూరులో పుట్టారు. మడికొండ గ్రామంలో పెద్దతండ్రి బిరుదురాజు రాఘవరాజు, లలితమ్మలు వీరిని పెంచి పెద్ద చేశారు. ప్రాథమిక విద్య మడికొండలోనే కొనసాగింది. 1944లో హనుమకొండలో ఎచ్.ఎస్.సి., వరంగల్‌లో ఇంటర్మీడియట్ పూర్తిచేశారు. హైదరాబాద్‌లోని నిజాం కళాశాలలో అర్థికశాస్త్రం, రాజనీతి శాస్త్రం, తెలుగు విషయాలుగా 1949లో బి.ఎ. పూర్తి చేశారు. ఉస్మానియా యూనివర్సిటీలో ఎం.ఎ. తెలుగు పట్టా పొంది, ఆచార్య ఖండవల్లి లక్ష్మీరంజనం పర్యవేక్షణలో తెలుగు జానపద గేయాల మీద పరిశోధన చేశారు. 1956లో పి.ఎచ్‌డి. పరిశోధన పట్టా పొంది, 1960లో ఎం.ఎ. సంస్కృతం, 1966లో భాషా శాస్త్రంలో పి.జి. డిప్లొమా చేశారు. తెలుగు, ఇంగ్లిష్, హిందీ, సంస్కృతం, ఉర్దూ భాషలలో ప్రావీణ్యం సంపాదించారు.



వారి రచనలలో పి.ఎచ్‌డి. సిద్ధాంత గ్రంథం 'తెలుగు జానపద గేయ సాహిత్యం' విలువైనది. జానపద గేయాలకు సంబంధించిన సమగ్ర సమాచారం అందులో నిక్షిప్తం చేశారు. ఆ రంగంలో కృషి చేసేవారికి, ఆసక్తిగల వారికి అది దారిదీపం లాంటిది.

1951లో పార్ట్‌టైం తెలుగు అధ్యాపకునిగా జీవితాన్ని ప్రారంభించి, పూర్తి కాలం అధ్యాపకునిగా 1952లో స్థిరపడ్డారు. 1968 నుంచి 83 వరకు వరంగల్ కాకతీయ యూనివర్సిటీలో ప్రొఫెసర్‌గా పనిచేశారు. ఆ తర్వాత ఉస్మానియా యూనివర్సిటీ తెలుగుశాఖాధిపతిగా ఉన్నారు. 1983లో ఆయన పదవీ విరమణ చేశారు. సుమారు 40 మంది విద్యార్థులు వారి పర్యవేక్షణలో పరిశోధన పట్టాలు పొందారు.

ఆయన రచనలు ముప్పైకి పైగా పుస్తకాలుగా వచ్చాయి. చిన్నతనంలోనే సురవరం ప్రతాపరెడ్డి శిష్యరికం వీరిలోని శక్తిని జాగృతం చేసింది. సురవరం ప్రతాపరెడ్డికి తాళపత్ర గ్రంథ సేకరణ చాలా ప్రియమైన విషయం. వారికి కుడి భుజంలా పనిచేసిన రామరాజు 'చరిత్రకెక్కని చరితార్థుల' రచనకు బీజం అక్కడే పడింది. 1952 ఎన్నికల సందర్భంగా కాంగ్రెస్ పార్టీ వరంగల్ జిల్లా నుంచి శాసనసభ్యునిగా ఎన్నికలలో పోటీ చేసే అవకాశం కల్పించగా సురవరం ప్రతాపరెడ్డి ఆయనను నివారించి 'నీలాంటి వారు పరిశోధన రంగంలో ఉండి రాబోయే తరాలను ప్రభావితం చేయాలే గాని, రాజకీయాలలో జీవితాన్ని వ్యర్థం చేసుకోవద్ద'ని ఇచ్చిన సలహాను రామరాజు మరణించేంత వరకు అనుసరించారు.

తెలంగాణలో పల్లెపల్లె తిరిగి వీరు స్వయంగా సేకరించిన వేల జానపద గేయాలు, కళారూపాలు, తాళపత్ర గ్రంథాలు ఇంకా పరిశోధనకు నోచుకోలేదు. వీరు సేకరించిన అనేక అముద్రిత తాళపత్ర గ్రంథాలను ఉస్మానియా విశ్వవిద్యాలయ సంస్కృత, తెలుగు పరిశోధక శాఖలకు, కొన్ని గ్రంథాలను ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వ ఓరియంటల్ మాన్యుస్క్రిప్ట్ లైబ్రరీకి, కడపలోని సి.పి. బ్రౌన్ లైబ్రరీకి అందజేశారు.

తెలుగుదేశంలోని అనేక మంది యోగుల గురించి, వారి జీవిత విశేషాల గురించి మరణించేంత వరకు పరిశ్రమిస్తూ ఆరు సంపుటాలుగా 'ఆంధ్ర యోగులు' అనే గ్రంథాన్ని ప్రచురించారు.

రామరాజు మరణం తెలుగు ప్రజలకు, తెలంగాణ పరిశోధకులకు, జానపద వాగ్గేయకారులకు తీరని లోటు. వీ

# వీక్షణం రచయితల సమావేశం

వీక్షణం రచయితల నాల్గవ సమావేశం ఫిబ్రవరి 7న ఇండియన్ మెడికల్ అసోసియేషన్ (ఐ.ఎం.ఎ.) హాల్, కోఠి, హైదరాబాద్‌లో జరిగింది. ఈ సమావేశానికి వీక్షణం గౌరవ సంపాదకులు వి. హనుమంతరావు, వకుళాభరణం రామకృష్ణ, కె. ఆర్. చౌదరి, కాకరాల, అరిబండి ప్రసాదరావు, రావెల సోమయ్య, టి.వివేక్, కె. విజయ్‌కుమార్, శ్రీధర్ దేశ్‌పాండే, కె. సురేష్, విద్యాభూషణ్, పి.వి. రమణ, సి.ఎస్.ఆర్. ప్రసాద్, ఎ. రంగారెడ్డి, ఎస్. నీలాదేవి, సి.ఎచ్. శ్రీమన్నారాయణ, పులుగుజ్జు సురేష్, ఎ. నర్సింహారెడ్డి, ఎస్. సరళ, దుప్పల రవికుమార్, ఎం. రాఘవాచారి, కె.వి. కూర్మనాథ్, బి. రామకృష్ణ హాజరయ్యారు. ఇంకా అసహజ మరణాల సూచి సేకరణకర్తలు వి.శంకరయ్య, డి. విజయభాస్కర్, ఎల్. సంతోష, ఎ. కుమార్ ఈ సమావేశానికి హాజరయ్యారు. పాఠక మిత్రులు ఆర్. సుబ్బారావు, ఎం. ఆదిత్య, కె. తిరుపతి, జి. అమర్‌నాథ్, మోతుకూరు శ్రీనివాస్, ఎం. జయలక్ష్మి, మోతె గంగారెడ్డి, టి. రమేష్, ఎ. గవర్‌రాజు, వై. నర్సింలు, వై. వేణుగోపాల్‌రెడ్డి, కె. విజయ్‌కుమార్, పి. పావని, ఏలేశ్వరం వెంకటేశ్, డి. అజయ్ ఈ సమావేశంలో పాల్గొన్నారు.

వీక్షణం సర్క్యులేషన్ మేనేజర్ వై. రామచంద్రం రచయితలకు స్వాగతం చెప్పారు. సమావేశానికి వకుళాభరణం రామకృష్ణ అధ్యక్షత వహించారు. ఈ సందర్భంగా ఆయన మాట్లాడుతూ గత సమావేశంలో అనుకున్న లక్ష్యాలలో కొన్నిటిని నెరవేర్చామని, ఇంకా చేయాల్సిన పనులు, సాధించాల్సిన లక్ష్యాలు చాలానే ఉన్నాయని అన్నారు. ఈ సమావేశం కూడ అర్థవంతమైన చర్చతో, ఆచరణయోగ్యమైన సూచనలతో జరుగుతుందని ఆశను వ్యక్తం చేశారు.

వీక్షణం వ్యవస్థాపక, గౌరవ సంపాదకులు వి. హనుమంతరావు తన సందేశంలో, పత్రిక ప్రారంభించినప్పుడు సర్క్యులేషన్ ఎనిమిది వందలతో మొదలయి అది ఇప్పుడు ఆరు ఏడు వేలకు పెరగడం ఒక విజయమే అని అన్నారు. పత్రిక తన కాళ్లమీద తాను నిలబడి ఇంత కాలం రావడం సంతోషించదగ్గ విషయమని అన్నారు. సర్క్యులేషన్ పెరిగినా, ఇంకా ఏయే జిల్లాలలో పెంచే అవసరం ఉందో దానిపై దృష్టి సారించాలనీ, పత్రికకు ఇప్పుడు వస్తున్నది ఒకే ఒక ప్రకటన, అది కూడా సక్రమంగా రావడం లేదని అన్నారు. పత్రిక క్రమం తప్పకుండా రావడానికీ, దాని ఆర్థిక అవసరాలకూ మరిన్ని ప్రకటనలు సేకరించాల్సిన అవసరం ఉందన్నారు. విదేశీ వ్యవహారాలపై వ్యాసాలు రావడం లేదనీ, దీన్ని అధిగమించాలని అన్నారు. గత రెండు సంచికల్లో తెలంగాణ సమస్యలపై మాత్రమే వ్యాసాలు వచ్చాయి. ఆంధ్ర ప్రాంతంలో కూడా ఉద్యమాలు జరుగుతున్నాయని, అక్కడి వాళ్ల అభిప్రాయాలు కూడా పత్రికలో ప్రచురించాలని అన్నారు. అన్ని ప్రాంతాల అభిప్రాయాలకు వీక్షణం వేదికగా ఉండాలని అభిప్రాయ పడ్డారు.

సి.డి.ఆర్.సి. తాత్కాలిక అధ్యక్షులు ప్రొ. కె.ఆర్. చౌదరి మాట్లాడుతూ వివిధ కమిటీల నివేదికల అనువాదాలు, వాటిపై వ్యాసాలు రావాలన్నారు.

వివిధ రచయితలు, పాఠక మిత్రులు వ్యక్తం చేసిన అభిప్రాయాలు, సూచనలు :

- వీక్షణం కోసం పంపిన వ్యాసాలు అందినట్లు సమాచారం ఇస్తే బాగుంటుంది.
- లాటిన్ అమెరికా దేశాలలోని పరిణామాలపై వ్యాసాలు రావాలి.
- చిన్న రాష్ట్రాల మీద వస్తుగతంగా వ్యాసాలు రావాలి.
- చరిత్ర విశ్లేషణ, ప్రముఖుల ఇంటర్వ్యూలు, పరిశోధించి రాసిన వ్యాసాలు రావాలి.
- వీక్షణం పరిచయ సభలు జిల్లాలలో, యూనివర్సిటీలలో నిర్వహించాలి.
- వివిధ ప్రాజెక్టుల వల్ల నిర్వాసితులయిన వారి స్థితిగతులను తెలియజేస్తూ వ్యాసాలు రావాలి.
- ప్రభుత్వ నివేదికలు పరిచయం చేయాలి.
- పుస్తక సమీక్షలు రావాలి.
- ప్రతి ఒక్కరూ తప్పక చదవాల్సిన మంచి పుస్తకాలను పరిచయం చేయాలి.
- ఎప్పటికప్పుడు వ్యాస ప్రమాణాలపై చర్చ జరగాలి.
- కొత్త రచయితలకు తర్ఫీదునిచ్చే శిక్షణా కార్యక్రమాలు చేపట్టాలి.
- పాఠకులతో సమావేశాలు నిర్వహించాలి.
- సమాచారం కంటే విశ్లేషణ ఎక్కువ ఉండాలి.
- రచయితల ఫోన్ నంబర్లు, ఈమెయిల్ అడ్రస్‌లు ఇస్తే వారితో నేరుగా సంభాషించడానికి వీలుంటుంది.
- కొత్త రచయితలను, పాఠకులను తయారు చేసుకోవాలి, పెంచుకోవాలి.
- వివిధ అంశాలపై అధ్యయన తరగతులు నిర్వహించాలి.
- హిస్టరీ కాంగ్రెస్, యూనివర్సిటీలలో జరిగే అకడమిక్ సమావేశాలలో వీక్షణంను పరిచయం చేయాలి.
- వీక్షణంలో అచ్చవుతున్న గణాంకాలకు ఆధారం తెలియజేయాలి.
- సామాజిక అంశాలపై వ్యాసాలు ఇంకా పెరగాలి.
- సామాజిక మార్పులపై వ్యాసాలు రావాలి.
- వీక్షణంలో ఫోకస్ అంశాలను ముందుగానే ప్రకటిస్తే ఆసక్తి ఉన్న అంశాలపై ఎక్కువ మంది రాయగలుగుతారు.
- చరిత్ర, చట్టాలు, న్యాయవ్యవస్థలపై వ్యాసాలు మరిన్ని రావాలి.
- పారిశ్రామికవేత్తలతో పరిచయ సభలు జరపాలి.
- రచయితలకు ఎంతో కొంత పారితోషికం ఇవ్వడం ప్రోత్సాహకరంగా ఉంటుంది.
- ప్రపంచీకరణ-మతం కోణంలో వ్యాసాలు రావాలి.
- ఇతర రాష్ట్రాలలో తెలుగువారికి వీక్షణంను చేరవేసే ప్రయత్నం జరగాలి.
- పేజీలు పెంచి మరిన్ని వ్యాసాలు పాఠకులకు అందించాలి.
- వ్యాసాలలోని అంశాలు మనిషి కేంద్రంగా ఉండాలి.
- ఆదివాసీ, దళిత సమస్యలపై చర్చాగోష్ఠులు నిర్వహించాలి.

- ట్రేడ్ యూనియన్‌ల పోరాటాలు, వారి సమస్యలపై వ్యాసాలు రావాలి.
- మంచి సినిమాల మీద విశ్లేషణాత్మక వ్యాసాలు రావాలి.
- వీక్షణం ఆర్థికంగా నిలదొక్కుకోవాలంటే ప్రకటనలపై దృష్టి సారించాలి.
- అక్షరాల (ఫాంట్) సైజ్ తగ్గించి, వ్యాసాల సంఖ్య పెంచాలి.
- ప్రతి పాఠకుడు మరొకరికి వీక్షణం పరిచయం చేయాలి.
- ఫోకస్ ప్రస్తుత సమస్యలపై అంటే, ధరలు, ఉన్నత విద్య వంటి అంశాలపై కేంద్రీకరించాలి.
- ఎడిటింగ్‌పై మరింత శ్రద్ధ వహించాలి.
- వ్యాసాలు మరింత అర్థమయ్యేందుకు భాష సులభతరంగా ఉండాలి.
- అనువాదాలు మరింత సరళంగా ఉండాలి.
- ప్రపంచీకరణ పాజిటివ్ అంశాలపై కూడా వ్యాసాలు రావాలి.
- క్షేత్రస్థాయి పరిశోధనలకు అవకాశం ఇవ్వాలి.
- సామాజిక అంశాలపై వీక్షణం తరపున సమావేశాలు నిర్వహించాలి.
- విభిన్న అభిప్రాయాలకు వీక్షణం వేదికగా ఉండాలి.
- ప్రకటనలు సంపాదించడానికి గట్టి ప్రయత్నం, సంకల్పం కావాలి.
- అసహజ మరణాల సూచి కేవలం అంకెలుగానే కాకుండా, వాటిపై విశ్లేషణలు కూడా రావాలి.
- సివిల్స్, గ్రూప్, ఇతర పోటీ పరీక్షలు రాస్తున్న విద్యార్థులకు కూడా ఉపయోగకరంగా ఉండే శీర్షికలు పెడితే బాగుంటుంది. వారిని చేర్చే ప్రయత్నం చేయాలి.
- యూనిక్ ఐడి కార్డ్స్, మైక్రో ఫైనాన్స్, బ్యాంక్ రుణాలు, ద్రవ్యవిధానాలు ఇలాగా అనేక కొత్త విషయాలపై విశ్లేషణలు రావాలి.
- సామాన్య పాఠకులకు అర్థమయ్యేలా, సూటిగా, సమకాలీనంగా, విమర్శనాత్మకంగా వ్యాసాలు రావాలి. సామాన్య పాఠకులకు వీక్షణం చేరేలా చర్యలు చేపట్టాలి.
- పంచాయతీరాజ్ సంస్థలకు సంబంధించి వ్యాసాలు రావాలి.
- ప్రభుత్వ విధానాలు, విచ్ఛిన్నమవుతున్న ప్రజాజీవనంపై వ్యాసాలు రావాలి.
- ప్రింట్, ఎలక్ట్రానిక్ మీడియాలలో వస్తున్న వ్యాపార ప్రకటనల తీరు తెన్నులపై విశ్లేషణలు రావాలి.
- నీతిమాలిన, గాడితప్పిన, అవినీతిమయమైన రాజకీయాలపై వ్యాసాలు రావాలి.
- ముఖ్యమైన ఘటనల పూర్వాపరాలపై నిపుణుల వ్యాసాలు రావాలి.
- మతోన్మాదంపై వ్యాసాలు రావాలి.
- ఇంటర్నెట్‌లో చూడదగ్గ సైట్‌లను పరిచయం చేస్తూ రెగ్యులర్‌గా ఒక కాలమ్ వేయాలి.
- కొత్తగా రాసేవాళ్లకు వీక్షణం ప్రోత్సాహాన్ని కొనసాగించాలి.
- రాష్ట్రంలోని అన్ని లైబ్రరీలకు వీక్షణం అందేలా చూస్తే చాలా మంది సామాన్య పాఠకులకు పత్రిక అందుతుంది.
- ఆయా జిల్లాలలో చందాదారులతో పాఠకుల సమావేశాలు నిర్వహించాలి.
- సామాజిక దృష్టి, చైతన్యాలలో వస్తున్న మార్పులపై వ్యాసాలు రావాలి.
- పారిశ్రామికవేత్తలు కూడా తమ వంతు సామాజిక బాధ్యతగా పత్రికకు ప్రకటనలు ఇచ్చి సహాయం అందించేలా విజ్ఞప్తి చేయాలి.
- వీక్షణం కార్పస్ ఫండ్‌గా మిత్రులూ, శ్రేయోభిలాషులూ, చేయూత అందించగలిగే వారందరినీ చందాల రూపంలోనో, ప్రకటనల రూపంలోనో సహాయం అందించేలా ప్రోత్సహించాలి.
- వ్యాసాల విశ్లేషణలు సామాన్యులు సరైన అంచనాలకు చేరడానికి తోడ్పడాలి.
- సామాన్యుల అభిప్రాయాల శీర్షిక బాగుంది. ఇది కొనసాగించాలి.
- ఉపాధ్యాయులు, లెక్చరర్లు, లాయర్లు, డాక్టర్లు ఇలా సమాజంలోని వివిధ బాధ్యతాయుత రంగాలలో పనిచేస్తున్న వారి వద్దకు వీక్షణం చేరాలి. వారి సమావేశాలప్పుడు వీక్షణం అందేలా చూడాలి.
- వామపక్ష భావజాలంలో వస్తున్న వివిధ ధోరణులను పట్టుకోవడానికి తోడ్పడే వ్యాసాలు రావాలి.
- పర్యావరణ అంశాలపై వ్యాసాలు రావాలి.
- వివిధ సంఘాలు తమ న్యాయమైన ఆకాంక్షలపై ప్రచురిస్తున్న కరపత్రాలను సేకరించి కరపత్ర సాహిత్యంగా వీక్షణంలో ప్రచురించాలి.
- మన చుట్టూ జరుగుతున్న అనేక ఉద్యమాలపై విశ్లేషణలతో కూడిన వ్యాసాలు రావాలి.
- పరిశోధనా పత్రాలను క్లుప్తంగా వీక్షణంలో పరిచయం చేయాలి.

సమావేశం చర్చపైన, సూచనలపైన వీక్షణం సంపాదకులు ఎన్. వేణుగోపాల్ తన ప్రతిస్పందనను, రచయితలకు కృతజ్ఞతలను తెలిపారు. ప్రతి సంవత్సరం డిసెంబర్ నెలలో వీక్షణం రచయితల సమావేశం తప్పనిసరిగా నిర్వహించుకోవాలని అనుకున్నా, కొన్ని ప్రత్యేకతలు, అవాంతరాల వల్ల ఈ సమావేశం కాస్త ఆలస్యంగా నిర్వహించామని వేణుగోపాల్ తెలిపారు. వచ్చే సమావేశాన్ని డిసెంబర్‌లోనే నిర్వహించుకుందామని రచయితలకు తెలియజేశారు. వీక్షణం సహాయ సంపాదకులు డి.వి. రామకృష్ణారావు సమావేశానికి వచ్చిన వారికి, సహకరించిన వారికి కృతజ్ఞతలు తెలియజేయడంతో సమావేశం ముగిసింది. వీ

## అక్రమ సంపాదనలో ఐఎఎస్‌లు

ఛత్తీస్‌ఘడ్, మధ్యప్రదేశ్ రాష్ట్రాల్లోని ముగ్గురు ఐఎఎస్ అధికారుల ఇళ్లపై ఫిబ్రవరి 5,6 తేదీల్లో ఆదాయపు పన్నుశాఖ నిర్వహించిన తనిఖీల్లో 400 కోట్ల అక్రమ ఆస్తులు వెలుగుచూసాయి. ఛత్తీస్‌ఘడ్ వ్యవసాయశాఖ కార్యదర్శిగా ఉన్న బిఎల్. అగర్వాల్ ఇంటిపై ఆయన కార్యాలయం, సన్నిహిత బంధువుల ఇళ్లపై ఐటి అధికారులు దాడులు నిర్వహించారు. బినామి పేర్లతో తెరిచిన 220 బ్యాంకు ఖాతా పాస్‌పుస్తకాలు ఉన్నాయి. ఈ ఖాతాల్లో 40 కోట్లు ఉన్నట్లు అధికారులు తెలిపారు. మధ్యప్రదేశ్‌కు చెందిన అరవింద్ జోషి, టినూ జోషి నివాసంపై ఐటి అధికారులు నిర్వహించిన సోదాల్లో 3 కోట్ల నగదును స్వాధీనం చేసుకున్నారు.

## రైతు ఆత్మహత్యల అభివృద్ధి!

మన దేశంలో 1997 నుండి 2008 వరకు 1,99,132 మంది రైతులు ఆత్మహత్యలు చేసుకున్నారని జాతీయ నేర నమోదు సంస్థ వెల్లడించింది. ఒక్క వ్యవసాయ రంగంలోనే ప్రభుత్వ లెక్కల ప్రకారమే 2 లక్షల మంది రైతులు ఆత్మహత్యలు చేసుకున్నారు. ఇందులో మహారాష్ట్ర మొదటి స్థానంలో ఉండగా ఆంధ్రప్రదేశ్ రెండవ స్థానంలో నిలిచింది. తర్వాత స్థానాల్లో కర్ణాటక, మధ్యప్రదేశ్, ఛత్తీస్‌గడ్‌లు ఉన్నాయి. వాణిజ్య పంటలు పండించే రైతులే ఎక్కువగా ఆత్మహత్యలకు పాల్పడుతున్నారు.

## మళ్లీ చర్చలు...

మావోయిస్టులు హింసను వీడితే వారితో చర్చలకు ప్రభుత్వం సిద్ధంగా ఉందని కేంద్ర హోం మంత్రి పి. చిదంబరం ఫిబ్రవరి 9న ప్రకటించారు. మావోయిస్టు ప్రభావిత రాష్ట్రాలకు సహాయం చేసేందుకు, నక్సల్స్‌కు వ్యతిరేకంగా వాటిని సమన్వయ పర్చడంలో భాగంగా పశ్చిమబెంగాల్, ఒరిస్సా, బీహార్, జార్ఖండ్ రాష్ట్రాల ఉన్నతాధికారులతో చిదంబరం అధ్యక్షతన కోల్‌కతాలో సమావేశం జరిగింది. చిదంబరం పిలుపుకు మావోయిస్టు పార్టీ కేంద్ర కార్యదర్శి గణపతి స్పందిస్తూ జైళ్లో ఉన్న తమ నాయకులను విడుదల చేస్తే కేంద్రంతో చర్చలకు సిద్ధమని ప్రకటించారు.

## పూణె పేలుళ్లలో 9 మంది మృతి

మహారాష్ట్రలోని పూణెలో విదేశీయులు ఎక్కువగా ఉండే జర్మన్ బేకరీలో ఫిబ్రవరి 12న రాత్రి ఏడున్నర గంటలకు పేలుడు సంభవించింది. పేలుడు కారణంగా తొమ్మిది మంది చనిపోగా 53 మంది గాయాలపాలయ్యారు. మృతుల్లో ఒకరు, క్షతగాత్రుల్లో ముగ్గురు విదేశీయులున్నారు.

## ప్రెసిడెన్సీ భూ కుంభకోణం

బెంగుళూరులో ప్రెసిడెన్సీ గ్రూప్ అనే రియల్ ఎస్టేట్ సంస్థ రూ. 500 కోట్ల కుంభకోణానికి పాల్పడింది. కంపెనీ నిర్వాహకులు వి. భాస్కరరెడ్డి, టి.ఆర్. రెడ్డి ఈ సంస్థ నిర్వాహకులు. మార్కెటింగ్ నెట్‌వర్క్‌తో 'బ్యాక్ టు బ్యాక్' అనే పథకాన్ని ప్రవేశపెట్టి వందకు ఐదు రూపాయల వడ్డీ అని ప్రజలను ఆకర్షించారు. ఈ సంస్థ ఇస్తానన్న అధిక వడ్డీరేటుకు ఆశ పడి 4500 మంది పెట్టుబడులు పెట్టి చిక్కుల్లోపడ్డారు. సంస్థకు ఆదాయ మార్గంలేక ఇస్తానన్న వడ్డీరేటు ఇవ్వకుండా బెదిరింపులకు దిగింది. 500 కోట్ల పెట్టుబడుల్లో 200 కోట్లు ఆంధ్రప్రదేశ్‌కు చెందినవారివే. ఇందులో పెట్టుబడులు పెట్టిన వారిలో అత్యధికులు బెంగుళూరు పోలీసు అధికారులు, ఆంధ్రప్రదేశ్‌కు చెందిన రాజకీయ నాయకులు కూడ ఉన్నారు.

## కాశ్మీర్‌లో హిమపాతం

కాశ్మీర్ లోయలో మంచు కొండచరియలు విరిగిపడడం కారణంగా మరణించిన సైనికుల సంఖ్య ఫిబ్రవరి 9 నాటికి 20కి చేరుకుంది. కాశ్మీర్‌కు 145 కిలోమీటర్ల దూరంలో ఉన్న కుప్వారా జిల్లాలోని తంగ్ధర్ అనే ప్రాంతంలో మంచు ఎక్కువగా పడుతోంది. అక్కడే ఉన్న సైనిక శిబిరాన్ని మంచు వర్షం కప్పేయడంతో మంచులో సైనికులు కూరుకుపోయి అతికష్టం మీద బయటపడగలిగారు. అందులో ఒకరు చనిపోయారు.

## కాశ్మీర్ యువకుణ్ణి కాల్చిచంపిన బిఎస్ఎఫ్

శ్రీనగర్‌కు చెందిన కాశ్మీర్ యువకుణ్ణి కాల్చి చంపిన కేసులో బిఎస్ఎఫ్ 68వ బెటాలియన్ కమాండెంట్ ఆర్.కె. బిర్దితోపాటు ఘటన సమయంలో ఉన్న మరో 14 మంది జవాన్లను కేంద్ర హోంశాఖ సస్పెండ్ చేసింది. ఫిబ్రవరి 5న శ్రీనగర్‌కు సమీపంలోని బ్రెయిన్-నిషాత్ ప్రాంతంలో క్రికెట్ ఆడుకుంటున్న 16 ఏళ్ల యువకున్ని అతి సమీపంనుంచి కాల్చిచంపారు. బిఎస్ఎఫ్ నేరాన్ని అంగీకరించింది. జహీద్ ఫరూక్ షాను చంపింది లిక్విందర్ కుమార్ అనే జవాన్ అని తెలిపారు. అయితే కమాండెంట్ ఆదేశాల మేరకే తాను కాల్పులు జరిపినట్టు కుమార్ విచారణలో వెల్లడించాడు.

## ఒబిసిలో ముస్లింలకు 10 శాతం రిజర్వేషన్

ఒబిసి కోటాలో ముస్లిం మైనారిటీలకు 10 శాతం రిజర్వేషన్ ఇవ్వనున్నట్టు పశ్చిమబెంగాల్ ముఖ్యమంత్రి బుద్దదేవ్ భట్టాచార్య ఫిబ్రవరి 7న ప్రకటించారు. రాష్ట్రంలో విద్యాపరంగా, సామాజికంగా , ఆర్థికంగా వెనుకబడిన ముస్లింలకు ఒబిసి కేటగిరిలో పదిశాతం కోటా అమలుచేయబోతున్నాం అన్నారు. ఈ కోట పరిధిలోకి వచ్చే ముస్లింలను గుర్తించి ఆ వెంటనే రిజర్వేషన్‌ను వర్తింపచేస్తామన్నారు. రాష్ట్రంలో ప్రస్తుతం ఉన్న ఒబిసి కోటా 7 ముస్లింలకు ఇచ్చే రిజర్వేషన్‌ను కలిపితే 17 శాతానికి చేరబోతోంది. ముస్లింలలో క్రిమీలేయర్ (వార్షికాదాయం నాలుగున్నర లక్షల రూపాయలు దాటిన సంపన్న) వర్గాలకు రిజర్వేషన్ వర్తించదని తెలిపారు.

## చర్చిలపై దాడులు సంఘ్‌పరివార్ పనే

కర్ణాటకరాష్ట్రంలోని మంగుళూర్‌లో 2008 సెప్టెంబర్ 14న చర్చిలపై దాడులు జరిగాయి. ఈ దాడుల్లో భజరంగ్‌దళ్, విశ్వహిదూ పరిషత్, శ్రీరామసేన, సంఘ్‌పరివార్ సంస్థల హస్తం ఉన్నట్లు జస్టిస్ సోమశేఖర్ కమిషన్ దర్యాప్తులో వెల్లడయ్యింది. ఈ దాడులపై దర్యాప్తు చేస్తున్న కమిషన్ తన మధ్యంతర నివేదికను ఫిబ్రవరి 1న మంగళూర్‌లో హోంశాఖ అదనపు కార్యదర్శి అభిజిత్ దాస్‌కు అందజేసింది.

## మహింద రాజపక్ష విజయం

శ్రీలంకలో జనవరి 26న అధ్యక్ష ఎన్నికలకు జరిగిన పోటీలో ప్రస్తుత అధ్యక్షుడు మహింద రాజపక్ష మరోసారి విజయం సాధించారు. మొత్తం 1.48 కోట్ల మంది ఓటర్లలో 70 శాతం మంది ఓటు హక్కును వినియోగించుకున్నారు. వారిలో 60.16 లక్షల ఓట్లు రాజపక్షకు రాగా, 41.73 లక్షల ఓట్లు ప్రతిపక్ష అభ్యర్థి, మాజీ ఆర్మీ చీఫ్ శరత్ ఫోన్సెకాకు వచ్చాయి. ఎల్.టి.టి.ఇ.పై విజయం సాధించిన తర్వాత జరిగిన ఈ ఎన్నికల్లో ప్రజలు రాజపక్షకే మద్దతు తెలిపారు.

## చైనాలో వ్యవసాయ కాలుష్యం

చైనాలోని పారిశ్రామిక రసాయనిక వ్యర్థాల కాలుష్యంతో సమానంగా వ్యవసాయ క్షేత్రాల నుంచి విష పదార్థాలు అక్కడి నదులూ, చెరువులలో కలుస్తున్నాయి. మొట్టమొదటిసారి వ్యవసాయ క్షేత్రాలు కలుగజేస్తున్న కాలుష్యంపై జరిపిన సర్వేలో ఈ విషయాలు తెలిసాయి. జాతీయ కాలుష్య గణనలో భాగంగా మూడు దశాబ్దాల ఆర్థిక సంస్కరణలు తెచ్చిపెట్టిన కాలుష్యంపై ఈ పరిశోధన జరిగింది. దాదాపు ఆరు లక్షల మంది ప్రజలను కలిసి, అరవై లక్షలకు పైగా పారిశ్రామిక, నివాస, వ్యవసాయ క్షేత్రాలలో పరిశోధనల ఆధారంగా ఈ సర్వే నివేదిక రూపొందింది.

## నైజీరియాలో ఆటవిక న్యాయం

నైజీరియాలో సైనికులు, పోలీసులు సామాన్య ప్రజలను విచక్షణా రహితంగా కాల్చి చంపుతున్నారు. పట్టుకున్న వారిని విచారణ అనేది ఏమీ లేకుండా వేలాదిమందిని తుపాకులతో కాలుస్తున్నారు. మహిళలు, పిల్లలు, వికలాంగులు అని ఎవరినీ వదిలిపెట్టడం లేదు. నగరంలోని ఒక బావిలో 150కి పైగా మృతదేహాలు లభ్యమయ్యాయి. ముస్లిం - క్రిస్టియన్ ఘర్షణలు కూడా తోడవడంతో మరణిస్తున్న వారి సంఖ్య దాదాపు నాలుగు వందలకు పైగా ఉండొచ్చని రెడ్ క్రాస్ సంస్థ తెలిపింది. పెద్ద ఎత్తున ప్రాణ నష్టం, ఆస్తి నష్టం సంభవిస్తుండడంతో ప్రజలు నివాసాలు వదిలి వలస వెళ్లిపోతున్నారు.

## సొమాలియాలో ఘర్షణలు

సొమాలియాలో ప్రభుత్వ దళాలకూ, అక్కడి తీవ్రవాదులకు జరుగుతున్న పోరులో సామాన్య ప్రజలు తీవ్రంగా నష్టపోతున్నారు. ప్రాణనష్టం, ఆస్తినష్టం భారీగా ఉంది. దాదాపు 250 మందికి పైగా చనిపోయారు, 300 మందికి పైగా గాయపడ్డారు. దాదాపు ఎనభై వేలమందికి పైగా నిరాశ్రయులయ్యారు. ఈ భీకర దాడుల వల్ల గాయపడ్డ వారికీ, నిరాశ్రయులకు సహాయం అందించడం కష్టంగా మారుతోందని ఐక్య రాజ్య సమితి ప్రతినిధి తెలిపారు.

## శ్రీలంక మాజీ ఆర్మీ చీఫ్ అరెస్ట్

ఎల్.టి.టి.ఇ.ని తుదముట్టించడంలో కీలక పాత్ర పోషించిన ఆర్మీ చీఫ్ శరత్ ఫోన్సెకాను శ్రీలంక మిలిటరీ పోలీసులు ఫిబ్రవరి 8న అరెస్ట్ చేశారు. సైనిక సర్వీసులో ఉండగా ఫోన్సెకా చేసిన నేరాలకు గాను ఆయనను సైనిక న్యాయస్థానంలో కోర్ట్ మార్షల్ చేస్తామని రక్షణ శాఖ తెలిపింది. ఇటీవలే ఫోన్సెకా శ్రీలంక అధ్యక్ష ఎన్నికల్లో అధ్యక్షుడు రాజపక్సకు పోటీగా నిలబడి ఓడిపోయారు. ఎన్నికల ఫలితాల రోజున, జనవరి 27న ఆయన బస చేసిన హోటల్‌ను సైనికులు చుట్టుముట్టారు. ఫోన్సెకాతోపాటు ఆయన మీడియా కార్యదర్శి సెనెకా డిసిల్వాను కూడా మిలిటరీ పోలీసులు అరెస్ట్ చేశారు. ఫోన్సెకా లంక సైన్యంలో నాలుగు దశాబ్దాల పాటు పనిచేసి పదవీ విరమణ చేశారు.

## అమెరికా జంబో బడ్జెట్

అమెరికా అధ్యక్షుడు బరాక్ ఒబామా 3.83 ట్రిలియన్ డాలర్ల వార్షిక బడ్జెట్‌ను అమెరికా కాంగ్రెస్ ముందు ప్రవేశపెట్టారు. విపరీతంగా పెరిగిపోయిన నిరుద్యోగాన్ని ఎదుర్కోవడానికి ధనవంతులపై పన్నులు విధించడం, ప్రభుత్వ అనవసర కార్యక్రమాలపై ఖర్చును తగ్గించడం, ఇంకా ఇతరత్రా మార్గాల ద్వారా ఈ బడ్జెట్‌ను సమకూర్చుకోవాలనే ఆలోచనతో రూపొందింది. వార్షిక లోటు రికార్డ్ స్థాయిలో 1.56 ట్రిలియన్ డాలర్లుగా ఉంది. ఈ సందర్భంగా ఉపాధి సృష్టించడమే తన ప్రధాన లక్ష్యంగా ఒబామా ప్రకటించారు.

## యెమెన్‌లో కాల్పుల విరమణ

యెమెన్‌లోని ప్రభుత్వ వ్యతిరేక సంస్థ అల్-హౌతీ గ్రూప్ కాల్పుల విరమణకు ప్రతిపాదించింది. గత ఆరు సంవత్సరాలుగా అల్-హౌతీ గ్రూప్‌కీ, ప్రభుత్వ బలగాల మధ్య జరుగుతున్న అంతర్గత యుద్ధంలో అపార ప్రాణ నష్టం, ఆస్తి నష్టం సంభవించింది. ప్రభుత్వం గనక కాల్పులు విరమించినట్టయితే తాము కూడా యుద్ధాన్ని ఆపుతామని ప్రకటించింది. ప్రభుత్వం సూచించిన ఐదు సూత్రాల ప్రతిపాదనను స్వీకరిస్తున్నామని ఆ సంస్థ అధ్యక్షుడు అబ్దుల్ మలిక్ అల్ హౌతీ తెలిపారు. కాల్పుల విరమణ సఫలం అయితే జనవరి 27న లండన్‌లో జరిగిన అంతర్జాతీయ సదస్సులో ప్రతిపాదించిన అభివృద్ధి పథకాలు యెమెన్‌లో అమలు చేయడానికి వీలవుతోందని పరిశీలకులు అభిప్రాయ పడ్డారు.

## బడా వేతనాల బిబిసి

బ్రిటిష్ బ్రాడ్‌కాస్టింగ్ కార్పొరేషన్ (బిబిసి) లో పనిచేసే 58 మందికి పైగా ఉన్నతాధికారుల జీతాలు బ్రిటిష్ ప్రధాని గార్డన్ బ్రౌన్ జీతం కంటే చాలా ఎక్కువగా ఉన్నాయి. తేడా అంటే మామూలు తేడా కాదు, మూడు నాలుగు రెట్లు మేరకు తేడా ఉంది. బ్రౌన్ జీతం సంవత్సరానికి 1,94,250 పౌండ్లు. బిబిసి అర్హతలకు, ప్రతిభకు మించి జీతాలు చెల్లిస్తున్నదని మిగిలిన ప్రసార సంస్థలు ఆరోపిస్తున్నాయి. బిబిసి సంస్థ డైరెక్టర్ జనరల్ మార్క్ థాంప్సన్‌కి సంవత్సరానికి 6,64,000 పౌండ్లు, డిప్యూటీ డైరెక్టర్ జనరల్ మార్క్ బైఫోర్డ్‌కి సంవత్సరానికి 4,71,000 పౌండ్లు జీతాలతో మొదటి రెండు స్థానాలలో ఉన్నారు. వీ

# అసహజ మరణాల సూచి

సంకలనం : రాంకి, వై. రామచంద్రం

మరణం ఎప్పుడయినా విషాద సూచకమే. మృతుల బంధువులకూ, మిత్రులకూ విచారకరమే కాని అందులోనూ మరణించిన మనిషి నిండు జీవితం గడిపి వయోభారంతోనే మరణిస్తే దాన్ని సహజ మరణంగా అంగీకరించి ఊరట పడవచ్చు. సగటు ఆయు ప్రమాణంలో సగం కూడా అనుభవించక ముందే మరణిస్తున్నారు. ఈ అసహజ మరణాలకు లెక్కలేనన్ని ఆర్థిక, సామాజిక, రాజకీయ కారణాలున్నాయి. మన పక్కనే మనతోనే ఉండే మనుషులు అర్ధాంతరంగా అసహజంగా అకాలంగా అదృశ్యమైపోతున్నారు. ఇటువంటి అసహజ మరణాలు ఇటీవలి కాలంలో విపరీతంగా పెరిగిపోతున్నాయి. ఇవి సామాజిక సంక్షోభానికి, సమాజం దిగజారుడుకు ఒక చిహ్నం. మన రాష్ట్రంలో సాలీనా ఈ రకంగా చనిపోతున్న వారి సంఖ్య వేలల్లోనే ఉంటుందని అంచనా. నిజానికి అసహజ మరణాలన్నీ అసహజ మరణాలుగా నమోదు కావడం లేదు గనుక ఈ సంఖ్య వాస్తవంలో ఒక భాగం మాత్రమే కావచ్చు. పత్రికలలో అచ్చయిన ఇటువంటి ఘటనలన్నిటినీ ఒక్కచోట నమోదు చేయాలని భావిస్తున్నాం. ఈ శీర్షిక ప్రతి నెల ఉంటుంది. అయితే రాష్ట్రంలో ప్రతి గ్రామంలో జరుగుతున్న సంఘటనలన్నీ ఇక్కడ రిపోర్ట్ కాకపోవచ్చు. కొన్నయినా మనల్ని ఆలోచింపజేస్తే, మనం మనచుట్టూ ఉన్న మనుషులకోసం ఇంకాస్త బాధ్యతగాను, జాగ్రత్తగాను వ్యవహరిస్తూ మొత్తంగా పరిష్కారాలవైపు వెళ్లడానికి ఏమయినా తోడ్పడితే ఈ శీర్షిక విజయవంతమైనట్లే.

**(21 జనవరి 2010 నుండి 20 ఫిబ్రవరి 2010 వరకు అసహజ మరణాల పాలైన వారి సంఖ్య – 1813)**

| జిల్లా | ఆకలి | ఆత్మహత్యలు | | | | చికిత్స అందక, అనారోగ్యం | | | గుర్తు తెలియని | | హత్యలు | | ప్రమాదాలు | | | | పోలీసు కాల్పుల్లో | | పోలీసులు, సైన్యం | మిస్సింగ్/ లాకప్ మరణాలు | ప్రకృతి వైపరీత్యాలు |
|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|
| | | వ్యవసాయ రంగం | చేనేత రంగం | ఇతరాలు | | | | | | | | | పనిచేసే స్థలంలో | కరెంట్ | రహదారి | ఇతరాలు | ఉద్యమ కారులు | ఇతరులు | | | |
| | | | | స్త్రీ | పు. | స్త్రీ | పు. | పి. | స్త్రీ | పు. | స్త్రీ | పు. | | | | | | | | | |
| **(1)** | **(2)** | **(3)** | **(4)** | **(5)** | **(6)** | **(7)** | **(8)** | **(9)** | **(10)** | **(11)** | **(12)** | **(13)** | **(14)** | **(15)** | **(16)** | **(17)** | **(18)** | **(19)** | **(20)** | **(21)** | **(22)** |
| ఆదిలాబాద్ | – | 4 | – | 16 | 29 | 1 | 3 | 1 | – | 1 | 3 | 6 | 3 | 4 | 24 | 30 | – | – | – | 2 | – |
| హైదరాబాద్ | – | – | – | 11 | 11 | – | 1 | – | 2 | 4 | 11 | 10 | – | – | 34 | 12 | – | – | – | 9 | – |
| కరీంనగర్ | 1 | 9 | – | 28 | 99 | 8 | 24 | 1 | 8 | 6 | 3 | 4 | 5 | 4 | 32 | 16 | – | – | – | 7 | 1 |
| ఖమ్మం | – | – | – | 6 | 12 | 3 | 16 | 3 | 4 | 2 | 5 | 3 | 1 | 2 | 22 | 5 | – | – | – | – | – |
| మెదక్ | 1 | 2 | 1 | 5 | 5 | 4 | 12 | 4 | – | 1 | 3 | – | 1 | 6 | 28 | 4 | – | – | – | – | – |
| నిజామాబాద్ | 1 | – | – | 10 | 27 | – | 4 | – | – | 1 | 1 | 3 | – | 1 | 13 | 4 | – | – | – | – | – |
| రంగారెడ్డి | – | 7 | – | 12 | 15 | 5 | 8 | 2 | 4 | 5 | 2 | 4 | 5 | 1 | 42 | 11 | – | – | – | – | – |
| వరంగల్ | – | – | – | 5 | 25 | 3 | 8 | – | – | 5 | – | 1 | 2 | 1 | 15 | 17 | – | – | – | – | – |
| అనంతపురం | – | 5 | 3 | 11 | 10 | 2 | – | – | 1 | 5 | 1 | 5 | 1 | – | 31 | 3 | – | – | – | – | – |
| చిత్తూరు | – | – | – | 8 | 15 | 2 | 2 | – | – | – | 2 | 5 | – | – | 28 | – | – | – | – | – | – |
| కడప | – | 3 | – | 3 | 5 | 2 | 4 | 2 | 4 | 2 | – | – | 5 | 2 | 15 | 7 | – | – | – | – | – |
| కర్నూలు | – | 5 | 1 | 20 | 19 | 4 | 2 | 2 | 4 | 9 | 3 | 5 | 4 | 2 | 33 | 23 | – | – | – | 3 | – |
| తూర్పు గోదావరి | – | 1 | 1 | 7 | 9 | 4 | 3 | 1 | 1 | 3 | 4 | 3 | 6 | 1 | 54 | 42 | – | – | – | 1 | – |
| గుంటూరు | – | – | – | 4 | 7 | 1 | 2 | – | 1 | 3 | 5 | 5 | 3 | 1 | 24 | 9 | – | – | – | 1 | – |
| కృష్ణా | – | 2 | – | 7 | 4 | 3 | 2 | 3 | – | – | 2 | 6 | – | – | 16 | 12 | – | – | – | – | 1 |
| నెల్లూరు | – | – | – | 9 | 12 | 1 | 1 | – | 1 | 1 | 1 | 1 | – | 4 | 26 | 22 | – | – | – | – | – |
| పశ్చిమ గోదావరి | – | – | – | 9 | 14 | – | – | – | 1 | 1 | 4 | – | – | – | 9 | – | – | – | – | – | – |
| శ్రీకాకుళం | 1 | – | – | 5 | 5 | 3 | 4 | 6 | 2 | 1 | 1 | 6 | 2 | – | 14 | 4 | – | – | – | – | – |
| విశాఖపట్నం | – | – | – | 15 | 6 | 3 | 4 | – | 3 | 4 | 11 | 3 | 2 | – | 23 | 6 | – | – | – | 5 | – |
| విజయనగరం | – | – | – | 1 | 4 | 1 | – | – | 2 | 4 | – | 1 | 3 | 1 | 24 | 5 | – | – | – | – | – |
| **మొత్తం** | **4** | **32** | **6** | **192** | **333** | **50** | **100** | **25** | **38** | **58** | **62** | **71** | **43** | **30** | **507** | **232** | **–** | **–** | **–** | **28** | **2** |

అందిస్తున్నవారు : ఆదిలాబాద్ – సి.ఎచ్. శ్రీమన్నారాయణ మూర్తి; హైదరాబాద్ – డి. విజయభాస్కర్; కరీంనగర్ – ఎల్. సంతోష్; ఖమ్మం – సి.ఎచ్. గిరిజ; మెదక్ – ఎన్. భగవాన్‌రెడ్డి; నిజామాబాద్ – ఎం. నర్సయ్య; రంగారెడ్డి – శంకరయ్య, వరంగల్ – ఎ.కుమార్; అనంతపురం – సుమలత; చిత్తూరు – పలమనేరు బాలాజి; కడప – బి. దస్తగిరి; కర్నూలు – జి.వి. సుధాకర్ రెడ్డి; తూర్పు గోదావరి – మహమ్మద్ ఇబ్రహీమ్ సాహెబ్; గుంటూరు – బి. అంజమ్మ ; కృష్ణా – బి. రమేష్‌బాబు; నెల్లూరు – కె. సుబ్బనాచారి; పశ్చిమ గోదావరి – టి. హేమలత; శ్రీకాకుళం – జి. సుధీర్; విశాఖపట్నం – కె.వి. అరుణ; విజయనగరం – డి. సుధాకర్

# వీక్షణం రచయితల సమావేశంలో పాల్గొన్న రచయితలు, మిత్రులు



సరళ | సి.ఎస్.ఆర్. ప్రసాద్ | పి.వి. రమణ | ఎ. రంగారెడ్డి | దుప్పల రవికుమార్ | విద్యాభూషణ్



టి. వివేక్ | ఎస్. నీలాదేవి | ఎం. రాఘవాచారి | శ్రీధర్ దేశ్‌పాండే | పులుగుజ్జు సురేష్ | కె. విజయకుమార్



కె. సురేష్ | ఎ. నర్సింహారెడ్డి | ఎస్. సరళ | కాకరాల | కె.వి. కూర్మనాథ్ | ఎ. ప్రసాద్‌రావు



వి. శంకరయ్య | రావెల సోమయ్య | ఎ. కుమార్ | ఎల్. సంతోష | బి. రామకృష్ణ | సి.ఎచ్. శ్రీమన్నారాయణ



జి. అమర్‌నాథ్ | టి. రమేష్ | క్రాంతికార్ | ఎ. వెంకటేష్ | ఎం. జయలక్ష్మి | డి. అజయ్



ఆర్. సుబ్బారావు | డి.విజయ్‌భాస్కర్ | ఎ. గవర్‌రాజు | ఎం. గంగారెడ్డి | వై. వేణుగోపాల్‌రెడ్డి | ఎం. శ్రీనివాస్

VEEKSHANAM Telugu Monthly Journal of Political Economy and Society - 104 - March 2010
• RNI Regn.No.APTEL/2003/11482• Published on 28/02/2010 • Postal Regn. No. LII/RNP/HD/1100/2008-10



Edited, printed, published and owned by N. Venugopal Rao, Printed at Charitha Impressions, 1-9-1126/B, Azamabad, Hyderabad - 500 020 and Published at 3-6-394, Mythri Residency, Street No. 3, Himayatnagar, Hyderabad 500 029. Editor : N. Venugopal Rao